సెప్టెంబరు 2005

332వ సంచిక

# చతుర

వెల: రూ. 7/-





కొత్త శీర్షికలు

కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయం

ప్రేమగానం

వావ్



ఓల్గా స్వేచ్ఛ

కథ వెనుక కథ

# జలపాత మాలిక



ప్రకృతి ఒడిలో విరబూసిన జలపాతాల మాలిక ఇది. అర్జెంటీనా రాజధాని బ్రెజిల్ సరిహద్దులోని ఇగాజులో కొలువుదీరిన 275 జలపాతాలలో ఒక భాగం ఈ దృశ్యం. ఈ జలపాతాలు 2.7 కిలోమీటర్ల పరిధిలో గుర్రపునాడా ఆకారంలో విస్తరించి ఉన్నాయి. వీటిలో కొన్ని 269 అడుగుల ఎత్తునుంచి కిందకు ప్రవహిస్తున్నాయి. ఈ జలపాతాల ముందు నయాగరా జలపాతం ఒక నల్లా నుంచి ప్రవహించే ధార వంటిది మాత్రమేనని అమెరికా మాజీ అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్ సతీమణి ఎలియానార్ రూజ్‌వెల్ట్ అభివర్ణించారు.

వైవిధ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 28 సంచిక : 8
సెప్టెంబరు: 2005 332వ సంచిక

## ఈ సంచికలో...

### ఈ నెల నవల



### ఇతర శీర్షికలు



ఇంకా జామవా భలోక్తులు, ఫొటోఫీచర్లు

బొమ్మలు: పెనిశెట్టి

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (10)

## విలియం సారోయన్

అమెరికన్ రచయిత విలియం సారోయన్ కథలు చైతన్యకాంతిశిఖలు (ఇతని కథలు కొన్నింటిని శ్రీశ్రీ గారు తెలుగులోకి అనువదించారు) "మైనేమ్ ఈజ్ ఆరామ్" తో ప్రారంభించి "ది డేరింగ్ యంగ్‌మాన్ ఆన్ ది ఫ్లైయింగ్ ట్రెపిజి"తో కథాలోకంలో సంచలనం సృష్టించాడు. కథన పద్ధతులలో ప్రయోగాలు చెయ్యటం ఇతని విలక్షణత. మొత్తం ఎనిమిది నవలలూ, పన్నెండు కథల సంపుటాలూ, మరో పన్నెండు నాటకాలూ రాశాడు. "ది టైం ఆఫ్ యువర్ లైఫ్" నాటకానికి పులిట్జర్ బహుమతి వచ్చింది.



విలియం సారోయన్

సారోయన్ దృష్టిలో కథంటే- "ఒక కళారూపం. ప్రాణం పోసుకున్న ఒక ఊహ. జీవి పరిమాణం ఎంతైనా, జీవితకాలం ఎంతైనా అది ఒక స్పందించే, శ్వాసించే సృష్టి వైచిత్రి. ప్రతి ప్రాణికీ ఒక పరిపూర్ణత ఉంటుంది. చీమగానీ, రాక్షసి బల్లిగానీ- ప్రాణం ప్రాణమే.

అందరూ అడుగుతుంటారు. కథంటే ఏమిటని? నాకు తెలియదు. ఎవరికీ తెలుసనుకోను. బహుశా, తెలుసుకోవటం ముఖ్యం కూడా కాదు. కళా రూపం ఎలా ఊహలా మనలో ప్రవేశిస్తుందో, ఎలా ఎదుగుతుందో, ఎలా రూపం దిద్దుకుని కాగితం మీదికి వస్తుందో ఎవరు చెప్పగలరు? రచన అంటే శిశు జననమంత మిస్టరీ. గర్భం వచ్చిన తర్వాత తల్లి తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకోవాలి రచయిత. అంతవరకే తెలుసు.

రచన ఒక ప్రయాణం. అడుగులు ముందుకే కదలాలి. వెనుదిరిగి చూడగూడదు. 'కథ', 'పెద్ద కథ', 'నవల' లాంటి పేర్లంటారా, తప్పదు. కాని వాటిని పట్టించుకోవలసిన అవసరం లేదు. అందంగా కనిపించే ప్రాణంలేని "బిలియర్డ్ బాల్"కన్నా అంత అందంగా లేకపోయినా పొదగగలిగిన 'గుడ్డు'లో ప్రాణం ఉంది. అరేంజ్‌మెంట్ ముఖ్యం కాదు. సృష్టి ముఖ్యం.

లాక్షణికులు చెప్పిన లక్షణాలేవీ లేకపోయినా సరే, ప్రాణమున్న కథంటేనే నాకిష్టం (దాన్ని 'కథ' అనకపోయినా ఫరవాలేదు). అచ్చయినా, కాకపోయినా తేడా లేదు. ప్రచురణ డబ్బుతో కూడుకున్న విషయం. ఆర్థిక సూత్రాలన్నీ దానికి వర్తిస్తాయి. లాభాలు



సంపాదించి పెట్టే నిర్జీవ రూపాల్ని తయారు చేసే వాళ్లను 'మహా రచయితలు' అని కూడా అనవచ్చు. కాని నేను మాత్రం సజీవ కళారూపాల పక్షం.

ఓ కుర్రవాడు కత్తివిద్య నేర్పమని అభ్యర్థించాడు. గురువు అంగీకరించాడు. అడవికి వెళ్లి కట్టెలు కొట్టి తెచ్చి, నీళ్లు తోడి, వంట వండి, ఇల్లూడ్చి సపర్యలు చేశాడు శిష్యుడు. ఎన్నాళ్లు గడిచినా విద్య మాత్రం నేర్పలేదు గురువు. విసుగొచ్చింది. నిలదీశాడు శిష్యుడు. గురువు చిరునవ్వుతో "నేర్చుకో" అంటూ శలవిచ్చాడు. ఫలితం శిష్యుడికి శాంతి లేదు. క్షేమం లేదు. దెబ్బలకు ఎప్పుడు చస్తాడో తెలియదు.

ఉదయం వంట చేస్తున్నప్పుడు గురువు వెనుక నుండి వచ్చి కర్రతో కొట్టేవాడు. ఊడుస్తున్నప్పుడు మరో దెబ్బ. లేచినా, కూర్చున్నా దెబ్బలు. ఎక్కణ్ణించి వచ్చాడో, ఎలా కొట్టాడో కూడా తెలిసేది కాదు. గురువుగారి ఆగడాల్నించి తప్పించుకోగలగటానికి శిష్యుడికి చాలా రోజులు పట్టింది.

కానీ గురువుకింకా శిష్యుడి మీద నమ్మకం కలగలేదు.

ఒకనాడు గురువు పొయ్యి దగ్గర కూర్చున్నప్పుడు దొంగదెబ్బ వెయ్యాలనుకున్నాడు శిష్యుడు. రహస్యంగా వచ్చి, బడితతో గురువు మీదికి లంఘించాడు. గురువు కుండ మీది మూతను అడ్డుపెట్టి తప్పించుకున్నాడు.

యుద్ధరహస్యం అప్పటికిగాని బోధపడలేదు శిష్యుడికి. కృతజ్ఞతతో గురువుకు పాదాభివందనం చేశాడు.

ఈ కథను ఎవరు ఎలా అర్థం చేసుకుంటారో తెలియదు.

యుద్ధం అంటే అనూహ్య సంఘటనకు తక్షణ స్పందన. నేర్పరితనం అవసరమే. కాని అంతకన్నా ముఖ్యం ఆంటిసిపేట్ చెయ్యగలగటం.

ఇది నేర్పితే నేర్చుకునేది కాదు. మన స్వభావంలో రావలసిన మార్పు.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు)

✦

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

# డాన్ క్విక్సోట్

స్పానిష్ నవల

మిగ్యెల్ డి సెర్వాంటెస్

## కథా సంగ్రహం

లామాంకా ప్రాంతంలో ఓ యాభై ఏళ్ళ పేదవాడున్నాడు. పూట గడవటం కష్టమైనా హంగూ, ఆర్భాటాలకు మాత్రం కొదవలేదు. బల్లెం, బక్కచిక్కిన గుర్రం, జాగిలం డాన్ క్విక్సోట్‌కు తప్పనిసరి.

మన పడక్కుర్చీ వీరుడు ఏడాది పొడుగునా సాహసగాథలు చదివి కాలక్షేపం చేస్తాడు. కాలక్రమాన, ఈ పఠనావ్యాసంగం వ్యసనంగా మారింది. ఆస్తి అమ్ముకుని మరీ పుస్తకాలు కొన్నాడు. చదువుకు అంతం లేదు. రాత్రినుంచి తెల్లారిందాకా, ఉదయంనుంచి రాత్రిదాకా ఎడతెగని చదువు. కథల్లోని పాత్రలు, వాళ్ల అడ్వెంచర్లే అతడి లోకం.

పిచ్చి ముదిరితే ఏమవుతుంది? అలాంటి సాహసకార్యాలు తనూ స్వయంగా చెయ్యాలి. అది తన విధ్యుక్త ధర్మమనుకున్నాడు. ప్రమాదం అంచున, సాహసమే ఊపిరిగా బతికే వాళ్లనేకదా వీరాధివీరులంటారు. శిష్టరక్షణ, దుష్టశిక్షణ తన కర్తవ్యం.

మొదట అటకమీది నుంచి తుప్పు పట్టిన, తాతలనాటి కవచాన్ని కిందికి దించాడు. ఎముకలు తేలిన గుర్రం (దాని పేరు రోసినాంట్) మీద జీను వేశాడు. బల్లెం పట్టుకుని బయల్దేరాడు.



మిగ్యెల్ డి సెర్వాంటెస్ సావెద్ర

వీరుడన్న తర్వాత ఒక ప్రేయసి ఉండక తప్పదు మరి. ఆమె కోసమే గదా ఈ సాహసాలన్నీ! ఆ ఊళ్లో ఓ స్త్రీ ఉంది. పేరు ఆల్డోన్సా లోరెంజో. ఛీ, పల్లెటూరి పేరు. పుస్తకాల్లోని హీరోయిన్ల కుండే పేరు కావాలి. తన ఊహాల్లో ఆమెను డల్సినియా డెల్ టొబాసో గా ఊహించుకున్నాడు.

ఈ లోకం ప్రమాదంలో వున్నది. దీన్ని కాపాడవలసిన బాధ్యత తన మీదుంది.

కడప్రాణంతో వున్న గుర్రం. పైన మనిషి. మని షికి నాల్గింతలు బరువున్న కవచం. ఊరు దాటి ఓ సత్రం చేరుకునే సరికి చీకటి పడింది. కవచంలోని మని షిని గుర్తించటం కష్టం. ఎవరో పెద్దమనిషనుకుని సత్రం యజమాని సాద రంగా ఆహ్వానించాడు. "రాత్రికిక్కడ బస చేస్తారా? మీ అవసరాలేమిటో చెప్పండి" అంటూ అర్థిం చాడు. డాన్ క్విక్సొట్ దృష్టిలో అది సత్రం కాదు. ఒక దుర్భేద్యమైన కోట. దుర్గపాలకుడు తనకు నీరా



ప్రముఖ చిత్రకారుడు పాబ్లో పికాసో కుంచె నుంచి రూపం పోసుకున్న డాన్ క్విక్సాట్, సాంకోపాంజా



వింత మానవి డాన్ క్విక్సాట్‌కు మరో చిత్రకారుడి ఊహాచిత్రమిది

జనం పడుతున్నాడు. భేష్! రూపం మాత్రమే కాదు; డాన్ క్విక్సొట్ మాటలు కూడా వింతగా వుంటాయి. అన్నీ నాటకీయ మైన జటిల వాక్యాలే ఆ కవచంతో పడుకో

వడం వీలు పడదు. కాని వీరు లకు సుఖం ముఖ్యం కాదు. అంత బరువుతో నడవటం కూడా కష్టమే.

కవచం తొలగించి నీటి తొట్టి దగ్గర పెట్టాడు. నీళ్ల నింపటా నికి వచ్చినవాడు దాన్ని కాస్త పక్కకు జరిపాడు. మన వీరుని కదో అవమానం.

"ఓరి తుచ్ఛుడా! నీ స్పర్శతో నా కవచం మలినమైనది! నా, కరవాలంతో నిన్ను ఖండఖండా లుగా..."అంటూ లంఘించాడు. ఈ హఠా త్పరిణామాన్ని ఊహించని పనివాడు కింద పడ్డాడు. సత్రం యజమాని, జుట్టు పీక్కుని, (ఈ తిక్కమాలోకంతో పెట్టుకోవటమెందు

కని కాబోలు) సాహసవీరుణ్ణి శాంతించమని ప్రార్థించి "ఆ మూర్ఖుణ్ణి క్షమించ"మని ప్రాధేయపడ్డాడు.

తొలి విజయంతో డాన్ క్విక్సాట్ లో ఉత్సాహం ఇనుమడించింది. కొత్త అడ్వెంచర్ల కోసం ప్రస్థానం కొనసాగించాడు.

పైన ఎండ మాడ్చేస్తోంది. నోరు పిడచ గట్టుకుపోతున్నది. దూరంగా గుర్రాల గిట్టల చప్పుడు. పదిమంది దాకా వున్నట్టుంది. మొహాల మీద ముసుగులు. వెంట ఏవో మాటలు. ఇంకెవరు శత్రువులే మన జగదేకవీరుడు వాళ్ళను యుద్ధానికి ఛాలెంజ్ చేశాడు.

వాళ్లంతా వ్యాపారస్తులు. ఊళ్లు తిరిగి వస్తువులమ్ముకోవటానికి బయల్దేరారు. మొదట. పిచ్చివాడనుకుని ఉపేక్షిస్తారు. కాని డాన్ క్విక్సాట్ మాటలు కోటలు దాటుతాయి. బల్లెంతో గాయం చెయ్యబోయినప్పుడు, ఇంక లాభం లేదనుకుని, అందరూ కలసి దేహశుద్ధి చేస్తారు. బల్లెం విరిచి చేతిలో పెడతారు.

ముక్కుతూ మూలుగుతూ తిరిగి వస్తాడు. దెబ్బలతో వొళ్లు సలుపుతుంది. పదిహేను రోజులు పడకేస్తాడు. అప్పుడు జ్ఞాపకం వస్తుంది కథల్లో హీరోలకెప్పుడూ ఓ సైడ్ కిక్ ఉంటాడని. ఆ ఊళ్లో, కూలి పని చేసుకుని బతికే సాంకోపాంజా కుబ్రెయిన్ వాష్ చేస్తాడు. పాపం, ఆ అమాయకుడు పెళ్లాం పిల్లల్ని వదిలి డాన్ క్విక్సాట్ ని అనుసరిస్తాడు. తనను ఓ బుల్లి ద్వీపానికి గవర్నర్ ని చేస్తానని వాగ్దాం చేశాడీ వీరుడు. ఆ మాటకొస్తే గవర్నరేం ఖర్మ, రాజు మాత్రం కాలేడా! అప్పుడు తన భార్య రాణి కాదా. తన పిల్లలు రాకుమారులు కారా!

## మిగ్వెల్ ది సెర్వాంటెస్ సావెద్రా

మిగ్వెల్ ది సెర్వాంటెస్ సావెద్రాకు సుమారు అరవై ఏళ్ళు. కళ్ళు సరిగా కనిపించవు. దుర్భర దారిద్ర్య పీడితుడు. పెద్ద సంసారం. తిండికి గడవటం కష్టం. చిన్నప్పుడెప్పుడో నాటకాలు రాశాడు. కాని ఎవరూ ప్రదర్శించలేదు. అనామక రచయిత. జీవితమంతా అపజయాల తోరణం. రాజుగారి దగ్గర ఉద్యోగం చేశాడు. యుద్ధంలో పాల్గొన్నాడు. గాయపడ్డాడు. శత్రువులకు చిక్కాడు. కొంత కాలానికి విడుదలై ఎలాగోలా శేషజీవితం గడపాలనుకున్న దశలో ఓ చిన్న నేరం చేసి రాజుగారి చెరసాలలో బందీ అయ్యాడు. రాయటం తప్ప మరే పనీ చేతగాదు. పాఠకులు మెచ్చే ఒక కథ రాయటం వీలుపడదా? అప్పటికి సాహసవీరుల గాథలు బాగా ప్రచారంలో ఉన్నాయి. అలాంటి కథనే పేరడీగా రాస్తే! అవే అడ్వెంచర్లు. అవే యుద్ధాలు. కాని హాస్యస్ఫోరకంగా రాస్తే... బుర్ర పాడు చేసుకున్న ఓ వయసు మళ్లిన మనిషి ఊహాలోకం నిజమని నమ్మి జగదేకవీరుడు కావాలనుకుంటే అలాంటి మనిషిని మతి భ్రమించిన వాడంటారు. వెర్రి తలకెక్కిందంటారు. వాస్తవ ప్రపంచంలో స్వాప్నిక జీవితం. పాఠకులు తప్పక ఆనందిస్తారు.

సెర్వాంటెస్ కు ఈ అయిడియా బహుశా జైల్లో వచ్చి ఉండవచ్చు. ఇంత గొప్ప కావ్య సృష్టి ఆషామాషీ ప్రయత్నాలతో వీలుపడదు. సంవత్సరాల తరబడి కృషి చేసి ఉంటాడనే విమర్శకులూ ఉన్నారు. రచయిత ఈ పుస్తకాన్ని (ఆనాటి) పండితుల కోసం కాదు- పామరుల కోసమే ఉద్దేశించాడని అందరూ అంగీకరిస్తారు.

మొత్తం మీద "ది ఇంజీనియస్ జెంటిల్ మాన్, డాన్ క్విక్సాట్ ది లామాంకా" తొలిసారిగా 1605లో వెలుగు చూసింది. పుస్తకం నిండా అచ్చు తప్పులు. ప్రింటింగు సరిగా లేదు. అయినా మాడ్రిడ్ నగరవాసులంతా చదివి పొట్ట చెక్కలయ్యేలా నవ్వసాగారు. మరో అయిదేళ్ళలో స్పెయిన్ దేశం మొత్తం నవ్వుల వరదలో కొట్టుకుపోయింది.

ప్రయాణం పునఃప్రారంభమవుతుంది. సాయంత్రం బడలికగా వుంది. ఎదురుగా విశాలమైన మైదానంలో దయ్యాలు చేతులూపుతూ విన్యాసాలు చేస్తున్నాయి.

"మహా ప్రభో, అవి గాలి మరలు!" అంటాడు సాంకో.

కాదు. అది రాక్షసుల మాయాజాలం. రోసినాంట్ వుత్సాహంగా ముందుకు పరిగెత్తుతుంది. గాలిమరల్లో చిక్కుకుని బల్లెం విరిగిపోతుంది.

"ఇది రానున్న మహాయుద్ధానికి నాంది మాత్రమే" అంటాడు డాన్ క్విక్సాట్.

యజమాని చర్యలకు ఖిన్నుడై తలపట్టుక్కూచుంటాడు సాంకో.

దుష్ట శిక్షణే ధ్యేయంగా బతికిన డాన్ క్విక్సాట్ జీవితంలో మరో మజిలీ.

చలికాలం. ఉదయం లేయెండ సుఖంగా వుంది.

దారిలో ఎదురుగా దుమ్ముతెర కమ్ముకున్నది.

"అవిగో జంట సైన్యాలు. నన్ను ఒంటరిని చేసి సంహరించటానికి దూసుకు వస్తున్నవి."

డాన్ క్విక్సాట్ మీద పుస్తకాల ప్రభావానికిదో మంచి ఉదాహరణ. కనిపించిన ప్రతి దృశ్యమూ కథలో చదివినట్టుగానే దర్శనమిస్తుందతనికి.

"అదిగో యుద్ధభేరి! అవిగో పదఘట్టనలు. అదిగో పదాతిదళం..." అంటూ ముందుకు పరిగెత్తాడు మన వీరుడు. ఈ అరుపులకు ఎదురుగా వస్తున్న గొర్రెల మంద కాస్తా చెల్లాచెదరవుతుంది. కాపరులకు కోపం వచ్చి డాన్ క్విక్సాట్‌ను గురిచూసి వడిసెల రాళ్లు సంధిస్తారు.

ప్రధానంగా హాస్యరచనే అయినప్పటికీ ఇందులో జీవిత సమగ్ర దర్శనముంది. వ్యక్తులు ఎదుర్కొనే మౌలిక సమస్యల చర్చ ఉంది. సృజనాత్మకత మూలాల గురించిన అన్వేషణ ఉంది. ఈ పుస్తక సారాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలంటే ప్రతి పాఠకుడూ దీన్ని జీవితంలో కనీసం మూడుసార్లు - యవ్వనంలో, మధ్య వయసులో, వృద్ధాప్యంలో- చదవాలంటాడు ఒక ప్రముఖ సెర్వాంటిస్టు (సెర్వాంటెస్ రచనల మీద విశేష పరిశోధన చేసిన పండితుడు). అస్తిత్వ సిద్ధాంతాన్ని (ఎగ్జిస్టెన్షియలిజం) ప్రతిపాదించిన జాఁ పాల్ సార్త్ర్ లాంటి తత్వవేత్తలకు కూడా ప్రేరణ ఈ పుస్తకంలోనే ఉందని ఒక అభిప్రాయం.

డాన్ క్విక్సాట్ (ఈ పదాన్ని 'కియొటీ' అని ఉచ్చరిస్తారు) పెద్ద నవలే. సుమారు రెండు వేల పేజీలు. మొత్తం పుస్తకం చదివిన వాళ్లు తక్కువే. కాని చదివిన వాడి జన్మ ధన్యం. ముఖ్యంగా డాన్ క్విక్సాట్ కలల రాణి డల్సినియా ప్రపంచ సాహిత్యంలో ఒక అద్భుత సృష్టి.

కాల్పనిక రచనా రహస్యాలతో పాటు నవలలో ఎన్ని విషయాల గురించిన ప్రస్తావన వస్తుందో! కథ ఎన్ని మలుపులు తిరుగుతుందో! జీవితాన్ని గురించి ఎన్ని తాత్విక భావనలో, ఎన్ని వ్యాఖ్యానాలో- అందుకే ఈ పుస్తకాన్ని "బైబిల్ ఆఫ్ హ్యూమానిటీ"గా అభివర్ణించారు.

సెర్వాంటెస్ చాలా రచనలు చేశాడు. అందులో ముఖ్యమైనవి "రింకోనేటి అండ్ కోర్టాడిల్లో", "మాన్ ఆఫ్ గ్లాస్", అవసాన దశలో రాసిన విషాదభరితమైన "ట్రబుల్స్ ఆఫ్ పెర్సైల్స్ అండ్ సిగిస్మండా".

1547లో జన్మించిన సెర్వాంటెస్ 1616 ఏప్రిల్ 23న నాడు మాడ్రిడ్‌లో మరణించాడు. "నేలలో నేలగా మారిన సెర్వాంటెస్, ఎప్పుడైనా, తనను అర్థం చేసుకునేవాళ్ళు ఈ భూమ్మీద పుట్టకపోతారా అని నిరీక్షిస్తున్నాడు" అంటూ శ్రద్ధాంజలి ఘటించాడు హోసె అర్టెగాలైగాసె.

## కథలు రాయటమెలా?

"మనం రాసే కథలు పాఠకుల మేధాశక్తికి తగినట్టుగానే ఉండాలి. అసాధ్యమైన విషయాలు సాధ్యపడతాయని నమ్మించగలగాలి. నమ్మించలేని విషయాలను కూడా ఉత్కంఠభరితంగా చెప్పగలగాలి. వినోదాన్నిస్తూనే పాఠకుడిలో తన పట్ల గౌరవాన్ని పెంచగలగాలి రచయిత. కాని అభూత కల్పన వల్ల ఇది సాధ్యపడదు. అత్యంత సహజంగా, మానవ స్వభావ చిత్రణ చేసినప్పుడు మాత్రమే సాధ్యం."

— సెర్వాంటెస్

దెబ్బలతో ఒళ్లంతా పచ్చి పుండైంది. మరి కాస్త దూరం ప్రయాణించారో లేదో, ఎదురుగా మరో శత్రువు.

చేతిలో కత్తి, డాలు.

డాన్ క్విక్సొట్ ఉగ్రరూపాన్ని చూసి శత్రువు తన గాడిద దిగి పారిపోతాడు.

"వీరాధివీరుడా, వాడు శత్రువు కాదు. మంగలి. చేతిలో ఉన్నది గడ్డం చేసే కత్తి. అది డాలు కాదు నీళ్ల గిన్నె" అంటూ లబోదిబోమంటాడు సాంకోపాంజా.

సాహసకార్యాలకే జీవితాన్ని అంకితం చేసిన డాన్ క్విక్సొట్ ఎన్ని అవాంతరాలు వచ్చినా వెనకడుగు వేసే ప్రసక్తి లేదు.

ఒకనాడు రాజవంశీకుడొకడు (డ్యూక్), అతడి భార్య తారసపడతారు. ఈ కాలంలో కూడా ఇనుప కవచం తొడుక్కున్న వీరుణ్ణి చూసి ఆశ్చర్యపోతారు. తమ ఎస్టేట్‌కు వచ్చి ఆతిథ్యం స్వీకరించమని సాదరంగా ఆహ్వానిస్తారు. ముఖ్యంగా సాంకో తెలివితేటలు డ్యూక్‌ను చకితుణ్ణి చేస్తాయి. తన అధీనంలో ఉన్న ఒక గ్రామానికి సాంకోను గవర్నర్‌గా నియమిస్తాడు.

రాజరికంలో ఆకర్షణ ఉన్నదేమోగాని సుఖం లేదు. ఆంక్షలు లేని బతుక్కు అలవాటు పడ్డ సాంకో రాజమహలులోని ఇరుకు జీవితాన్ని భరించలేడు. ఎప్పుడు చూసినా, చుట్టూ సలహాదార్లే. తను స్వయంగా ఏ పనీ చెయ్యటానికి వీల్లేదు. రాజ వైద్యుడు ముందు రుచి చూడకుండా తనకిష్టమైనది నోట పెట్టుకోవటానిక్కూడా లేదు. ఆ ఊరి మీద దాడి జరుగుతుంది. సాంకో యుద్ధం చెయ్యక తప్పదు. గాయపడిన సాంకో, ఒక రాత్రి రహస్యంగా తన గాడిదనెక్కి తిరిగి యజమాని సేవలో చేరతాడు.

పుస్తకం నిండా డాన్ క్విక్సొట్ సాహసగాథలే. చిత్ర విచిత్ర అనుభవాలు.

తను సాధించిన విజయాలన్నీ ప్రేయసికి తెలియజేయాలనుకుంటాడు డాన్ క్విక్సొట్. రాయటానికి కాగితం దొరకలేదు. అందువల్ల చెట్ల బెరడు మీద రాసి ఇస్తానంటాడు. (డల్సినియాకు చదువు రాదు) సత్రంలో ఉన్న ఇతర అతిథులకు అతడి ప్రవర్తన వింతగా కనిపిస్తుంది. పిచ్చి ముదురుతున్నదని గ్రహిస్తారు. మొత్తంమీద కాసేపు శ్లాఘించి, మంచి మాటలతో లొంగదీసుకుని, అతణ్ణి ఓ బోనులో బంధించి పంపిస్తారు.

ఊళ్ళో రచ్చబండ దగ్గిర బోను చుట్టూ మూగుతారు జనం. ఓ కుర్రాడు వెళ్ళి డాన్ క్విక్సొట్ ఇంట్లో ఈ విషయం చెబుతాడు. చిక్కి శిథిలమైన శరీరం, ఒంటినిండా గాయాలు, జ్వరం.

చికిత్స తర్వాత కాస్త కోలుకుంటాడు డాన్ క్విక్సొట్.

కథల పుస్తకాలలో ఉన్నట్టుగా నిజ జీవితంలో ఆచరిస్తే ఎంత ప్రమాదమో తెలుసుకున్నాడు- బతకాలని ఉంది.

కానీ-అంతిమ క్షణాలు సమీపించాయి.

అందరి దగ్గిరా శలవు తీసుకుని తుది శ్వాస విడుస్తాడు.

ఎం. వసంత

✦

# స్త్రీవాద సిద్ధాంత వికాసమే లక్ష్యమైన 'స్వేచ్ఛ'

కథ వెనుక కథ




**స్త్రీవాద రచయిత్రిగా ఓల్గాకు గుర్తింపు తెచ్చిన నవల 'స్వేచ్ఛ.' 1986లో నిర్వహించిన 'చతుర' నవలల పోటీలో ప్రథమ బహుమతి పొందిన ఈ రచన అప్పట్లో కొత్త ఆలోచనలకు బీజం వేసింది. స్వేచ్ఛంటే ఏమిటి? దేని నుంచి స్వేచ్ఛ? దేని కోసం స్వేచ్ఛ? ఈ ప్రశ్నల గురించి ఆలోచింప చేయాలని రచయిత్రి ఉద్దేశం. విచ్చలవిడిగా తిరగటమే స్వేచ్ఛ అనుకునేవారికి ఈ నవల బలమైన జవాబు. అప్పట్లో ఏది స్వేచ్ఛ అనే అంశం చర్చోపచర్చలకు దారితీసింది.. ఈ నవల 'కథ వెనుక కథ' ఏమిటో రచయిత్రి ఇలా వివరిస్తున్నారు..**

**1986** జనవరి 'చతుర'లో నా మొదటి నవల 'సహజ' ప్రచురితమైంది. అంతవరకూ నేను కవితలు కథలూ మాత్రమే రాశాను. 1970 నుంచీ రాస్తున్నా.. '71 నాటికి పైగంబరకవులలో ఒకరిగా రెండు కవితా సంకలనాలు వచ్చినా నా మొదటి ఆసక్తి యాక్టివిస్ట్‌గా పనిచేయటం మీదే ఉండేది. 1980 నుంచీ స్త్రీవాద రాజకీయాలలో ప్రవేశించాను. స్త్రీల ఉద్యమంలో అడుగుపెట్టాను. తెలుగులో స్త్రీవాద సిద్ధాంతాన్నీ, రాజకీయాలనూ


ఓల్గా

విస్తృతంగా చర్చలోకి తీసుకురావటానికి రచన ఒక సాధనంగా ఎంచుకుని విరివిగా రచనలు చేయటం మొదలుపెట్టాను. 'అతడు- ఆమె' నవలపై 'అతడు- ఆమె -మనం' అంటూ సాహిత్య విమర్శ రాసినా, ఎగ్నెస్ స్మెడ్లీ నవల 'భూమి పుత్రిక' అనువాదం చేసినా, 'కుటుంబ వ్యవస్థ- మార్క్సిజం'వంటి వ్యాసాలు రాసినా అన్నీ స్త్రీవాదాన్నీ, ఆ దృక్పథాన్నీ సాహిత్య రాజకీయ చర్చలోకి తేవడానికే. నవలలు కూడా

అందుకే రాయటం మొదలు పెట్టాను. అలా మొదట వచ్చిన 'సహజ'కు గుర్తింపు, ప్రశంసలు వచ్చాయి. చిన్నపాటి చర్చ కూడా మొదలైంది.

## 'స్వేచ్ఛ' ఎలా మొదలుపెట్టాను

1986లో ఉషోదయ పబ్లికేషన్స్ నిర్వాహకులు 'చతుర' 'విపుల' మాస పత్రికలలో నవలల, కథల పోటీ నిర్వహించారు. ఆ పోటీకి నవల రాయాలనుకున్నాను. నవలా రచయిత్రిగా నా శక్తి పరీక్షించుకోవచ్చు బహుమతి వస్తే స్త్రీవాద దృక్పథం విస్తృతంగా పాఠకులలోకి తీసుకు పోవచ్చు ఈ రెండు ఆలోచనలతోనే 'స్వేచ్ఛ'ను మొదలుపెట్టాను.

## క్లుప్తంగా కథాంశం...

'స్వేచ్ఛ' నవలలో కథానాయకుడు ప్రకాశం మంచి భర్త. భార్య అరుణన్నా, కూతురన్నా ప్రాణం. వాళ్ళ తోటిదే లోకం అతనికి. అరుణ కూడా తమ ప్రేమైక కుటుంబం లోపల ఆనందంగా జీవించాలని అతని ఆశ. అరుణకు తన కుటుంబం మాత్రమే గాక సమాజం పట్ల కూడా ఆసక్తి. ఆ సమాజంతో సజీవ సంబంధం, సమాజంలో చిన్న కదలికనో, మార్పునో తెచ్చే సంబంధం పెట్టుకోవాలనుకుంటుంది. ఒక ప్రజా సంఘంలో చేరి పనిచేస్తుంది. లెక్చరర్ అయిన అరుణ జీతాల పెరుగుదల కోసం యూనియన్‌లో చురుగ్గా పనిచేస్తేనే సహించలేని ప్రకాశం ప్రజా సంఘాలలో అరుణ పాత్రను అసలు సహించలేకపోతాడు. ఆ పనులు చేయకుండా ఉండటం అరుణలోని పౌరసత్వ కాంక్షకు అసాధ్యం అవుతుంది. కుటుంబం కావాలా సమాజం కావాలా తేల్చుకోమంటాడు అతను. అరుణకు కుటుంబం కావాలి. కానీ పైప్రశ్నను నియంతలా అడిగే అధికారం భర్తకిచ్చిన కుటుంబం కాదు తనకు కావలసింది. తన పనులకు సహకరించే కుటుంబం కావాలి. అందువల్ల భర్తనుంచి విడిపోయింది. ఇది చాలా మందికి మింగుడు పడలేదు. ఏ వ్యసనాలూ లేని భర్తను, తనెంతో ప్రేమించే భర్తను, ఏదో సంఘం కోసం విడిచి వెళ్లటం ఏమిటనే ప్రశ్న చాలా వేధించింది.

ఇక సంఘ నాయకులు అరుణ సమస్యను చాలా తేలికగా తీసుకుని భర్తకిష్టం లేకపోతే సంఘం పనులు మానెయ్యమంటారు. వారి ధోరణికి అరుణ నిర్ఘాంతపోతుంది. ఆ పనులు చేయాలని తనలోని బలమైన కాంక్షను గుర్తించని వారినిచూసి భయపడుతుంది. ఆ సంఘ నాయకుడు తన భార్యతో నియంతలా వ్యవహరించటం, తను చేసేపనుల గురించి భార్యకు చెప్పకపోవటం- ఇవన్నీ అర్థమై అరుణ చాలా నిరాశ పడుతుంది. ఇవాళ్టికీ ప్రజాసంఘాలలో, రాజకీయ పార్టీలలో పురుషుల ధోరణి పైవిధంగానే ఉంది. బయట ప్రజాస్వామిక హక్కుల కోసం పోరాడే పురుషులు కుటుంబంలో స్త్రీల, పిల్లల ప్రజాస్వామిక హక్కులను దారుణంగా అణచివేస్తున్నారు. ఈ విషయం 'స్వేచ్ఛ' నవల చర్చించటం ప్రజాసంఘాలనూ, రాజకీయ పార్టీలకూ మింగుడు పడలేదు. ఐతే తర్వాత జరిగిన చర్చల వల్ల మాటల వరకైనా, సిద్ధాంత పరంగానైనా కుటుంబంలో స్త్రీల హక్కుల ప్రాధాన్యతను వాళ్ళు ఒప్పుకోక తప్పలేదు. ఆ మేరకు 'స్వేచ్ఛ' నవల కొంత మార్పుకి కారణమైంది. అది నాకు చాలా సంతోషాన్ని కలిగించింది.

అరుణ స్నేహితురాలు ఉమ వివాహం తన ఎదుగుదలకు ఆటంకమని, ఆ బంధంలోకి వెళ్ళకుండా తనను ప్రేమించే వినోద్‌తో సహజీవనం చేస్తుంది. అది మంచిదా, అది సమస్యకు పరిష్కారమా, ఆ సమస్య నుంచి తప్పించుకోవటమా అనేది అరుణ, ఉమలకు కూడా స్పష్టంగా తెలియదు. ఐతే ప్రకాశంలాగా అరుణ దేనినీ నైతిక సమస్యగా చూడదు. ఇది కూడా సాహిత్య చర్చలలో వివాదాస్పదమైంది.

స్వేచ్ఛ అనే భావనను గురించి కూడా

## అందరూ ఆలోచించాలివి

'స్వేచ్ఛ' నవలలో ప్రతిపాదించిన మూడు ప్రధానాంశాలను గురించి సమాజం తప్ప నిసరిగా ఆలోచించాలని అప్పటికీ, ఇప్పటికీ నేను అనుకుంటాను. స్త్రీ పౌరసత్వ సమస్య, వివాహంలో కుటుంబంలో స్త్రీల ఆకాంక్షల అణచివేత, అప్రజాస్వామిక వాతావరణం, ప్రజల సమస్యల గురించి పనిచేసే ప్రజా సంఘాలలో స్త్రీలపాత్ర సంఘాల నాయకులు స్త్రీలకిచ్చే విలువ. ఈ మూడు విషయాలనూ ఈ నవలలో పదునుగా సూటిగా చెప్ప గలిగాను. కనుకే నవలల పోటీలో ప్రథమ బహుమతి రావటంతోపాటు ఆ నవలపై ఆంధ్రదేశమంతటా ఏడాదికి పైగా చర్చ జరిగింది.

అంతవరకూ తెలుగు సాహిత్యంలో స్త్రీల సమస్యలంటే ముఖ్యంగా దుర్మార్గుడైన భర్తతో వచ్చే సమస్యలే ప్రధానంగా ఉండేవి. భర్త మంచివాడైతే, బాగా చూసుకుంటే ఆడవాళ్ళ జీవితాలకు కావల్సిందేమీ లేదనే ధోరణిలో ఎక్కువ సాహిత్యం వచ్చింది. చలం, కుటుంబరావు ఇందుకు మినహాయింపు. భర్త మంచివాడైనా భార్యను కేవలం భార్యగానే కాకుండా ఒక పౌరురాలిగా అర్థం చేసుకోగలడా? స్త్రీకి భార్యాత్వం, మాతృ త్వంతోపాటు పౌరసత్వం అనేది ఒక ప్రధానమైన బాధ్యత కాదా, అన్న ప్రశ్నను 'స్వేచ్ఛ' నవల మొదటిసారిగా తెలుగు సాహిత్యంలోకి తీసుకొచ్చింది.

ఆలోచనను కలిగించాలని నేను నవలలో ప్రయత్నించాను. స్వేచ్ఛ అంటే మనమీద మనకు బాధ్యత. నిర్ణయాలు తీసుకునే హక్కుని వినియోగించుకుని మన ఎదుగుద లకూ, వికాసానికీ మనమే బాధ్యత వహిం చటం. స్వేచ్ఛ, బాధ్యత రెండూ ఒకే నాణా నికున్న రెండు వైపులని చెప్పాలని నేను ప్రయత్నించాను.

### ఆశించిన ఫలితం దక్కింది

ఈ విషయాలను దృష్టిలో ఉంచుకుని రాసిన 'స్వేచ్ఛ' నవలను 1986 మే నెల చివరికి పోటీకి పంపాను. 1986 డిసెంబరు 3న న్యాయనిర్ణేతల నిర్ణయం ప్రకారం నా నవలకు ప్రథమ బహుమతి వచ్చిందని 'చతుర' సంపాదకులు చలసాని ప్రసాద రావు చెప్పినపుడు చాలా ఆనందించాను. 1987 ఫిబ్రవరి సంచికలో 'స్వేచ్ఛ' ప్రచురిత మైంది. వాదాలూ, వివాదాలూ, చర్చలూ సాగాయి. 'చతుర'కు వచ్చిన పాఠకుల స్పందన లేఖలను (దాదాపు మూడు వేలకు పైగా) ఒక ఫైల్ చేసి చలసాని ప్రసాదరావు నా చేతికిచ్చారు. అవి సామాన్య పాఠకుల స్పందనలు. వారందరికీ 'స్వేచ్ఛ' నవల నేనాశించినట్లే అర్థమైంది, అరుణ పాత్రలో అనేకమంది తమను తాము చూసుకు న్నారు. భిన్న రాజకీయ అభిప్రాయాలవారు, సాహిత్య విమర్శకులూ, మేధావులూ పడి నంత గందరగోళం సామాన్య పాఠకులు పడరనీ, వాళ్ళ కోసమే రాయాలనే నాకపుడు స్పష్టంగా అర్థమైంది. నాకెంతో బలమొ చ్చింది. అప్పటి నుంచీ మరింత కమిట్‌మెం ట్‌తో రచనలు చేస్తున్నాను. రచన అనేది ఒక 'చర్య' అని నమ్మి నేను రాస్తాను. అలాంటి కమిట్‌మెంట్ నాలో బలపడేం దుకు కారణమైన 'స్వేచ్ఛ' నవలంటే నాకు ఎంతో ఇష్టం. అందుకే దానిని నాకు ప్రాణా న్నిచ్చిన, నాకు ప్రాణప్రదమైన మా అమ్మా నాన్నలు పోపూరి వెంకట సుబ్బమ్మ, వెంకట సుబ్బారావులకు అంకితం ఇచ్చాను.

సేకరణ: చంద్రప్రతాప్



ప్రాణప్రదంగా ప్రేమించిన జీవిత భాగస్వామి కనులముందే హఠాత్తుగా విగతజీవురాలైపోతే జీవితమే శూన్యమనిపించింది అతడికి. ఒంటరితనం, గుండెలు పిండేసే బాధ బతుకును కమ్మేశాయి. ఆమె జ్ఞాపకాలనుండి బయట పడడానికి బాస్ ప్రోద్బలంతో మిత్రులతో కలసి ట్రెక్కింగ్‌కు వెళ్ళిన అతడికి ఎన్నో అనుభవాలు ఎదురవుతాయి. రకరకాల ప్రజలతో సాంగత్యం ఏర్పడుతుంది. ఒక్కో అనుభవం జీవితం విస్తృతమని, ప్రకృతి ఎంతో ఆనందాన్ని మనిషి కోసం పరచి ఉంచిందని, దాన్నందుకోలేకపోవడం మనిషి మూర్ఖత్వమని అవగతమవుతుంది. ప్రకృతిలోని అపరిమితమైన సృజనాత్మకత తునక తనలోనూ ఉందని, అంతర, బాహ్య ప్రకృతితో సమన్వయం సాధించినప్పుడు కలిగే మనశ్శాంతి అనిర్వచనీయమైనదని తెలుసుకుంటాడు.

జీవితం వ్యర్థం అనుకుంటూ వచ్చిన వ్యక్తి తనని తాను తెలుసుకుని జీవిత పరమార్థాన్ని గ్రహించడం గురించి సెలయేటి నడకలా సాగిపోయే కథనంతో ఆవిష్కరించిన **కస్తూరి మురళీకృష్ణ** నవల **'ఒంటరి మేఘం'** చతుర పాఠకులకు ఈ నెల కానుక.



# ఒంటరి మేఘం

## —కస్తూరి మురళీకృష్ణ

చిక్కటి చీకటి దారిలో వెలుతురు పర చుకుంటూ వేగంగా పరుగెత్తుతోంది రైలు. నిశ్శబ్ద నిశీధిని తన చక్రాల శబ్దాలతో పల కరిస్తూ, అప్పుడప్పుడూ ఈల వేసి హెచ్చ రిస్తూ గమ్యంవైపు ఉరుకులు తీస్తోంది.

కిరణ్‌కు నిద్ర రావటం లేదు. కిటికీలోంచి బయటకు చూస్తూ కూచున్నాడు. రివ్వు రివ్వున గాలి వీస్తోంది.

బయటంతా చీకటి. కన్ను పొడుచుకున్నా ఏమీ కనబడని చీకటి. ఎదురుగా ఎవరో చీకటితో దట్టమైన గోడ కట్టారనిపిస్తోంది.

ఉండి ఉండి హఠాత్తుగా ఏవేవో లైట్లు ఒక్కక్షణం జిగేల్మనిపించి మళ్లీ చీకటిలో కలసిపోతున్నాయి.

ఎదురు బెర్తులవైపు చూశాడు కిరణ్.

అతని మిత్రులు చంద్ర, రాజు గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. వాళ్లు రైలు ఎక్కేసరికే సగం తాగి ఉన్నారు.

'చూడు గురూ... మనం వెళ్లేది గోవా. అక్కడ తాగుడు ఫ్రీ. అందుకని ఇక్కడి నుంచే శృతి చూసుకుంటున్నాం' అన్నాడు చంద్రం, రైలెక్కుతూనే.

'మనం చేసే పని వల్ల పక్కవాళ్లకి ఇబ్బంది లేనంత కాలం మనం ఏం చేసు కున్నా మన ఇష్టం' సమర్థించుకున్నాడు రాజు.

"ఒరేయ్ నీకు లైఫ్ ఎంజాయ్ చేయటం రాదు. మమ్మల్నయినా ఎంజాయ్ చేయని వ్వరా" అన్నాడు చంద్ర.

కిరణ్ మాట్లాడలేదు.

'నువ్వూ పడుకో' అని సలహా ఇచ్చి నిద్ర లోకి జారుకున్నారిద్దరూ.

ఎంత ప్రయత్నించినా నిద్ర రావటం లేదు కిరణ్‌కు.

ఎలా వస్తుంది? ఇది అతను పక్కన వీణ లేకుంగా చేస్తున్న ప్రయాణం. వీణ గుర్తుకు రాగానే కిరణ్ కళ్లల్లో నీళ్లు ఉబి కాయి.

నిజంగా, ఒక వ్యక్తి మరో వ్యక్తి జీవి తంలో విడదీయరాని భాగం అవటం ఎంత అద్భుతం! కానీ తన ప్రాణంలో ప్రాణం అనుకున్న వ్యక్తి హఠాత్తుగా చెప్పా పెట్ట కుండా తనని వదలివెళ్లినా తాను ఇంకా ప్రాణంతో ఉండటం.... ఎంత వద్దనుకున్నా వీణ జ్ఞాపకాలు కిరణ్‌ని ముసురుకుంటు న్నాయి.

వీణ తనకు పరిచయమైనప్పటినుంచీ తాను బతకటం ఆరంభించాడనిపిస్తుంది కిరణ్‌కు. వీణ పరిచయమైన తరువాత తాను నవ్వటం నేర్చుకున్నాడు. జీవితాన్ని అనుభవించటం తెలుసుకున్నాడు, అర్థం చేసుకున్నాడు.

ఒక రకంగా చెప్పాలంటే వీణ లేని తన జీవితం ఎడారి అయితే ఆమెతో తన జీవితం నిత్యవసంతం. మళ్లీ ఇప్పుడు వీణ లేకుండా తన జీవితం ఎడారి కన్నా భయం కరం అయిపోయింది. అతనికి వీణకు ఇష్ట మైన ముఖేష్ పాట గుర్తుకు వచ్చింది.

దునియాసే జానే వాలే చలే జాతే హై కహా

కైసె ఢూండే కోయి ఉన్కో, నహీ కద్ మోంకే హీ నిషాన్

ప్రపంచం వదలి వెళ్లిపోయేవారు ఎటు వెళ్తారో? వారిని కలవాలంటే, కనీసం కొన్ని గుర్తులు కూడా లభించవు. ఇక ఎలా వెత కటం?

వీణ.. ఎక్కడికి వెళ్లావు? ఎలా ఉన్నావు? నన్నొదలి ఎలా ఉండగలుగుతు న్నావు? కన్నీళ్లతో నిండిన కిరణ్ కళ్ల ముందు ఆనాటి దృశ్యాలు అస్పష్టంగా కని పిస్తున్నాయి.

ఎప్పటిలాగే ఇద్దరూ బండిమీద వస్తు న్నారు- మాట్లాడుతూ, పాటలు పాడు కుంటూ, ఆరోజు విశేషాలు చర్చిస్తూ.

ఇంతలో హఠాత్తుగా ఓ సైకిల్ వాడు అడ్డొచ్చాడు. డైరెక్షన్ చూపకుండా గుడ్డిగా 'యు టర్న్' తీసుకున్నాడు.

అనూహ్యంగా సైకిల్ అడ్డురావటంతో

## రచయిత పరిచయం

కస్తూరి మురళీకృష్ణ రైల్వేలో ఎకౌంట్స్ అసిస్టెంట్. ఆయన ప్రవృత్తి విస్తారంగా రచనలు చేయటం. ఎం.ఎస్‌సి. జియాలజీ, ఎం.ఎ, ఫిలాసఫీ చేసారు. రీసెర్చిని మధ్యలోనే వదిలేసి విద్యనభ్యసించిన రంగాలకు సంబంధించని వృత్తిలో మురళీకృష్ణ సెటిలయ్యారు. వివిధ పత్రికల్లో దాదాపు 75 కథలు, అసిధార, అంతర్మధనం వగైరా. 17 నవలలు రాసారు. నవలల్లో నాలుగు పుస్తకాలుగా వెలువడ్డాయి. 1995లో ఆంధ్రప్రభ నిర్వహించిన దీపావళి నవలల పోటీలో 'అంతర్యాగం' అనే నవల బహుమతి పొందింది. 1999లో ఆంధ్రభూమి సస్పెన్స్ నవలల పోటీలో 'ఆపరేషన్ భద్ర్' నవలకు ప్రత్యేక బహుమతిని అందుకున్నారు. జాగృతిలో 'రాజతరంగిణి' కథలు, ఆంధ్రభూమి మాస పత్రికలో 'జీవితం జాతకం' కథల సిరీస్‌ను వెలువరించారు. ఫిక్షన్ మాత్రమే కాక నాన్ ఫిక్షన్ రచనలు కూడా చేశారు. వాటిలో 'భారతీయ తత్వచింతన: లఘు పరిచయం' మన ముఖ్యమంత్రులు అనే గ్రంథాలు ఆయనకు పేరు తెచ్చి పెట్టాయి. ప్రస్తుతం వివిధ పత్రికల్లో కాలమ్స్ రాస్తున్నారు.

రచయిత చిరునామా: కస్తూరి మురళీకృష్ణ, ఫ్లాట్‌నెం: 32, ఇం.నెం: 8-48,
దమ్మాయిగూడ, నాగారం పోస్ట్, ఇ.సి.ఐ.ఎల్. సికింద్రాబాద్. 62

కిరణ్ కంగారు పడ్డాడు. బ్రేక్ గట్టిగా నొక్కాడు కానీ, అదే సమయంలో క్లచ్ కూడా నొక్కాడు దాంతో ఆగాల్సిన బండి మరింత వేగం పుంజుకుంది. సైకిల్‌ను గుద్దేసింది.

కింద పడిన కిరణ్ వెంటనే లేచాడు. సైకిల్ వాడు లేచాడు. వీణ లేవలేదు అక్సిడెంట్ జరగటానికి ఒక్కక్షణం ముందు తాను వీణ లేకుండా ఆఫీసు పని మీద రెండు రోజులు బయటకు వెళ్తున్నానని చెప్పినప్పుడు, వీణ తన చెవిలో పాడిన పాట ఈ నాటికీ అతడి మదిలో మోగుతూనే ఉంది

తేరెసాథ్ మేరి వఫా, మై నహీ తో క్యా? (నీ వెంట నేను లేకపోతేనేమి, నా విశ్వాసం (అనురాగం) వెంటే ఉంటుంది.

కానీ ఇప్పుడు వీణే లేదు, ఇక విశ్వాసం ఎక్కడ ఉంది?

వీణ ఆత్మ ఇప్పుడు తన చుట్టూ ఆవరించి ఉందా? ఆత్మ పంచభూతాల్లో కలుస్తుందంటారు, ఇప్పుడు తన చుట్టూ ఉన్న పంచభూతాలలో వీణ మిళితమై ఉందా? చేతుల్లో ముఖం దాచుకున్నాడు కిరణ్

'ఏరా, నిద్రపట్టటం లేదా? ' పై బెర్త్ మీద నుంచి జాగ్రత్తగా దిగుతూ మత్తుగా అడిగాడు చంద్ర. సమాధానం కోసం చూడకుండా బాత్రూం వైపు వెళ్లాడు.

కిరణ్ కాళ్లు తుడుచుకుని, కిటికీలోంచి బయటకు చూస్తూ కూచున్నాడు.

"ఓ పెగ్గేసుకో. అన్నీ మరిచిపోతావు" అంటూ మళ్లీ పై బెర్త్ ఎక్కేశాడు చంద్ర. ఒంటరిగా, చీకట్లోకి చూస్తూ వీణ ఆలోచ

నల వేదనలోని మాధుర్యాన్ని అనుభవిస్తూ కూచుండిపోయాడు కిరణ్.

"ఏరా, రాత్రంతా నిద్రపోనట్టున్నావు? " అడిగాడు రాజు

కిరణ్ నవ్వాడు

"బ్యాగులు సర్దు. లోండు వచ్చేస్తోంది. మనం దిగాల్సింది ఇక్కడే" అని 'వీడింకా నిద్ర లేవలేదా? ' అని చంద్రం వైపు తిరిగి 'ఒరే నిద్ర లేవరా.. లేకపోతే కొల్లాపూర్ వెళ్లిపోతావు' అంటు చంద్రని నిద్ర లేపసాగాడు.

లోండా స్టేషన్‌లో రైలు ఆగగానే ముగ్గురూ బండి దిగేశారు.

"స్టేషన్ బయట తినేందుకు ఏమీ దొరకవు. ఇక్కడే బ్రేక్‌ఫాస్ట్ చేసి బయటకు వెళ్దాం" అన్నాడు రాజు.

స్టేషన్లోనూ తినేందుకు ఏదీ సరిగ్గా లేదు. ఉన్నదేదో తిన్నామనిపించి బయటకు వచ్చారు.

'బస్టాండు దగ్గరే. నడుద్దాం' అన్నాడు రాజు.

'నడకా? అమ్మో నేను నడవలేను' బ్యాగు కింత పడేసి అన్నాడు చంద్ర. అప్పటికే ఇద్దరు ఆటోవాళ్లు దగ్గరకొచ్చేశారు. 'సార్... ఆటో' అంటూ 'ఒరే చంద్రంబాబు.



మనం వచ్చిందే ట్రెక్కింగ్‌కు. ట్రెక్కింగ్ అంటే తెలుసుగా కొండలెక్కటం, అడవుల్లో నడవటం. ఇక్కడ నుంచి బస్టాండు దాకా నడవ లేని వాడివి కొండలేం ఎక్కుతావు? వ్యంగ్యంగా అడిగాడు రాజు.

అప్పటి సంగతి అప్పుడు చూద్దాం. ఇప్పుడయితే నేను నడవను మొండిచేశాడు చంద్ర. 'సరే. నీకో సిగరెట్ ఇస్తా. నడుస్తావా? '

చంద్రతో సిగరెట్లు మాన్పించాలని రాజు ప్రయత్నం.

'సిగరెట్లు మాని, తాగుడు కొనసాగించటంలో అర్థం ఉందా? ' అని కిరణ్ అడిగాడు. 'నువ్వు సిగరెట్ తాగితే నీతోపాటు చుట్టూ ఉన్న వారికీ నష్టం. తాగితే నాకే నష్టం. నీకేం నష్టం? ' అన్నాడు సమాధానంగా.

రాజు అందిస్తున్న సిగరెట్ వైపు ఆశగా చూశాడు చంద్ర.

'ఇంకోటిస్తే నడుస్తా' అన్నాడు.

'సగం' అన్నాడు రాజు.

'ఇంకొక్కటి' మొండిగా అన్నాడు చంద్ర.

'సరే. నీ ఇష్టం. నువ్వెలా వస్తావో అలా రా. మేమిద్దరం నడుస్తున్నాం. పద కిరణ్' అంటూ నడవసాగాడు రాజు.

'ఒరే పోనీ ఒక్క సిగరెట్టే ఇవ్వు' వెంట పరుగెత్తుతూ, బతిమిలాడాడు చంద్ర.

'నీకా ఛాన్స్ పోయింది' సిగరెట్ నలిపేసి విసిరేశాడు రాజు.

రాజు పడేసిన దానివైపు విషాదంగా చూసి అనుసరించాడు చంద్ర, గొణుక్కుంటూ. బస్టాండు చేరుతూండగానే బస్సొచ్చింది.

'ఈ బస్సు పోండా దాకా వెళ్తుంది. అక్కడినుంచి పంజిమ్ పన్నెండు కిలోమీటర్లే చలో' అంటూ బస్సులోకి దూకాడు రాజు. చంద్ర, కిరణ్‌లు అనుసరించారు.

★ ★ ★

'ఇక్కడ బస్సు ఫేర్లు తక్కువే' అన్నాడు రాజు.

అప్పటికే చంద్ర నిద్రలోకి జారుకున్నాడు. కిరణ్ కిటికీ లోంచి బయటకు చూస్తున్నాడు. బస్సు ఘాట్‌రోడ్డులో మెలికలు తిరుగుతూ పోతోంది.

ఎదురుగా పచ్చదనం. ఎటుచూసినా పచ్చటి చెట్లు లోయలోంచి ఆకాశాన్ని తాకాలని ఆత్రుతగా ఎదిగినట్టు కనిపిస్తున్నాయి.

లోయ అడుగు కనపడటం లేదు. చెట్లతో దట్టంగా ఉంది.

'వీణ ఈ దృశ్యాలను చూస్తే మైమరచిపోయేది' అనుకున్నాడు కిరణ్.

ప్రకృతిని చూస్తే పరవశించిపోతుంది వీణ. సముద్రపు ఒడ్డున అలలతో చిన్న పిల్లలా అడుకునేది. సముద్రంలోకి పరిగిడదామనేది. ఆమెని పట్టలేక సతమతమయ్యేవాడు అతడు.

ఈ లోయలను, ఈ పచ్చదనాన్ని చూస్తే వీణ ముఖం వెలిగిపోయేది.

వీణ సాన్నిహిత్యంలో ప్రకృతి అందాన్ని ఆస్వాదించటం నేర్చుకున్నాడు కిరణ్. అంత వరకు తాను పట్టించుకోకుండా, మామూలుగా, సాధారణంగా భావించిన అనేక అంశాలలో దాగున్న అద్భుతాలను, అసాధారణ అందాలను చూడటం నేర్పింది వీణ. 'నువ్విక్కడే, ఇలాగే ఉంటే మామూలు మనిషివి కావటం కష్టం. కొన్నాళ్లయినా కొత్త ప్రదేశాలకి వెళ్లివస్తే రిలీఫ్‌గా ఉంటుంది. వీణ జ్ఞాపకాల నుంచి బయటపడతావు. మన రాజు, చంద్ర గోవా ట్రెక్కింగ్‌కి వెళ్తున్నారు. వాళ్లతో నువ్వూ వెళ్లు. లీవ్ సంగతి నా కొదిలెయ్' అన్నాడు కిరణ్ వాళ్ల బాస్ కిరణ్‌తో.

బయలుదేరే ముందు రాజు, చంద్ర కిరణ్‌తో స్పష్టంగా చెప్పారు.

'చూడోయ్. నిన్ను మాతో తీసుకెళ్లటం నిజానికి మాకు ఇష్టం లేదు. బాస్ మాట కాదనలేక సరేనన్నాం. కానీ నువ్వు మా పనులకు అడ్డు రాకూడదు. మాకు ట్రెక్కింగ్ అన్నది ఒక సాకు మాత్రమే. గోవాలో మేం పూర్తిగా ఎంజాయ్ చేయాల

నుకుంటున్నాం. నువ్వు మాకు అడ్డు రావద్దు'

కిరణ్ తల ఊపాడు.

'నా కిష్టం లేని పని చేయమని నన్ను ఒత్తిడి చేయనంత వరకు మీరేం చేసినా నాకనవసరం' అన్నాడు.

'దట్స్ ఎ గుడ్ బోయ్' అన్నాడు రాజు.

వీణ జ్ఞాపకాలను మరిచిపోవచ్చన్న ఆలోచనలతో ట్రెక్కింగ్‌కు వచ్చాడు కానీ, తన ఊపిరిలో ఊపిరై, తన అణువణువు నిండి ఉన్న వీణను మరిచిపోవటం సాధ్యమా?

**2**

బస్సు పంజిమ్ చేరింది.

బస్టాండు హడావుడిగా ఉంది. బస్సుల వాళ్లు ప్యాసెంజర్లను రమ్మని పిలుస్తున్నారు. దేశం నలుమూలల నుంచీ మనుషులంతా గోవా వచ్చి చేరుతున్నట్టుంది. రకరకాల భాషల మనుషులు కనిపిస్తున్నారు.

'ఇక్కడి నుంచి స్పోర్ట్స్ అథారిటీ గ్రౌండ్ ఎంత దూరమో అడగాలి' అని రాజు, ట్రాఫిక్ పోలీసు దగ్గరకు వెళ్లాడు.

రాజు అడిగేలోగా ఎవరో అమ్మాయి హిందీలో పోలీసుని అడిగింది 'స్పోర్ట్స్ అథారిటీ గ్రౌండ్ ఇక్కడినుంచి ఎంత దూరం? ' అని.

'మూడు నాలుగు కిలోమీటర్లుంటుంది. బస్సులు బోలెడున్నాయి. చెప్పాడతను.

'దారి, తిన్నగానేనా, మలుపులు తిరగాలా? ' అడిగింది.



కవికోకిల బిరుదాంకితుడైన గుర్రం జాషువా అభ్యుదయ సాహితీ దురంధరుడు. అలనాటి కులసర్పాన్ని, దాని కాటును స్వయంగా భరించి ఢక్కామొక్కీలు తిన్న మహానుభావుడు. పద్యరచనలో దిట్ట. ఆయన రాసిన అనేక ఖండకావ్యాలే దానికి ఉదాహరణ.. ఆయన సరస సంభాషణా చతురుడు. ఆయన జోకులు ఈనెల 'చతుర' పాఠకులకు ప్రత్యేకం..

## ఎటు తిరిగీ పిచ్చి నాకే



ఐదారు దశాబ్దాల క్రితం నాటిమాట. తిరుపతి వెంకటకవులు, కొప్పరపు సోదరులు పింగళి-కాటూరి కవులు అప్పట్లో జంటకవిత్వం చెప్పేవారు. అదేతీరుగా తామూ జంట కవిత్వం చెప్పాలనుకున్నారు గుర్రం జాషువా, ఆయన మిత్రుడు దీపాలపిచ్చయ్య శాస్త్రి.

ఇకనేం? తమ పేర్లనుంచి కొంత కొంత తీసి ఒక పేరుగా తయారు చేయాలని ఇద్దరూ కలిసి కుస్తీపట్టారు. 'గుర్రం పిచ్చి', 'పిచ్చిగుర్రం,' 'పిచ్చిజాషువా', 'జాషువా పిచ్చి'.. ఇలా తయారవుతున్నాయి పేర్లు..

దాంతో జాషువా 'వద్దులెండి.. ఎటుతిరిగీ పిచ్చి నాకే పట్టేట్లుంది.. ఎవరికి వారే రాసుకుందాం పోనిద్దురూ..' అని పిచ్చయ్యశాస్త్రితో చెప్పేశారట.

'ఒకే దారి. తిన్నగా వెళ్లాలి. ట్రెక్కిం గ్‌కా?' అడిగాడు పోలీసు.

'అవును. థాంక్స్' అంటూ బ్యాగు భుజం మీద వేసుకుని, వెనకే ఉన్న స్నేహితురాళ్ల వైపు చూసి 'ఛలో'. గర్ల్స్' అంది.

చంద్ర వైపు తిరిగాడు రాజు. 'ఏమోయ్ నడుద్దామా?' బస్సులో పోదామా? అని అడిగాడు.

'వాళ్లని అనుసరిద్దాం' అన్నాడు చంద్ర.

నవ్వుతూ వాళ్లని అనుసరించాడు రాజు.

"వీళ్లూ ట్రెక్కింగ్‌కే వస్తున్నారు. పరి చయం చేసుకుందామా?' కిరణ్‌ని అడిగాడు రాజు.

'మీ ఇష్టం' ముక్తసరిగా అన్నాడు కిరణ్.

బస్టాండ్ దాటి ముందుకు వెళ్లారు.

రోడ్లు విశాలంగా ఉన్నాయి. జనం పలు చగా ఉన్నారు.

ముందు ముగ్గురమ్మాయిలు నడుస్తు న్నారు. వాళ్ల భుజాల మీద రక్‌సా క్‌లున్నాయి.

'ఒరే ముగ్గురిలో నీకెవరు నచ్చారు?' అడిగాడు రాజు.

'నాకయితే జీన్స్ పాంట్ నచ్చింది'

'సరే. అయితే జీన్స్ ప్యాంట్ ఇప్పటి నుంచీ నాకు చెల్లెలు.'

'మరి నీకెవరు నచ్చారు?'

"నాకు జీన్స్‌ప్యాంట్ మీద పూలషర్టు నచ్చింది"

'ఓకే... ఆమె నాకు ఇవాళ్టి నుంచి వదిన గారు'

తమకు కాస్త దూరంలో వెనకేవస్తున్న కిరణ్, దగ్గరకు వచ్చేదాకా ఇద్దరూ ఆగారు.

'కిరణ్.. ఆ ముగ్గురిలో నీకెవరు నచ్చారు?'

కిరణ్ నవ్వాడు. మాట్లాడలేదు.

'ఆ నవ్వు కర్థంబేమి, మహానుభావా?' అడిగాడు చంద్రం.

"నాకు అర్థమైంది? ఇక్కడ ఉన్న ముగ్గు రిని చూసేసి నిర్ణయించుకోవటం ఏమిటి, మన ట్రెక్కింగ్ బ్యాచ్‌లో ఇంకా అమ్మాయి లుంటారు కదా, అప్పుడు నిర్ణయించుకోవ చ్చని ఆ నవ్వుకు అర్థం. అంతేనా?"

కిరణ్ మౌనంగా నవ్వాడు.

"చూశావా... మౌనం అర్థాం గీకారం" అన్నాడు రాజు.

"సరే... మన



## 'రస'ప్రియులకు రక్తపోటు దూరం

పళ్ళరసాలు ఆరోగ్యప్రదాయకాలని అందరికీ తెలిసిందే. ఒక్కొక్క పళ్లరసం శరీరానికి కావల్సిన ఒక్కోరకమైన లేదా కొన్ని రకాల పోషక పదార్థాల్ని అందజేస్తాయి. దానివల్ల పోషక విలువల లోపం ఉండదు. దేహానికి సత్తువతోపాటు మనసుకు పరోక్షంగా ఉత్సాహాన్ని కూడా అవి అందజేస్తాయి. పళ్ళరసాల్లో బత్తాయి రసానికి మరో ప్రత్యేకత కూడా ఉంది. అది రక్తపోటును తగ్గిస్తుంది. ఆరువారాల పాటు రోజూ 425 మిల్లీలీటర్ల బత్తాయి రసం తాగితే రక్తపోటు మాయమవుతుంది. ఈ రసం సిస్టోలిక్ - అంటే ఎక్కువ సంఖ్యలో ఉంటే రక్తపోటును - సగటున 7శాతం; డయాస్టోలిక్ తక్కువ సంఖ్యలో ఉంటే పోటును - 4.6 శాతం తగ్గిస్తుందని కొత్త పరిశోధనలు తెలియజేస్తున్నాయి. బత్తాయి రసంలో ఉండే పోటాషియం విటమిన్ సి రక్తపోటును తగ్గిస్తాయని గతంలోనే వెల్లడయినా, దాని గుణగుణాలలోని ప్రత్యేకతను తాజా పరిశోధనలు నిర్దిష్టంగా తేల్చిచెప్పాయి. అయితే ఒక హెచ్చరిక. మీకూ మధుమేహం ఉంటే మాత్రం ఏ మేరకు పళ్ళరసాలు - ప్రత్యేకించి బత్తాయి రసం - తీసుకోవచ్చో మీ వైద్యుణ్ణి సంప్రదించక తప్పదు.



వాదనలో సమయం గడచిపోతోంది. ఇలా వాదిస్తూనే ఉందామా, అమ్మాయిల్ని పరిచయం చేసుకునే ప్రోగ్రామేమైనా ఉందా? " చిరాగ్గా అడిగాడు చంద్ర.

'ఛలో' అంటూ వేగం పెంచాడు రాజు.

తమ వెనుక వినపడుతున్న అడుగుల శబ్దానికి కాబోలు, ముగ్గురు అమ్మాయిలు వెనక్కు తిరిగి చూశారు.

'హాయ్... మీరూ ట్రెక్కింగ్‌కేనా? ' అడిగాడు రాజు ఇంగ్లీషులో.

'అవును. మీరు? ' ప్రశ్నించింది జీన్స్ అమ్మాయి.

'మేమూ ట్రెక్కింగ్‌కే' చెప్పాడు చంద్ర.

'నా పేరు రాజు. వీడు చంద్ర. వాడు కిరణ్. మేమంతా హైదరాబాద్, ఆంధ్రప్రదేశ్ నుంచి వస్తున్నాము' గబగబా పరిచయం చేశాడు రాజు.

'నేను స్వప్న, ఇది కశ్మీరా, అది ప్రాజక్త. మేం ముగ్గురం పుణెనుంచి' చెప్పింది. పూల షర్టు అమ్మాయి చేయి చాస్తూ.

'వెరీ గుడ్. నడుస్తూ మాట్లాడుకుందాం' అన్నాడు రాజు స్వప్న చేయిని అందుకుంటూ.

అది చూసి వెంటనే చంద్ర కశ్మీరా వైపు చేయి సాచాడు. ఆమె అతడి చేయి అందుకుంది.

మళ్ళీ నడవసాగారు. రాజు, చంద్ర ఒకరివైపొకరు చూసి గర్వంగా నవ్వుకున్నారు.

'పుణె అమ్మాయిలు చాలా ఫాస్టున్నారు' అనుకున్నారు.

మాటలతో, ఛలోక్తులతో నడవసాగారు. అదేమీ పట్టనట్టు వాళ్లకి దూరంగా నడు

స్తున్నాడు కిరణ్. అయినా వాళ్ళ మాటలు వినిపిస్తూనే ఉన్నాయి. మాటలను బట్టి స్వప్న, కశ్మీరా అనే అమ్మాయిలిద్దరూ ప్రభుత్వోద్యోగులని, ప్రాజక్త ఏదో వ్యాపారం చేస్తోందని గ్రహించాడు కిరణ్.

ముగ్గురమ్మాయిలు కళ్ళు, ఒళ్ళు విప్పేస్తూ గలగల మాట్లాడేస్తున్నారు. వాళ్ళు ముగ్గురూ ప్యాంటు షర్టులు వేయటం వల్ల, అవి శరీరానికి హత్తుకుని ఉండటం వల్ల వారి శరీర నిర్మాణం స్పష్టంగా తెలుస్తోంది.

కిరణ్‌కు వీణ గుర్తుకు వచ్చింది. వీణకు ప్యాంటు షర్టు వేసుకోవాలని కోరిక ఉండేది. ఇలాగే ఓసారి టూర్ వెళ్ళినప్పుడు ప్యాంటు షర్టు మరచిపోయారు. ఆ ట్రిప్పులో ప్యాంట్ వేసుకున్న ప్రతి అమ్మాయికీ 'ప్యాంటమ్మ' అని పేరు పెట్టి నవ్వుకున్నారు.



'వాడు ఓ గొప్ప రైటర్. మా ఆంధ్రప్రదేశ్‌లో సినిమాలన్నిటికీ కథలు, మాటలు, పాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, నటన, అంతా వీడే. వీడు లేకపోతే సినిమాలే లేవు' అబద్ధం చెప్పాడు రాజు.



'మరి నేను ప్యాంట్ వేసుకుంటే ఏమంటారు?' అనడిగింది వీణ.

కిరణ్ నవ్వుతూ 'పెంటమ్మ' అన్నాడు. ఇద్దరూ నవ్వుకున్నారు. 'నేను పెంటమ్మ అయితే నువ్వు పెంటయ్యావి' అంది వీణ.

'నేనన్నది పెంటమ్మ కాదు పేంటమ్మ' అన్నాడు కిరణ్ మాట మారుస్తూ.

'నేనన్నదీ పెంటయ్య కాదు పేంటయ్య' అంది వీణ కూడా.

అది గుర్తుకు వచ్చి కిరణ్ పెదవులపై చిరునవ్వు నిలచింది.

'ఏమిటీ, మీ ఫ్రెండు తనలో తానే నవ్వుకుంటున్నాడు' ప్రాజక్త అడిగింది రాజుని.

'వాడు ఓ గొప్ప రైటర్. మా ఆంధ్రప్రదేశ్‌లో సినిమాలన్నిటికీ కథలు, మాటలు, పాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, నటన, అంతా వీడే. వీడు లేకపోతే సినిమాలే లేవు' అబద్ధం చెప్పాడు రాజు. వాళ్లు కిరణ్ వైపు అద్భుయిరింగ్‌గా చూశారు.

కిరణ్ ముఖం తిప్పుకున్నాడు.

పైన ఎండ మండుతోంది. ఎంత నడచినా స్పోర్ట్స్ అథారిటీ గ్రౌండ్ రావటం లేదు.

'నడవలేను' అనేందుకు వీలు లేదు. అమ్మాయిలు హాయిగా నడిచేస్తున్నారు. చంద్ర రొప్పసాగాడు. చెమటలు కారిపోతున్నాయి.

ఇంతలో 'అదిగో అక్కడ టెంట్లు కనిపిస్తున్నాయి. అదే కాబోలు మన బేస్ క్యాంప్' అంది స్వప్న.

అందరూ ఆవైపు చూశారు.

నిజమే. విశాలమైన మైదానం కనిపిస్తోంది. కొందరు క్రికెట్ ఆడుతున్నారు. దాని వెనుక ఓ పెద్ద గుండ్రటి భవంతి ఉంది. 'స్విమ్మింగ్‌పూల్' అని చూడగానే తెలుస్తోంది. దాని వెనుక దాదాపుగా ఇరవై, ముప్ఫయి టెంట్లు కనిపిస్తున్నాయి.

'బతికాం. లేకపోతే ఎక్కడో పడి పోయేవాడిని. అమ్మాయిల ముందు పరువు పోయేది' నిట్టూరుస్తూ అన్నాడు చంద్ర.

క్యాంపులో అడుగు పెడుతుంటేనే, ఎదురుగా రిసెప్షన్ టెంట్ కని

పించింది. అక్కడ ఓ అబ్బాయి కూచున్నాడు.

'వెల్ కమ్ టు గోవా ట్రెక్కింగ్. అయామ్ అమిత్ ముండా ఫ్రం జార్ఖండ్' అంటూ చేయి సాచాడు.

ఆరుగురూ తమ అనుమతి పత్రాలు అందజేశారు.

అతడు కొన్ని ఫారాలు వీళ్ల ముందు పడేసి 'నింపండి' అన్నాడు. నింపి ఇచ్చిన తరువాత 'ఈ క్యాంపులో కొన్ని నియమాలు పాటించాలి. ఆడవాళ్ళ టెంట్లు వేరు, మగవారి టెంట్లు వేరు. ఎట్టి పరిస్థితులలో మగవారు, ఆడవారి టెంట్ల వైపు వెళ్లకూడదు. మాట్లాడాలనుకుంటే క్యాంపు మధ్యలోకి వచ్చి మాట్లాడాలి. ఒక అరగంట తరువాత రండి మీకు ఐడెంటిటీ కార్డిస్తాను. అది ఉంటేనే మీరు స్విమ్మింగ్‌లో అడుగు పెట్టగలరు. టాయిలెట్లు, స్నానపు గదులు స్విమ్మింగ్ పూల్ కాంప్లె క్స్‌లో ఉన్నాయి' అని రాజు వైపు తిరిగి 'మీరు ఏడో నెంబరు టెంట్ లోకి వెళ్ళండి' అని పుణెవాళ్ల వైపు తిరిగి 'మీ టెంటు నెంబరు పద హారు. మీకేమైనా షాపింగ్ పనులుంటే వెళ్ళి రండి. సాయంత్రం ఆరు లోగా రావాలి. మళ్ళీ బయటకు వెళ్లనివ్వం' అన్నాడు ఖచ్చితంగా.

అందరూ తలలూపి మళ్ళీ అరగంటలో కలుద్దామని వాగ్దానాలు చేసుకుని ఎవరి టెంట్ల వైపు వారెళ్ళిపోయారు.

★ ★ ★

'మన టెంట్లో ఇంకా ఎవరో ఉన్నట్టున్నారు' అన్నాడు చంద్ర. టెంట్‌లో ఓ మూల పడిఉన్న సూట్ కేసులు, బట్టలు చూస్తూ.

'పర్లేదు. టెంట్ ఆరంభంలోనే ఖాళీ ఉంది. దాన్ని మనం ఆక్ర మిద్దాం. కాస్త గాలి వస్తుంది' అన్నాడు రాజు.

'గాలేమో కానీ వచ్చిపోయేవాళ్లు తొక్కుతారు' అన్నాడు చంద్ర.

'ఏదో ఒకటోయ్. పర్లేదు. ట్రెక్కింగ్‌కి వచ్చినప్పుడు అన్నీ పట్టించు కోకూడదు' అన్నాడు రాజు ఓ మూలకి తన సామాను విసిరేస్తూ.

టెంటు ద్వారం దగ్గరగా కిరణ్ తన సామాను పెట్టాడు. రాజుకి మరో వైపు తన సామాన్లు పడేశాడు చంద్ర.

'ఈ పది రోజులు, ఇలా కింద పడుకోవాల్సిందేనా' ఇబ్బందిగా ముఖం పెట్టి అడిగాడు చంద్ర.

'ఇదో అనుభవమోయ్. ఎంజాయ్! అన్నాడు రాజు.

'ఒరే కశ్మీరా ఎలాగనిపించిందిరా? పడుతుందంటావా? ' అడిగాడు చంద్ర.

'ఒరేయ్ ఒకటి గుర్తుంచుకో నీకు పెళ్లయింది. అందమైన భార్య ఉంది. ముద్దులొలికే పిల్లలు ఇద్దరున్నారు. మన ట్రెక్కింగ్ ఓ పది రోజులు మాత్రమే ఉంటుంది. ఇంతలో మనం అందినవి అందినట్టు ఎంజాయ్ చేసి బుద్ధిగా ఇంటికెళ్లిపోవాలి తప్ప, ఎవరితో పెద్దగా అటా చ్‌మెంట్ పెట్టుకోవద్దు. తరువాత నువ్వు బాధపడి నీ చుట్టు పక్కల వాళ్లని బాధపెడతావు' సీరియస్‌గా చెప్పాడు రాజు. విసురుగా లేచాడు చంద్ర.



ఆడవాళ్ళ టెంట్లు వేరు, మగవారి టెంట్లు వేరు. ఎట్టి పరిస్థితు లలో మగవారు, ఆడవారి టెంట్ల వైపు వెళ్ల కూడదు. మాట్లాడాలను కుంటే క్యాంపు మధ్యలోకి వచ్చి మాట్లాడాలి.





'రాజూ... నువ్వు నా గార్డియన్‌వి కాదు. నేనేం చిన్న పిల్లవాడిని కాదు. ప్రతి విషయంలో నువ్వు నా మీద ఆంక్షలు పెట్టి, లెక్చర్లిచ్చేయనవసరం లేదు' అన్నాడు కోపంగా.

వారిద్దరి మధ్యకు వచ్చాడు కిరణ్

'శాంతి... ఇంకా ట్రెక్కింగ్ మొదలే కాలేదు. అప్పుడే వాగ్వివాదాలేంటి' అన్నాడు నవ్వుతూ. చంద్ర విసురుగా బయటకు వెళ్లబోయాడు.

'ఎక్కడికి' అడిగాడు రాజు.

'సిగరెట్ తాగటానికి' అంటూ వెళ్లిపోయాడు చంద్ర.

'చిన్నపిల్లవాడి మనస్తత్వం. మంచి చెప్తే అర్థం కాదు. అహం దెబ్బతింటుంది' అన్నాడు రాజు.

'పోనీలే' అన్నాడు కిరణ్. ఏమనాలో తెలియక.

'కిరణ్ కాసేపయ్యాక మేమిద్దరం బయటకు వెళ్లి వస్తాం. నువ్వూ వస్తావా? అడిగాడు రాజు.

'ఏమైనా కొనాలా?

'లేదు... ఎలాగూ వారం రోజులు ఛాన్స్ దొరకదు కదా. కాస్త మందు కొట్టి వద్దామని'

'మీరెళ్లండి' అన్నాడు కిరణ్.

## 3

రాజు, చంద్ర బయటకు వెళ్లిపోయారు. టెంట్‌లో కిరణ్ ఒక్కడే మిగిలాడు. మళ్లీ వీణ ఆలోచనలు చుట్టుముట్టసాగాయి. తల విదిలించి టెంటు బయటకు వచ్చాడు కిరణ్.

సామాన్లు పట్టుకుని అప్పుడే క్యాంపుకు వస్తున్నారు కొందరు. క్యాంపులో ఓ మూల కొందరమ్మాయిలు కూచుని మాట్లాడుకుంటున్నారు.

మరోవైపు ఓ అబ్బాయి, అమ్మాయి ఏదో చర్చిస్తున్నారు దీర్ఘంగా.

కిరణ్ మళ్లీ టెంటులోకి వచ్చాడు. తనతో పాటు తెచ్చుకున్న నవల చదవటం ఆరంభించాడు. ఎవరో టెంటులోకి వస్తున్న శబ్దం అయితే తల ఎత్తాడు.

ఇద్దరు యువకులు 'ఉష్' అంటూ టెంట్‌లోకి వచ్చి ఓ చోట బ్యాగులు పెట్టుకున్నారు. వాళ్లు కిరణ్‌ని పట్టించుకోలేదు.

వాళ్లలో ఒక యువకుడు నల్లగా, పొట్టిగా, లావుగా ఉన్నాడు. టీ షర్టు వేసుకున్నాడు. మరో యువకుడు సన్నగా, పొడుగ్గా ఉన్నాడు. గుండు కొట్టించుకున్నట్లున్నాడు. తలపై వెంట్రుకలు లేవు.

ఆ నల్లవాడు మరో యువకుడిని ఉద్దేశించి 'అబే టక్లూ (బోడిగుండు) మొన్న మీ ఆఫీసులో ఏదో గొడవ అయిందన్నావు? ' అనడిగాడు.

'అవున్రా' అంటూ 'టక్లూ' ఆ గొడవ చెప్పసాగాడు. వాళ్ల మాటల్ని బట్టి వాళ్లిద్దరూ కంప్యూటర్ సంబంధ ఉద్యోగాలు చేస్తున్నారని గ్రహించాడు కిరణ్

గుండు వ్యక్తి పేరు చేతన్ అని మరోవ్యక్తి పేరు 'సెలిన్' అని వాళ్లు బెంగుళూరు నుంచి వచ్చారనీ గ్రహించాడు.

ఇంతలో టెంటు లోపలకి ఓ యువకుడు విసురుగా వచ్చాడు. నిండా ఇరవై ఏళ్లు ఉండవు అతడికి. షూస్ వేసుకునే టెంట్‌లోకి వచ్చి అందరినీ కలయచూశాడు. 'మిమ్మల్నీ టెంట్‌లోకి ఎవరు రమ్మన్నారు? ' గద్దించి అడిగాడు కిరణ్‌ని

'రిసెప్షన్‌లో వాళ్లు' చెప్పాడు కిరణ్

'నేను అమిత్‌కి చెప్పాను నా టెంట్‌కి వేరే ఎవరినీ పంపవద్దని' అని విసవిస నడుస్తూ వెళ్లిపోయాడు.

'ఎవరతను? ' కిరణ్ అడిగాడు చేతన్‌ని

'ఏమో నాకు తెలియదు.' అని తనని తాను పరిచయం చేసుకున్నాడు చేతన్. ముగ్గురు పరిచయాలు చేసుకుంటుండగా, మళ్లీ విసురుగా వచ్చాడా యువకుడు. బూట్లతోనే టెంట్ చివరి వరకూ వెళ్లాడు. మళ్లీ అంతా కలయచూశాడు.

'ఇదిగో... మీరెవరూ అనవసరంగా మాట్లాడొద్దు' అన్నాడు మళ్లీ బెదిరిస్తున్నట్టుగా. 'ఎవరు నువ్వు' అడిగాడు సెలిన్ కోపంగా.

'నా పేరు సందీప్. నేను జార్ఖండ్ నుంచి వచ్చాను'. గర్వంగా చెప్పాడు సందీప్. 'సందీప్.. నువ్వు మా కన్నా చిన్నవాడివి, మాతో మర్యాదగా మాట్లాడాలి' అన్నాడు చేతన్. 'మర్యాదగానా? నా మాట తీరే అంత' విసురుగా అన్నాడు ఆ అబ్బాయి. అని ధబ్బున కూలబడి బూట్లు విప్పి అక్కడినుంచే కూచున్న వాళ్లందరి మీద నుంచి బయటకు విసిరేశాడు.

'నాకు జార్ఖండ్‌లో పెద్ద వ్యాపారం ఉంది. ఇది ఆఫ్ సీజన్ అందుకని వచ్చా నా ఫ్రెండు కూడా నాతో వచ్చాడు. వాడు చాలూగాడు ఎవరూ అడగకుండానే చెప్పాడు. 'నువ్వు చదువుకోలేదా' సెలిన్ అడిగాడు.

'ఆ ఏదో చదివా. కానీ చదువులో ఏముంది? టైమ్ వేస్ట్. నాన్న వ్యాపారం చూస్తున్నా. మా జార్ఖండ్ ప్రత్యేక



రాష్ట్రంగా ఏర్పడినప్పటి నుంచీ వ్యాపారం బాగా నడుస్తోంది'. మెళ్లో గొలుసుతో ఆడుకుంటూ చెప్పాడతడు

'ఎందుకో ఈ కుర్రాడు న్యూనతాభావంతో బాధపడుతున్నా డనిపించింది కిరణ్‌కు. జార్ఖండ్‌లో అధికులు వెనకబడిన జాతివారు. అక్షరాస్యత అంతంత మాత్రమే. పట్నంవాళ్ళు చదువుకున్నవాళ్ళు అయిన తామెక్కడ అతడిని చులకనగా చూస్తామేమో అన్న భయం ఉన్నట్టుంది. అందుకని ముందే తమపై అధికారం చలాయించి, తన ఆధిక్యతను నిలుపుకునే ప్రయత్నం చేస్తున్నాడని' అనుకున్నాడు కిరణ్.

'యే హీ టెంట్ సెవెన్ హై క్యా? ' అనడుగుతూ ఓ ముసలాయన టెంట్‌లోకి వచ్చాడు. అతడికి అరవై పైనే ఉంటుంది.

'ఇక్కడ జాగా లేదు. వేరే టెంటుకి పో' అరిచాడు సందీప్.

ముసలాయన సందీప్ వైపు నిశితంగా చూశాడు. ఒక అడుగు లోప లకు వేశాడు. రిసెప్షన్‌లో ఇక్కడికి వెళ్లమన్నారు. నీకేమైనా సమస్య ఉంటే వాళ్లకి చెప్పుకో' అని చేతన్ పక్కన స్థలంలో సామాను పెట్టాడు.

'నేను జార్ఖండ్ వాడిని. రిసెప్షన్‌లో ఉన్నది మా జార్ఖండ్‌వాడే' బెదిరిస్తున్నట్టు అన్నాడు సందీప్

ముసలాయన నవ్వాడు.

'నీలాంటి వాళ్లని చూసి నా తల పండిపోయింది. నా పేరు మారు క్కర్. మాధవ్ మురుమ్కర్. నేను బొంబాయి వాడిని' అన్నాడు.

వెంటనే చేతన్, 'బొంబాయిలో ఎక్కడ? ' అని అడిగాడు

'థానె' చెప్పాడు ముసలాయన.

'మేమిద్దరం బొంబాయిలో రెండేళ్లు పనిచేశాం. మా అఫీసు దాద ర్‌కి దగ్గర' అన్నాడు చేతన్. వాళ్లు బొంబాయి గురించి మాట్లాడుకో సాగారు.

సందీప్ పెద్దగా ఆవలించాడు.

బయటనుంచి విజిల్ పెద్దగా వినిపించింది.

'టీ టైమ్' అని లేచి బయటకు పరుగెత్తి, టెంటు బయట నుంచుని 'తాతా... నేను గ్లాసు మరిచిపోయాను. నా బ్యాగు పక్కన ఉంది ఇస్తావా? ' అనడిగాడు సందీప్. ఆయన మౌనంగా గ్లాసు అందిం చాడు. అది అందుకుని సందీప్ వెళ్లిపోయాడు.

'వీడితో ట్రెక్కింగ్‌లో మనకు సమస్యలొస్తాయి' టీ కోసం తానూ లేస్తూ అన్నాడు మాధవ్ మురుమ్కర్.

మౌనంగా తనూ వాళ్లని అనుసరించాడు కిరణ్.

క్యాంపులో ఓ మూల ఒక టెంట్‌ను కిచెన్‌గా మార్చారు. దాని బయట బల్లవేసి టీ డ్రమ్ పెట్టారు. పక్కన ప్లేటులో బిస్కెట్లు న్నాయి. టీ కప్పులో పోసుకుని బిస్కెట్లు తీసుకుని దగ్గరలో ఉన్న గడ్డిలో కూర్చుంటున్నారందరూ.



**జార్ఖండ్‌లో అధికులు వెనకబడిన జాతివారు. అక్షరాస్యత అంతంత మాత్రమే. పట్నం వాళ్ళు చదువు కున్నవాళ్ళు అయిన తామెక్కడ అతడిని చులకనగా చూస్తామేమో అన్న భయం ఉన్నట్టుంది.**



కిరణ్ కూడా వారిని అనుసరించాడు.

సందీప్ వీళ్లవెంట రాకుండా, 'మంజూ' అంటూ ఓ అమ్మాయి దగ్గరకు వెళ్లాడు. చిన్నగా నల్లగా వెస్టిండియన్‌లా ఉంది ఆ మంజూ అనే అమ్మాయి. 'నేను బోలెడన్ని ట్రెక్కింగ్‌లు చేశాను. బోలెడంత మంది మనుషులను చూశాను' అంటూ చెప్పసాగాడు మురుమ్కర్. చేతన్, సెలిన్‌లు ఆసక్తిగా వింటూ ప్రశ్నలు వేయసాగారు.

ఇంతలో కిరణ్ దృష్టి అప్పుడే అటుగా వస్తున్న పుణె అమ్మాయిలవైపు పడింది. వారితోపాటు ఇంకో అమ్మాయి ఉంది. ఆమె తెల్లగా ఉన్నా లావుపాటి కళ్లద్దాలున్నాయి.

నలుగురూ నవ్వుతూ, మాట్లాడుతూ టీ తీసుకున్నారు. వాళ్ల దృష్టి కిరణ్‌పై పడింది. నవ్వుతూ కిరణ్ దగ్గరకొచ్చారు.

'ఏరీ మీ ఫ్రెండ్స్?' అడిగింది స్వప్న.

'షాపింగ్‌కు వెళ్లారు' ముక్తసరిగా చెప్పాడు కిరణ్.

'కూచోండి. ఎక్కడనుంచి వచ్చారు మీరు?' వాళ్లనుద్దేశించి అడిగాడు మురుమ్కర్. వాళ్లు చెప్పారు. కూర్చున్నారు.

వెంటనే మాటలు కలిపాడు మురుమ్కర్. చేతన్, సెలిన్‌ల పరిచయాలయ్యాయి.

'హల్లో స్వప్నా' చనువుగా పక్కన కూర్చున్నాడు రాజు.

'హాయ్ కశ్మీరా' ఆమె దగ్గర కూర్చున్నాడు చంద్ర.

మళ్లీ అందరి పరిచయాలయ్యాయి.

'ట్రెక్కింగ్‌లో నాకు ఇష్టమైన అంశం ఇదే. ఒక్కక్షణం క్రితంవరకూ అపరిచితుల్లా ఉంటాం. కానీ క్షణంలో ఆప్తమిత్రులమయిపోతాం. ఆపై పది రోజులపాటు ఒక కుటుంబంలా కలసి తిరుగుతాం. జీవితాంతం మిత్రులమై నిలుస్తాం' అన్నాడు మురుమ్కర్.

'అవును. మేం హిమాచల్ ప్రదేశ్‌లో ట్రెక్కింగ్‌కి వెళ్లినప్పుడు మీ హైదరాబాద్ నుంచి వచ్చిన ముగ్గురు యువకులు కలిశారు. ఇప్పటికీ మేం ఫోన్‌లో మాట్లాడుకుంటాం' చెప్పింది కశ్మీరా.

'నేను దేశమంతా ట్రెక్కింగ్ చేశాను. ట్రెక్కింగ్ ఒక అద్భుతమైన అనుభవం. ప్రకృతిని ఇంత తీరికగా ఇంత దగ్గరగా పరిశీలించే అవకాశం మనకు ట్రెక్కింగ్‌లో తప్పించి మరెక్కడా రాదు' వింటున్నారో, లేదో కూడా చూడకుండా చెప్పుకుంటూపోతున్నాడు మురుమ్కర్.

టీ తాగటం పూర్తవుతుండగా విజల్ మోగింది.

'గ్రూప్ నెంబర్ సెవెన్. అందరూ మైదానంలో సమావేశం కండి' మైకులో పిలుపు వినిపించింది.

'ఆ పిలుపు మనకే' నంటూ లేచారు అమ్మాయిలు.

'ఛలో గ్లాసులు కడిగేసుకుని త్వరగా లేద్దాం' అంటూ లేచాడు మురుమ్కర్.

'మన గ్లాసులు మనమే కడుక్కోవాలా?' ఆముదం తాగిన వాడిలా ముఖం పెట్టాడు చంద్రం.



ఒక్కక్షణం
క్రితం వరకూ
అపరిచితుల్లా
ఉంటాం. కానీ
క్షణంలో
ఆప్తమిత్రుల
మయిపోతాం.
ఆపై పది రోజుల
పాటు ఒక
కుటుంబంలా
కలసి
తిరుగుతాం.
జీవితాంతం
మిత్రులమై
నిలుస్తాం'



'ట్రెక్కింగ్‌లో మజా అదే. నీ గ్లాసులు నువ్వే కడుక్కోవాలి. నీ ప్లేట్లు నువ్వే కడగాలి' అంటూ పెద్దగా నవ్వాడు మురుక్కర్.



'డియర్ ఫ్రెండ్స్. మీ అందరికీ గోవా ట్రిప్‌కు సాదర ఆహ్వానం. నా పేరు మనోహర్‌జోషి'

దాదాపుగా నలభై యాభై మధ్యలో ఉంటుంది వయసు. బట్టతల. చూస్తుంటేనే ధనవంతుడని, అధికారం చలాయించేందుకు అలవాటు పడినవాడని తెలుస్తోంది.

గోవా చాలా అందమైన స్థలం. ప్రాకృతికంగా, చారిత్రికంగా ఎంతో అద్భుతమైన స్థలం. మీది బ్యాచ్ నెంబర్ సెవెన్. ఇంకా మీ బ్యాచ్‌లో కొందరు రావాల్సి ఉంది. కాబట్టి ఇప్పుడే మీకు నేను ట్రెక్కింగ్ వివరాలు చెప్పను. ఇప్పుడు మీరు ఒకరికొకరు పరిచయం చేసుకోవాలి. తరువాత దుప్పట్లు తీసుకుని టెంట్లకు వెళ్లండి. ఏడు గంటలకు డిన్నర్ ఉంటుంది. ఎనిమిది గంటలకు క్యాంప్ ఫైర్ ఉంటుంది. 'క్యాంప్‌ఫైర్' అంటే అందరికీ తెలుసనుకుంటాను. అయినా చెప్తాను. మనం భారతదేశం నలుమూలల నుంచి వచ్చి ఇక్కడ కలిశాం. మన భాషలు వేరు, జీవన విధానాలు వేరు. అలవాట్లు వేరు. కానీ మనందరిది ఒకే సంస్కృతి. ఇక్కడ కలసిన మనం మన ప్రాంతానికి చెందిన జానపదగీతాలు, సంప్రదాయాన్ని ప్రతిబింబించే గీతాలు పాడతాం. పరిచయం చేసుకుంటాం. అలా ఒకరికొకరం దగ్గరవుతాం. ఎవరైతే క్యాంప్‌ఫైర్‌లో ఐటమ్ ప్రదర్శించాలనుకుంటున్నారో వారు తమ పేర్లివ్వాలి. పది గంటలకల్లా అంతా నిద్రపోవలసిందే. మళ్లీ ప్రొద్దున్న అయిదున్నరకు 'బెడ్‌టీ' మీ టెంట్ దగ్గరకు వస్తుంది. తరువాత కార్యక్రమం రాత్రి క్యాంప్‌ఫైర్ తరువాత చెప్తాను. అందరూ ఒక విషయం స్పష్టంగా గుర్తుంచుకోవాలి. మీరు ట్రెక్కింగ్‌లో ఉన్నంత కాలం క్రమశిక్షణ తప్పనిసరిగా పాటించాలి. మేం చెప్పిన సూత్రాలు ఖచ్చితంగా పాటించాలి. ఏ మాత్రం క్రమశిక్షణారాహిత్యాన్ని కూడా క్షమించం.' నిక్కచ్చిగా చెప్పాడు మనోహర్

అందరూ తలలూపారు.

'ఇలాగే చెప్తారు. పాటించే వాడికి క్రమశిక్షణ. లేనివాడికి ఏమీలేదు' అన్నాడు మురుక్కర్ గుసగుసగా.

'ఇప్పుడు మీరంతా మీ పేరు, ఎక్కడ నుంచి వచ్చారు, ఏం పని చేస్తారు, ఇంతకు ముందు ఏమేం ట్రెక్కులు చేశారో చెప్పండి' అన్నాడు జోషి.

వరుసగా పరిచయాలు జరగటం ఆరంభమయింది.

అప్పుడు గమనించాడు కిరణ్... తమ జట్టులో బెంగాల్ నుంచి వచ్చిన వారున్నారు. జార్ఖండ్, బెంగళూరు, బొంబాయి నుంచి వచ్చారు. గుజరాత్ నుంచి, ఢిల్లీ నుంచి వచ్చారు. అయితే అందరి దృష్టిని ఆకర్షిస్తున్నది కాశ్మీర్ నుంచి వచ్చిన ఆరుగురు యువకులు!

వాళ్ళు కాశ్మీర్ నుంచి వచ్చారన్నది పెద్ద ఆకర్షణీయమైన అంశం అయింది. వాళ్ళ ఆరుగురికీ నాయకుడిలాంటి వాడి పేరు నవీద్. తెల్లగా, పొడుగ్గా ఉన్నాడు. అతని పక్కన కూర్చున్న మరో కాశ్మీరీ యువకుడి పేరు గాజీ. వీళ్లంతా తెల్లగానే ఉన్నా, నవీద్ అంత పొడుగు లేరు. అందరూ 'దోడా' జిల్లాకు చెందిన వారే.

'మేమంతా మిత్రులం. చిన్నప్పటి నుంచీ కలసి పెరిగాం. నాకు ఢిల్లీలో వ్యాపారం ఉంది. వీళ్లంతా చదువుతున్నారు. ఢిల్లీలో నాతోపాటే ఉంటున్నారు. ప్రస్తుతం మా జిల్లాలో పరిస్థితి బాగా లేకపోవటంతో మేం సంవత్సరంలో ఒకటి, రెండు నెలలే మా జిల్లాకు వెళ్తాం. అది కూడా అమర్నాథ్ యాత్ర సీజన్‌లో వెళ్తాం. డబ్బులు సంపాదించుకుని మళ్లీ ఢిల్లీ వచ్చేస్తాం'.

అందరూ నవీద్ మాటలను ఏకాగ్రతతో, అదేదో అద్భుతం వింటున్నట్టు విన్నారు. పరిచయం తోటే జట్టులో వాళ్ళకొక ప్రత్యేకత వచ్చేసింది.

కాశ్మీరీ వాళ్ళ తరువాత అందరి దృష్టి అమ్మాయిల వైపు మళ్లింది. వాళ్ళ పరిచయాన్ని ఏకాగ్రతగా వినసాగారు.

'నా పేరు అనూరాధ. ఇంటీరియర్ డెకరేటర్‌ని' చెప్పిందొకామె. 45 ఏళ్ళ పైన ఉంటాయి ఆమెకి.

'నా పేరు ఆరోహి. నేను ఎంబిబిఎస్ పరీక్ష రాసి వచ్చాను. అనురాధ మా అమ్మ' చెప్పిందొక అమ్మాయి. చూడటానికి పొట్టిగా చిన్న పిల్లలా ఉంది. ఎంబిబిఎస్ అంటే ఎవరికీ నమ్మబుద్ధి కాలేదు.

'నా పేరు అసావేరి. నేను ఇంటర్ చదువుతున్నాను' చెప్పింది లావు పాటి కళ్లద్దాల అమ్మాయి.

'నా పేరు రుజిత. నేను తొమ్మిదో తరగతి పరీక్షలు రాశాను'.

ఆ అమ్మాయిని చూస్తే తొమ్మిదో తరగతి అమ్మాయిలా అనిపించటం లేదు. ఏదో డిగ్రీ చదువుతున్న అమ్మాయిలా ఉంది. పరువం ఆమె శరీరంలో పరవళ్ళు తొక్కుతున్నట్టుంది. ఆమె వేసుకున్న టాప్, ప్యాంటు నడుమ ఆమె నడుము అందరి దృష్టిని ఆకర్షిస్తోంది.

'నా పేరు ప్రీతి. నేను ఢిల్లీ నుంచి వచ్చాను. ఫారెస్ట్ కన్సర్వేషన్ విషయంలో బయోడైవర్సిటీ (జీవ వైవిధ్యం) మీద రీసెర్చి చేస్తున్నాను'

తెల్లటి శరీరం, సన్నగా, నాజూకుగా ఉన్న ఒళ్ళు, కలువల్లాంటి కళ్ళు, శరీరపు



లావణ్యాన్ని ప్రస్ఫుటం చేస్తూ ఒంపుసొంపులను ప్రదర్శిస్తూ, ప్రదర్శించనట్టుండి ఊరిస్తున్న దుస్తులు... అప్పుడే ప్రీతి అందరికీ ప్రీతిపాత్రమయిపోయింది.

అందరి పరిచయాలు వింటుంటే కిరణ్ మదిలో అనేక ఆలోచనలు కలగసాగాయి. ఇక్కడికి వచ్చిన యువతీ యువకులంతా ఇరవై అయిదు లోపువాళ్ళే. అమ్మాయిలు ఒంటరిగా వచ్చారు. వీరందరికీ జీవితం పట్ల ఒక ఆలోచన ఉంది. తెగింపు, ధైర్యం ఉన్నాయి. తనకు పరిచయం అయిన తమ సమాజంలో ఇంత ధైర్యం, తెగువ ప్రదర్శించే అమ్మాయిలు తక్కువ. వాళ్ల ధైర్యం తెగువలు, ప్రేమించటంలో తప్ప మరే విషయంలో కనబడవు. జీవితంలో తనకేం కావాలో నిర్ణయించుకుని, దాన్ని పొందేందుకు ప్రయత్నాలు చేయటం కనబడవు. అసలు ఒక లక్ష్యమంటూ ఉన్నట్టు కనబడితేగా? పరిచయాలయిన తరువాత అందరూ కాశ్మీరీ యువకుల చుట్టూ మూగారు. ముఖ్యంగా అమ్మాయిలు ఎంతో కుతూహలంగా వారి వెంటే తిరగసాగారు.

'ఇదిగో ఈ ప్రత్యేకంగా చూడటమే వాళ్లని పాడు చేసింది. వాళ్లూ మనలాంటి మనుషులే. ఏదో వింత చూసినట్టు చూస్తూ, గొప్ప వాళ్ళతో వ్యవహరించినట్టు వ్యవహరిస్తే ఎలా? కళ్ళు నెత్తికెక్కుతాయి' గొణిగాడు మురుమ్కర్.

చంద్ర మైదానంలో నిలబడి కశ్మీరాతో మాట్లాడేస్తున్నాడు. రాజు స్నేహతో ఏదో చర్చిస్తున్నాడు.

కిరణ్ నెమ్మదిగా టెంటు వైపు నడిచాడు.

ఇక్కడే ఓ మినీ భారతదేశం ఉన్నట్టు అనిపించింది కిరణ్‌కు. అప్పుడే కాశ్మీరీ యువకుల పట్ల కొందరిలో ఆసక్తి, మరి కొందరిలో ఈర్ష్య జనించాయి. ఎవరికి వాళ్ళు జట్లు కట్టేసుకుంటున్నారు.

టెంటులో తన స్థానంలో ఒంటరిగా కూచున్న కిరణ్ మదిలో 'వీణ తన వెంట ఉంటే తానిలా ఒంటరిగా ఉండేవాడా?' అన్న ఆలోచన మెదిలింది.

★ ★ ★

డిన్నర్ విజిల్ మోగింది.

'కిరణ్, మా ప్లేట్లు కూడా పట్టుకురా' బయట నుంచే అరిచాడు రాజు. మళ్లీ 'టీ' సమయంలో లాగే గుంపులు గుంపులుగా కూర్చుని తినటం ఆరంభించారు.



## విశ్వనాథ, కృష్ణశాస్త్రిపై విసుర్లు!

జాషువా రోజుల్లో దేవులపల్లి భావకవిత్వం ఓ వైపు, అర్థధర్మమే కవిత్వమని వాదించే విశ్వనాథ పాషాణపాకం మరోవైపు ఆంధ్రరాష్ట్రాన్ని ముంచెత్తేవి. వీరిద్దరినీ ఎత్తిపొడిచేవారు జాషువా.

'ఒకడేడ్చియేడ్చి పాతకులేడ్వలేదంచు
కోపించి తెలివి తక్కువకు వగచు
ఒకడాత్మజాత్యున్నతికి ముప్పురాకుండ
మాటిమాటికి రామకోటి వ్రాయు'

అంటూ వారిద్దరిని ఉతికి ఆరేస్తుంటే చివరికి ఆకవులిద్దరి భక్తులకు కూడా పొట్టచెక్కలయ్యేదట. అదీ జాషువా.. సరసత!

'అటు చూడు...' కిరణ్‌ని మోచేత్తో పొడిచి చూపించాడు చంద్ర.

కాశ్మీరీ యువకులు ఆరుగురు, ప్రీతి, అసావేరి, రుజిత, సురభి అనే ఇంకో అమ్మాయి కలసి ఓ చోట కూచున్నారు.

'కాశ్మీరీలనగానే పడిపోయారు అమ్మాయిలు' కసిగా అన్నాడు చంద్ర.

కిరణ్ మాట్లాడలేదు.

'ప్రీతికి మహా గర్వం' అంది స్నేహ.

'ఎందుకని?' అడిగాడు రాజు.

'ఏమో... దానికే ఫేషన్లన్నీ తెలిసినట్టు చేస్తుంది. మాకసలు శుభ్రత తెలియనట్టు, మేం అనాగరికులం అయినట్టు ప్రవర్తిస్తుంది' అంది కశ్మీరా.

'ఛాన్స్ దొరకనీ. ఆమె అహంకారం అణుస్తా' అన్నాడు చంద్ర.

'నీకెందుకురా?' చిరాకుపడ్డాడు రాజు.

చంద్ర చిన్నబుచ్చుకున్నాడు.

'ఈ టూర్ అయ్యేలోగా వీళ్లిద్దరూ ఘర్షణ పడకపోతే తాను అదృష్టవంతుడు' మనసులో అనుకున్నాడు కిరణ్.

ఇంతలో ఓ అమ్మాయి వీళ్ల దగ్గరకు వచ్చింది. చేతిలో ఓ నోటుబుక్కు, పెన్ను ఉన్నాయి.

'హలో అయామ్ బిశ్వ ఫ్రమ్ మణిపూర్. నేనివ్వాళ క్యాంప్ ఫైర్‌లో మాస్టర్ ఆఫ్ సెరెమనీని. మీరెవరైనా ఏదైనా ఐటం చేస్తారా?' అడిగింది.

ఎవరూ మాట్లాడలేదు.

'ఏమైనా పాటలు, నృత్యాలు, జోకులు, కథలు... ఏవైనా...,' అడిగింది.

ఎటువంటి ప్రతిస్పందన రాకపోవటంతో 'థాంక్యూ' అని మరో గుంపు వైపు వెళ్లింది.

'క్యాంప్‌ఫైర్ ఓ పెద్ద బోరు. కానీ తప్పని సరిగా కూచోవాలంటారు' విసుగ్గా అంది స్వప్న.

'ఆ బోరు భరించినందుకు చివర్లో బోర్న్ వీటా ఇస్తారు గదే' అంది కశ్మీరా.




క్యాంప్‌ఫైర్ ఆరంభమయింది.

ఓ కన్నడ అమ్మాయి ఏదో కన్నడ భజన పాడింది. నాసిక్ నుంచి వచ్చిన అబ్బాయి సంత్ జ్ఞానేశ్వర్ రాసిన కీర్తన పాడాడు. కాశ్మీరీలంతా కలిసి కాశ్మీర్ జానపద పాట పాడారు...

అసావేరి, రుజిల్, సురభి కలిసి సెలీన్ డియాన్ టైటానిక్‌లో పాడిన "మై హార్ట్ గోస్ ఆన్" పాడేరు.

సందీప్‌తో మాట్లాడిన నల్ల అమ్మాయి ఓ గజల్ పాడింది. ఆమె జార్ఖండ్ నుంచి వచ్చింది. ముంబాయి నుంచి వచ్చిన పది మంది యువకులు ఓ సామూహిక గానం పాడేందుకు మైకు దగ్గరకు వచ్చారు.

వారిలో ఒక అబ్బాయి మైకు పట్టుకుని "నేను దినేష్. నటుడిని. ఇప్పుడు మేమంతా కలిసి ఓ ఫేమస్ పిక్నిక్ పాట వినిపిస్తాం' అన్నాడు.

'వన్... టూ... త్రీ...' అన్నాడు.

వెంటనే అందరూ ఎంతో అలవాటున్న వారిలా పాట ఆరంభించారు.

ఇచ్చి చాల్ తుర్రు తుర్రు
ఉడ్‌తీ కేశ్ బుర్రు బుర్రు
డావ్య డోల్యావర్ ఎట్ట ధవలీ
జస్సి మావళ్లుచ ఉన్హాత్. కేవళ్లు చ వనాత్
నాగిన్ సళ సళలీ

ఆ పాటలోని పదాల ప్రయోగానికీ, బాణీకి, లయకీ అందరూ ఊగిపోయారు.

భాష తెలియకున్నా పాట అర్థం అవు

## ట్రెక్కింగ్ అంటే



కొండలమీద నుంచి సాగిపోతున్న ట్రెక్కింగ్ బృందం

'ట్రెక్' అంటే కాలినడకన చేసే సుదూరమైన కఠిన ప్రయాణం. ట్రెక్కింగ్ అంటే అడవులు, కొండల వెంబడి సామాన్లు మోసుకుంటూ, క్యాంపులు ఏర్పరచుకుంటూ చేసే సుదీర్ఘమైన ప్రయాణం అన్న భావన ప్రచారంలో ఉంది. కానీ వలస వెళ్లటాన్ని కూడా 'ట్రెక్' అంటారు. ఈజిప్టు వదలి యూదులు వలస వెళ్లటాన్ని సూచించేందుకు 'ఎక్సోడస్' అన్న పదం ఉన్నా వారి ప్రయాణం 'ట్రెక్కింగ్' పరిధిలోకే వస్తుంది. కాబట్టి 'ట్రెక్కింగ్' అనగానే కొండలెక్కటమే అని భావిస్తే అది అపోహే.

'ట్రెక్కింగ్' ఒక సాహసచర్య. భుజాన, కావలసిన తిండి పదార్థాలు, అత్యవసరమైన వస్తువులు, దుస్తులు మోసుకుంటూ దుర్భేద్యమైన దారుల్లో నడుస్తూ వెళ్లటం, ఎంతో ఉత్సాహాన్ని,

తూనే ఉంది.

ఆ తరువాత బెంగాలీ గుంపులోంచి అషుతోష్ అనే యువకుడు వచ్చాడు. అతడు మైకు దగ్గరకు వస్తుంటేనే బెంగాలీ వాళ్లంతా కేకలువేసి గోల చేశారు.

అతను 'అఖ్లచలో' అనే రవీంద్రుడి గీతం పాడాడు.

అది కూడా లయబద్ధంగా ఉండి వినేవారిని ఉర్రూతలూగించింది.

'నీకేమైనా పాటలొచ్చా?' రాజు, చంద్రని అడిగాడు.

'నాకేమొచ్చు, ఏమీరావు' అన్నాడు చంద్ర "నీకు కిరణ్?"

కిరణ్ తల అడ్డంగా ఊపాడు.

కిరణ్‌కి ఎంతో బాధగా అనిపించింది. అసలు తమదంటూ ఒక్క జానపద గీతం గుర్తుకు రాలేదు. బెంగాలీ వాళ్లు టాగోర్ గీతం పాడుతున్నారు. మహారాష్ట్ర వాళ్లకి జ్ఞానదేవ్, తుకారాంలున్నారు. మరి తమకి? ఉన్నా, తమకు తెలియవు. అసలు తమకా దృష్టే లేదు. ఎంతసేపూ చదవటం, పరీక్షలు రాయటం, ఉద్యోగం వెతుక్కోవటం, పెళ్ళి చేసుకోవటం, పిల్లల్ని కనటం... అయిపోయింది తమ జీవితం.

మళ్లీ మహారాష్ట్ర యువకులు వచ్చారు.

'జై మహారాష్ట్ర మాఝా' అంటూ మహారాష్ట్ర చరిత్రను స్మరిస్తూ, రాష్ట్ర గొప్పదనాన్ని గానం చేస్తున్నారు.

'ఒరేయ్, మన రాష్ట్ర చరిత్రను, గొప్పతనాన్ని తెలిపే పాట ఏదైనా ఉందా?' అడిగాడు రాజు.

చంద్ర తల అడ్డంగా ఊపాడు.

'నాకయితే ఇదేనండి భాగ్యనగరమూ కొంత వచ్చు'

'మా తెలుగు తల్లికీ మల్లెపూదండ వచ్చా?' అడిగాడు కిరణ్.

ఇద్దరూ తల అడ్డంగా ఊపారు.

'చిన్నప్పుడు నేర్చుకున్నాను. కష్టపడితే గుర్తుకు వస్తుందేమో!' అన్నాడు కిరణ్.

ఉద్విగ్నతను కలిగిస్తుంది. నిజానికి, పూర్వకాలంలో 'ట్రెక్కింగ్' అన్న పదానికి మరో అర్థం ఉండేది. 'ట్రాక్' అంటే అపరిచితమైన ప్రాంతాలలో దారిని ఏర్పరస్తూ పోవటం అన్న అర్థం ఉండేది. అడవుల్లో బాట నేర్పరచటం, కొండదారుల్లో కాలినడకన సాగే మార్గాలు కనుక్కుంటూ, గుర్తులు ఏర్పాటుచేస్తూ పోవటం 'ట్రెక్కింగ్' క్రిందకు వస్తుంది. కానీ ఇప్పుడు 'ట్రెక్కింగ్'లో కొత్త దారులు వెతకటం, స్వయంగా దారులు కనుక్కొంటూ పోవటం లేదు. కొందరు నిపుణులు అడవుల్లో, కొండల్లో బాటలు ఏర్పరచి దారిలో చిహ్నాలుంచుతారు. అక్కడక్కడా క్యాంపులు ఏర్పాటు చేస్తారు. ట్రెక్కింగ్ ఏయే దారుల్లో చేయాలో నిర్ణయిస్తారు. ఆ ప్రణాళికను అనుసరించి ట్రెక్కర్లు, ముందే ఏర్పరచిన బాటల్లో నడుస్తూ రాత్రిళ్లు క్యాంపుల్లో విశ్రాంతి తీసుకుంటూ 'ట్రెక్కింగ్' పూర్తి చేస్తారు. అంటే ఒకప్పుడు స్వయంగా కొత్త దారులను కనుక్కునే సాహసచర్య 'ట్రెక్కింగ్' ఇప్పుడు, అన్నీ ముందే ఏర్పాటు చేస్తే ఆ బాట వెంట నడిచే సామాన్యుడి సాహస కృత్యంగా మారిందన్నమాట.

'ట్రెక్కింగ్' కోసం అన్నీ అమర్చి కార్యక్రమం నిర్వహించే ప్రైవేటు సంస్థలు అనేకం ఉన్నాయి. కానీ ప్రభుత్వ గుర్తింపు పొందిన సంస్థ 'యూత్ హాస్టల్ అసోసియేషన్'. తక్కువ ఖర్చుతో, అనంతమైన ఆనందాన్ని, అపురూపమైన అనుభూతులను అందించే ట్రెక్కింగ్ కార్యక్రమాలను నిర్వహిస్తోంది సంస్థ. దేశం నలుమూలల నుంచే కాక విదేశాల నుంచి కూడా 'ట్రెక్కింగ్' కోసం ఔత్సాహికులు వస్తుంటారు.

'ప్రయత్నిద్దాం. ఈ ట్రెక్కింగ్ అయ్యేలోగా వీళ్లకి మన జానపద గీతమో, ప్రైవేట్ పాటనో వినిపించి తీరాలి' అన్నాడు రాజు పట్టుదలగా.

'నాకు కోడిబాయె లచ్చుమ్మదీ రెండు లైన్లు వచ్చు. మాయదారి మైసమ్మో మైసమ్మో రెండు లైన్లు వచ్చు' చెప్పాడు చంద్ర.

'ఒరే ఇక్కడ తెలుగు ఎవ్వరికీ తెలియదు కదా, ఆ పాటలకి మనమే ఏవేవో పదాలు కల్పించి పాడితే సరిపోతుందికదా' ఆలోచిస్తూ అన్నాడు రాజు.

'అవును. మైసమ్మ అని ఒకసారి పాడదాం. బాలమ్మా అని ఇంకోసారి పాడదాం. రామమ్మ, లక్ష్మమ్మ, కామమ్మ, కనకమ్మ... ఇలా మార్చి పాడేస్తే పాట అయిపోతుంది కదా!' సంతోషంగా అన్నాడు చంద్ర.

'బాగానే ఉంది కానీ...'

'నాకింకా జజ్జనకరి జనారే, ఈనేల మన దిరా, బండెనక బండికట్టి పాటలన్నీ ఒక్కోలైను వచ్చు. మిగతా లైన్లు మనం కట్టేద్దాం. వారానికి సరిపడ పాటలొచ్చేశాయి.'

'ఒరే... నీకు గాజువాక పిల్ల వచ్చా...?' అడిగాడు రాజు.

'మా బుడ్డోడు పాడేవాడు. వెధవది నేను ఎప్పుడూ మనసు పెట్టి వినలేదు. ఆ పాట కూడా ఒకే లైనొచ్చు... గాజువాక పిల్ల మేం గాజులోళ్లం కాదా, నీ చీర విప్పలేదా... మా చీర కట్టలేదా...' హమ్ చేశాడు చంద్ర.

'ఏడ్చినట్టుంది. ఒక్కపాట కూడా పూర్తిగా రాదు మనకు... ఇన్నేళ్ల నుంచీ పాటలు వింటున్నాం' అన్నాడు రాజు నిస్పృహతో.

గుజరాతీ వాళ్లు ఊగిపోతూ 'సురాంగినీ' అంటూ వాళ్ల పాటేదో పాడుకుంటున్నారు.

'నాకు కడుపు మండిపోతోంది. మనం కూడా ఏదైనా చేయాలి' అన్నాడు రాజు మళ్లీ. అది చూస్తూంటే సామాజికంగా

తమలో ఉన్న లోపం అర్థమయింది కిరణ్‌కు. తాము ఎన్నడూ సామూహిక కార్యక్రమాలలో పాల్గొనరు. బెంగాలీలకు కాళీపూజ, మహారాష్ట్రీయులకు వినాయకచవితి, గుజరాతీలకు నవరాత్రి- ఇలా ప్రజలందరినీ ఒకచోట చేర్చి వారిలో సంఘీభావాన్ని నెలకొల్పే పండుగలున్నాయి. తమకు అటువంటి పండుగ ఒక్కటి కూడా లేదు. తాము సామూహికంగా కలసి చేసే పండుగయిన వినాయక చవితి కూడా చందాలడుక్కోవటం, వీధిలో రికార్డింగ్ డాన్సులు పెట్టటానికే పరిమితమైపోయింది. సంస్కారవంతులు వాటికి దూరంగా ఉంటారు. బోనాల పండుగ కూడా అందరూ కలిసి చేసేదే కానీ ఆ పండుగ అంటే కూడా కొందరికి చిన్నచూపు... గొబ్బెమ్మల పాటలు అందరూ కలిసి పాడుతారు. కానీ ఇప్పుడా పాటలేవీ?



**ఎంతో హృద్యంగా ఉన్న ఆ పాటని పాడుతున్న ఆ అమ్మాయి జీన్సు దుస్తుల్లో ఉంది. తమ దృష్టిలో ఆధునికం అంటే పాతని మొత్తంగా తిరస్కరించటమే. కానీ వీరి దృష్టిలో పాతతో సంబంధం తెంచుకోకుండా కొత్తవీ స్వీకరించటం.**



ఎవరిని చూసినా సినిమా పాటలు పాడటం, సినీ గెంతులు గెంతటం తప్ప తమ ప్రాంతీయ పలుకుబడులు, సంస్కృతి సంప్రదాయాలను ప్రతిబింబించే పాటలు నేర్వటం, పాడటం ఎక్కడుంది?

తమని తాము మరచిపోతూ, తరువాత తరాల వారిని సైతం తమ వారసత్వానికి దూరం చేస్తున్నామని అర్థం చేసుకొనేందుకు ఇంత దూరం రావాల్సి వచ్చిందా?

ఈసారి బెంగాలీ అమ్మాయి వచ్చి బెంగాలీ గీతం పాడింది. పుట్టింటిని వదిలి అత్తారింటికి వెళ్తూ, పుట్టింటిలో ఆనందాలను స్మరిస్తూ, అత్తింటిలో ఎదుర్కోబోయే అనుభవాలను తలచుకుంటూ భయపడుతూ తనని కాపాడమని దైవాన్ని వేడుకునే పాట అది.

ఎంతో హృద్యంగా ఉన్న ఆ పాటని పాడుతున్న ఆ అమ్మాయి జీన్సు దుస్తుల్లో ఉంది.

తమ దృష్టిలో ఆధునికం అంటే పాతని మొత్తంగా తిరస్కరించటమే. కానీ వీరి దృష్టిలో పాతతో సంబంధం తెంచుకోకుండా కొత్తవీ స్వీకరించటం.

మళ్లీ దినేష్ మైకు దగ్గరకు వచ్చాడు. అద్భుతమైన రీతిలో ' అభంగ్' పాడాడు.

ఆపై 'మై తేరీ తోతా తూ మేరీ మైనా' అనే హిందీ సినిమా పాట పాడాడు.

బోర్నవిటా తాగిన తరువాత నిద్రకని ఎవరి టెంట్లకు వారు వెళ్తూంటే, చంద్ర, రాజు, కిరణ్ ఎలాగైనా మళ్లీ క్యాంప్‌ఫైర్‌లో ఏదైనా తెలుగు ఐటమ్ ప్రదర్శించాలని చర్చించుకున్నారు.

అందరూ పడుకున్న తరువాత కిరణ్‌కు ఒక ఆలోచన బలంగా తాకింది.

తనకు వీణ గుర్తుకు వచ్చి రెండు గంటలయింది. క్యాంప్ ఫైర్‌లో కూర్చున్నంతసేపు తన సంస్కృతి గురించి, చరిత్ర గురించి తనకేమీ తెలియదన్న భావన పట్టి పీడించింది. దాని గురించిన ఆలోచనలు చుట్టుముట్టాయి.

## ఆనందమే జీవిత మకరందం

మీరు ఆనందంగా ఉంటారా! నవ్వు, నవ్వించు మీ ఫిలాసఫీయా? ఎప్పుడూ నవ్వుతూ కులాసాగా గడుపుతుంటారా? అయితే ఆ నవ్వే మీ జీవిత మకరందం అని ఘంటాపథంగా చెప్పొచ్చు. నవ్వడం, ఆనందంగా ఉండడం అద్భుతాలు సృష్టిస్తాయనే నిన్నటి ఫిలాసఫీని ఆధునిక వైద్యపరిశోధనలు కూడ రుజువు చేస్తున్నాయి. నవ్వేవారికంటే, నవ్వుకు దూరంగా ఆందోళనతో, నిరాశానిస్పృహలతో ఉండే మధ్య వయుస్కులలో గుండెపోటు వచ్చే అవకాశాలు మూడురెట్లు ఎక్కువట. గుండెపోటు ఎంత తీవ్రతతో వచ్చిందనేదానికంటే దాని నుంచి కోలుకోవడంపై కూడా ఆనందంగా ఉండడమనేది ప్రభావం చూపుతుందట. నవ్వడానికి ఇష్టపడుతూ, చురుకుగా ఉంటూ కుటుంబ సభ్యులతో ఉల్లాసంగా గడిపేవారు గుండెపోటు వల్ల కలిగే శారీరక మానసిక మార్పులనుంచి అతి త్వరగా బయట పడతారని పరిశోధనలు సూచిస్తున్నాయి. అసలు ఆనందంగా ఆశావహ దృక్పథంతో ఉండేవారికి గుండె జబ్బులువచ్చే అవకాశాలు సగానికి సగం తక్కువని ఒక అధ్యయనంలో వెల్లడయింది. వైవాహిక జీవితంలో ఆనందంగా ఉండేవారిలో కూడ ఆరోగ్యం మహాభాగ్యంగా విలసిల్లుతుందట. ఆనందానికి, ఆరోగ్యానికి ఇదీ సంబంధం అనేదాన్ని పరిశోధనలు నిగ్గుతేల్చకపోయినా ఆశావహ దృక్పథంతో ఉండేవారు తమపట్లతాము అన్ని విషయాల్లోనూ ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటారని, బహుశా ఇదే అసలు చిదంబర రహస్యం కావచ్చని పరిశోధకులు భావిస్తున్నారు.



ఇప్పుడు మళ్లీ ఒంటరిగా ఉన్నప్పుడు వీణ ఆలోచనలు వస్తున్నాయి. అంతలో ఒక ఆలోచన వచ్చింది. వీణ ఎప్పుడూ చదివే కొన్ని కవిత్వ పుస్తకాలు వెంట తెచ్చుకున్నాడు తాను. ఆ పుస్తకాల్లోని ఏదైనా మంచి కవితను ఎంచుకుంటే?

వీణ, తాను బోలెడన్ని హిందీ సినిమా పాటల గురించి చర్చించుకున్నారు. ఆ పాటలలో ఏమైనా పాడితే?

కానీ వీణ ముందు తప్ప మరెవ్వరి ముందూ తన గొంతు పెగలదు. ఇంతమంది ముందు నిలచి పాడటమా?

ఆలోచనల్లో ఎప్పుడో నిద్ర పట్టింది.

### 6

'బెడ్‌టీ' గిన్నె టకటకలాడించటంతో మెలకువ వచ్చింది కిరణ్‌కు.

ఈ మధ్యకాలంలో ఇంత గాఢంగా నిద్ర పట్టటం ఇదే తొలిసారి. రాత్రవుతోందంటేనే నిద్ర పట్టదని భయంగా ఉండేది. అలాగే నిద్ర పట్టేది కాదు. నిన్న అసలు ఆ ఆలోచనే రాలేదు.

'పళ్లు తోమకుండా టీ తాగటం ఏమిటి? ' అసహ్యంగా ముఖం పెట్టాడు చంద్ర.

'బాబూ ఇది ట్రెక్కింగ్. ఇక్కడ కాబట్టి ఇలా అన్నావు కానీ ఇదే హిమాలయాల ట్రెక్కింగ్‌లో అయితే బెడ్‌టీని అమృతంలా సేవిస్తారు. మైనస్ వేడితో గడగడ వణుకుతున్న శరీరంలోకి ఒక్క గుక్క వేడివేడి టీ దిగుతూంటే, స్వర్గం ఎక్కడో లేదు, టీ కప్పులోనే ఉందనిపిస్తుంది' చెప్పాడు మురుమ్కర్.

అందరూ నవ్వారు.

'మీరు హిమాలయన్ ట్రెక్కింగ్ చేశారా?' అడిగాడు కిరణ్ కుతూహలంగా.

'బోలెడన్ని సార్లు' ఉత్సాహంగా చెప్పాడు మురుమ్కర్. నేను గత ముప్ఫయి ఏళ్లుగా ట్రెక్కింగ్ చేస్తూనే ఉన్నాను. ఇప్పుడు మనం చేస్తున్న ట్రెక్ ఫైవ్‌స్టార్ ట్రెక్ అనవచ్చు. కొన్ని చోట్ల అయితే టెంటును గట్టిగా పట్టుకుని పడుకోవాల్సి వస్తుంది. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా టెంట్లు ఎగిరిపోతాయి. అంత గాలి వీస్తుంది. ఒకచోట అయితే రాత్రి గలగల ప్రవహించే సరస్సులన్నీ తెల్లారేసరికి గడ్డకట్టిపోయాయి. అంత చలి ఉంటుంది. ఇంకా హిమాలయాల్లో అంత ఎత్తున మనకి ఇన్ని సౌకర్యాలుండవు. రాత్రి పడుకునేటప్పుడు ఎముకలు కొరికే చలి ఉంటుంది. పొద్దున్న లేచేసరికి ఒళ్లు గడ్డకట్టే చలి ఉంటుంది. అక్కడ పళ్లు తోమేందుకు నీళ్లలో చేయి పెడితే కత్తితో కోసినంత నొప్పి కలుగుతుంది. నీళ్లు నోట్లో పోసుకుంటే పళ్లూడిపోయినంత బాధ కలుగుతుంది'

మురుమ్కర్ మాటలు అందరూ ఎంతో ఉత్సాహంగా, ఆసక్తిగా విన్నారు.

కానీ సందీప్ విసుక్కుంటూ లేచాడు. 'నోర్మూసుకుని చాయ్ తాగవచ్చు కదా!'

'ఈ ముచ్చట్లతో మమ్మల్నీ నిద్ర లేపటమెందుకు?' అని మళ్లీ మరోవైపు తిరిగి పడుకున్నాడు.

'ఆరున్నర కల్లా వ్యాయామం చేయాలి. త్వరగా తయారవుదాం' అంటూ లేచాడు మురుమ్కర్.

అప్పుడు గమనించాడు కిరణ్, సందీప్ పక్కన మరో వ్యక్తి ఉన్నాడు. అతడిని ఇంతవరకూ చూడలేదు. రాత్రికూడా ఎప్పుడు వచ్చి పడుకున్నాడో తెలియదు.

★ ★ ★

'ఆరున్నర అవుతోంది. త్వరగా తయారవండి' మైకులో పిలుపు వినిపించింది.

'అబే టక్లూ త్వరగా షూస్ వేసుకో' సెలీన్, చేతన్‌ను తొందర చేస్తున్నాడు.

'టక్లూ చేతన్, పేరు బాగుంది' అన్నాడు చంద్ర షూ వేసుకుంటూ.

'గుండు మొన్న కొట్టించుకున్నాను. ఎప్పటికీ ఉండదీ గుండు' అన్నాడు చేతన్ గుండు తడుముకుంటూ.

'ఆ' అని ఆవలిస్తూ లేచాడు సందీప్.

'ఆరున్నర అవుతోంది త్వరగా తయారవు' సందీప్‌తో అన్నాడు సెలీన్.

'నాకు తొందర లేదు. మా బాస్ ఇంకా నిద్ర లేవనే లేదు' అన్నాడు తన పక్కన పడుకున్న యువకుడివైపు చూపిస్తూ

'త్వరగా లేపు' అన్నాడు సెలీన్.

'ఏయ్ తివారీ... తివారీ' అంటూ అతడిని తట్టి లేపాడు సందీప్.

'హూం' అని హూంకరిస్తూ లేచాడు తివారి. అతడూ యువకుడే. ఎర్రటి ముఖం. జుట్టుకు కూడా రంగేసుకున్నట్టున్నాడేమో ఎర్రగా ఉంది. బొద్దుగా ఉన్నాడు.

'అరే యార్... అప్పుడే నిద్ర లేపేస్తావేం? ఇంకా ఏడు కూడా కాలేదు' అన్నాడు.

'ఆరున్నరకు వ్యాయామం' చెప్పాడు సందీప్.

'మారో గోలీ...' అంటూ మళ్లీ నిద్రలోకి జారుకున్నాడు తివారి.

వ్యాయామానికి పిలుస్తూ విజిల్ వినబడ

# ప్రకృతే తోడుగా...



జలపాతాల్ని దాటుకుంటూ...

ఎవరు పట్టించుకున్నా, పట్టించుకోకున్నా తన కర్తవ్యం నిర్వహిస్తూ పోతుంది. తనని చూసి నేర్చుకునే వారికి ఎన్నో జీవిత సత్యాలను నేర్పుతుంది. మాట్లాడుతుంది. పాటలు పాడుతుంది. తనని పట్టించుకోకుండా ఎవరి గోలలో వాళ్ళు చర్చిస్తూ, పోతూంటే చూసి వదిలేస్తుంది. ఎందుకంటే, నష్టం వారిదే, ప్రకృతిది కాదు. హిమాలయల్లో సర్‌పాస్, హరకిడూన్, ముస్సోరి వంటి ప్రాంతాలలో వేసవి కాలంలో ట్రెక్కింగ్ కార్యక్రమాలుంటాయి. వర్షాకాలంలో సహ్యాద్రి పర్వతాలలో ట్రెక్కింగ్ ఉంటుంది. ఎటు చూసినా పచ్చదనం కనుల విందు చేస్తూంటే, చినుకు చినుకుకూ జీవం పోసుకుంటూ ప్రకృతి అనూహ్యమైన అందాలతో ఆనందపరుస్తుంది. చలికాలం జైసల్మేర్ వద్ద ఎడారిలో ట్రెక్కింగ్ కార్యక్రమం ఉంటుంది. డల్హౌసీ వద్ద హిమాలయాల ట్రెక్కింగ్ కూడా చలికాలంలో నిర్వహిస్తారు. మన ఆంధ్రప్రదేశ్‌లో 'అరకులోయ'లో ట్రెక్కింగ్ కార్యక్రమం డిసెంబర్ నెలలో జరుగుతుంది. ట్రెక్కింగ్ కఠినమైన నడక కాదు. ఒక అహ్లాదకరమైన క్రీడ. మనసుకు రెక్కలనిచ్చి ఆనందపుటాకాసంలో విహరింపచేసే క్రీడ ఇది.



వాలుకొండను జయిస్తూ...

'ట్రెక్కింగ్' అనగానే 'అమ్మో మేం నడవలేం' అంటారంతా. కానీ ట్రెక్కింగ్ మనం ఊహించినంత కష్టంగా ఉండదు. మొదటి రెండు అడుగులు కఠినంగా అనిపించినా, ఆపై చుట్టూ పరవశింపచేసే ప్రకృతి, అన్ని బాధలనూ మరపింపచేస్తుంది. స్వచ్ఛమైన సరస్సులు, జల జల పారే నదులు, కొండపైనుండి పాలధారల్లా దూకే జలపాతాలు, పచ్చని చెట్లు, ఎత్తయిన పర్వతాలు, కిలకిల లాడే పక్షులు, జరజర పాకే క్రిమి కీటకాలు... ఒకటేమిటి అణువణువులో అత్యద్భుతమైన అందాన్ని ఇముడ్చుకున్న ప్రకృతి, తన వైపు దృష్టి నిల్పిన ప్రతి వారికీ అనంతమైన ఆనందాన్ని ఇచ్చేందుకు సిద్ధంగా ఉంటుంది.

టంతో అందరూ మైదానం వైపుకి వెళ్లారు.

అప్పటికే అమ్మాయిలు అక్కడకు వచ్చి నిలబడి ఉన్నారు. వారిని చూస్తూనే చంద్ర, రాజు ఆ వైపు వెళ్లారు.

కిరణ్ ఒంటరిగా నిలబడ్డాడు.

'నీ మిత్రులు అమ్మాయిల వైపు పరుగెత్తారా? ' అడిగాడు మురుమ్కర్.

నవ్వాడు కిరణ్.

'నేను ఇన్ని ట్రెక్కింగ్‌లు చూశాను. ప్రతి ట్రెక్కింగ్‌లో తొంభై శాతం మంది ఎందుకు వస్తున్నామో తెలియకుండా వస్తారు. యువతీ యువకులయితే అరుపులు, ఆటలు, కేకలు అవే ఎంజాయ్‌మెంట్ అనుకుంటారు. ఈ ట్రెక్కింగ్ సమయంలోనే ప్రేమలు కుదురుతాయి, విడిపోతాయి కూడా'



'ట్రెక్కింగ్‌లో తొంభై శాతం మంది ఎందుకు వస్తున్నామో తెలియకుండా వస్తారు. యువతీ యువకులయితే అరుపులు, ఆటలు, కేకలే ఎంజాయ్‌మెంట్ అనుకుంటారు. ఈ ట్రెక్కింగ్ సమయంలోనే ప్రేమలు కుదురుతాయి, విడిపోతాయి కూడా'



ఇంతకీ ట్రెక్కింగ్‌కు ఎందుకు రావాలంటారు? ' అడిగాడు కిరణ్ మురుమ్కర్ నోరిప్పేలోగా మళ్లీ విజిల్ మోగింది 'అందరూ లైన్లో నిలబడండి' అరిచాడు ఇన్‌స్ట్రక్టర్ సుజిత్‌పాఠక్.

'కౌంట్' అరిచాడు.

ఒకటి రెండు.... ఒకరొకరు సంఖ్య పెంచుతూ చెప్తున్నారు. యాభై రెండు దగ్గర ఆగిపోయింది.

'మీ బ్యాచ్‌లో యాభై ముగ్గురు రిపోర్ట్ చేశారు. ఇంకా తయారుకాని వాడెవడు? ' అరిచాడు సుజిత్.

'మోరి' కిరణ్ నోటి వరకూ వచ్చింది పేరు. దాన్ని అణిచేసి మౌనంగా ఉన్నాడు. అందరినీ అక్కడే నుంచోబెట్టి ప్రతి టెంటూ వెతకసాగాడు సుజిత్. ఏడోనెంబర్ టెంటులో గుర్రు పెట్టి నిద్రపోతూ కనిపించాడు తివారి 'మోరీ లే' అరిచాడాయన.

'జాబే సోనేదో' అని మళ్లీ పడుకున్నాడు తివారి

ఆయన స్వయంగా లోపలకు వెళ్లి తివారీని నిద్ర లేపాడు

తివారీ కళ్లు తెరచి ఆయన వైపు చూసి 'క్యోం సతాతే హో... సోనే దోనా? ' అనడిగాడు.

అది వింటున్నవాళ్లు నవ్వు ఆపుకోలేకపోయారు.

'బాబూ ఇది నీ ఇల్లు కాదు. ట్రెక్కింగ్‌కు వచ్చావు నువ్వు. లే త్వరగా' అన్నాడు సుజిత్ 'అందుకే పడుకున్నా ఇంట్లో అయితే ఆరు దాటితే మా నాన్న చంపేస్తాడు' అన్నాడు తివారి లేవకుండానే.

'లేలే..' ఊపి లేపాడు సుజిత్.

విసుక్కుంటూ లేచాడు తివారి.

'అయిదు నిమిషాల టైమ్ ఇస్తున్నాను. త్వరగా ముఖం కడుక్కుని వచ్చెయ్యి. నువ్వొచ్చే వరకూ అందరూ ఇలాగే నిలబడి ఉంటారు. నీ ఒక్కడి వల్ల మొత్తం జట్టుకి శిక్ష పడుతుంది చెప్పాడు సుజిత్ కోపంగా

'హాయ్ ఎవ్రీబడీ అని చేయి ఊపుతూ నెమ్మదిగా స్విమ్మింగ్ పూల్ వైపు వెళ్లాడు తివారి.

అందరూ నవ్వారు.

'ఈ తివారీ అందరినీ ఏడ్పిస్తాడు' నవ్వుతూ గొప్పగా చెప్పాడు సందీప్, కిరణ్‌తో. అందరూ తివారి కోసం ఎదురుచూస్తూ నిలబడ్డారు.

అనుకోకుండా దొరికిన ఈ అవకాశాన్ని రాజు, చంద్రలు స్వప్న, కశ్మీరాలతో మాట్లాడేస్తూ పూర్తిగా వినియోగించుకోసాగారు. కొందరు అమ్మాయిలు కాశ్మీర్‌వాళ్ల చుట్టూ మూగారు.

బొంబాయి వాళ్లొక గుంపు, గుజరాతీ వాళ్లొక గుంపు, బెంగాలీ వాళ్లొక గుంపుగా మాట్లాడుకోసాగారు. చేతన్, సెలిన్‌లు ప్రాజక్త, ప్రీతిలతో మాట్లాడుతున్నారు. కిరణ్, మురుమ్కర్‌లు ఇద్దరూ మిగిలారు.

'మనం ట్రెక్కింగ్‌లో రకరకాల మనుషులను కలుస్తాం. ఇక్కడకు వచ్చిన తరువాత మనమెవరో మరచిపోవాలి. మన ప్రాంతం, మతం, భాష అన్నీ వదలి అందరం కలసిపోవాలి. కానీ మనలో ఉన్న స్వభాషాభిమానం, స్వప్రాంతాభిమానం మనల్ని జట్లు జట్లుగా చేస్తుంది. మనం ఎంతగా విశాలభావాలు ప్రదర్శిస్తున్నా అది మనల్ని సంకుచితంగా చేస్తుంది' అన్నాడు మురుమ్కర్.

అతని మాటలు నిజమేననిపించాయి కిరణ్‌కు. రాత్రి క్యాంప్ ఫైర్‌లో ఎవరికివారు వారి భాషల, ప్రాంతాల పాటలు పాడుకుంటే, తాను తెలుగులోనే పాట పాడలేనందుకు విచారించాడు. కానీ తామంతా కలసి భారతదేశం ఒకటేనన్న పాట ఒక్కటీ పాడలేదని ఆలోచించ లేదు.

ఇదేనా మురుమ్కర్ అనే మానవ స్వభావంలో అంతర్గతంగా నిక్షిప్తమై ఉన్న సంకుచితత్వం? పది నిమిషాలయింది అందరికీ విసుగు వస్తోంది. తివారీ లెట్రిన్‌లో నిద్రపోతున్నట్టున్నాడు. సందీప్‌ని తరిమాడు సుజిత్.

కిరణ్ దృష్టి దూరంగా ఉన్న ట్రెక్ రూట్ పటంపై పడింది.

'అది చూసివస్తా' మురుమ్కర్‌తో చెప్పాడు కిరణ్.

'నేనూ వస్తా పద' అంటూ వెంట వచ్చాడు మురుమ్కర్.

గోవా రాష్ట్ర పటంపై తాము ట్రెక్ చేయవలసిన రూట్, ఎక్కడెక్కడ రాత్రిళ్లు విశ్రాంతి తీసుకుంటారో ఆ క్యాంపుల వివరాలు రాసి ఉన్నాయి.

'నడకకన్నా బస్సుల్లో, రైళ్లల్లో ప్రయాణమే ఎక్కువ ఉంది' పెదవి విరుస్తూ అన్నాడు మురుమ్కర్.

'మా వాళ్లు నడక అంటే భయపడుతున్నారు' నవ్వుతూ అన్నాడు కిరణ్

'ఏమీ భయం లేదు. ఈ ట్రెక్కింగ్ రూట్‌ను ఎంతో ఆలోచించి తయారు చేస్తారు. ఒక మామూలు వ్యక్తి, ఎటువంటి నడక అలవాటు లేకుండా కూడా సులభంగా ఒక క్యాంపు నుంచి మరో క్యాంపుకు చేరేట్టుగా దారిని ఏర్పరుస్తారు. హాయిగా నడవవచ్చు. ఎత్తులెక్కాల్సి వచ్చినపుడు తక్కువ దూరానికి ఎక్కువ కాలం కేటాయిస్తారు. పల్లంలో నడవాల్సి వచ్చినపుడు ఎక్కువ దూరానికి తక్కువ కాలం నిర్ణయిస్తారు-



**క్యాంప్ ఫైర్‌లో ఎవరికివారు వారి భాషల, ప్రాంతాల పాటలు పాడుకుంటే, తాను తెలుగులోనే పాట పాడలేనందుకు విచారించాడు. కానీ తామంతా కలసి భారతదేశం ఒకటేనన్న పాట ఒక్కటీ పాడలేదని ఆలోచించ లేదు.**



చెప్పాడు మురుమ్కర్.

'అదిగో తివారి' ఎవరో అరిచాడు.

నెమ్మదిగా వీరుడిలా నడుస్తూ వస్తున్నాడు తివారి.

'ఒక్క నిమిషం' అంటూ మళ్లీ టెంట్‌లో దూరాడు. డ్రస్ మార్చుకుని వచ్చాడు. అప్పటికే సుజిత్ కోపంతో ఊగిపోతున్నాడు.

'మన కార్యక్రమంలో ప్రతీదీ టైమ్ ప్రకారం నడుస్తుంది. ఆరున్నరకి తయారుగా ఉండాలంటే, ఆరున్నరకే అందరూ తయారుగా ఉండాల్సిందే. ఇవ్వాళ తివారివల్ల మీకు వ్యాయామానికి ఆలస్యం అయింది. ఒక్క తివారీని వదలి అందరూ వ్యాయామానికి వెళ్లండి. ఏడున్నరకల్లా రావాలి. మీతో 'అనిత' వస్తుంది. ఈమె మీతో వ్యాయామం చేయిస్తుంది వెళ్లండి. రాగానే బ్రేక్‌ఫాస్టుంటుంది. ఆపై ఇవ్వాళ ట్రెకింగ్‌కు వెళ్తున్న బ్యాచ్‌కి వీడ్కోలివ్వాలి మనం. తరువాత కార్యక్రమం తరువాత చెప్తాను. మీరు వెళ్లండి అని తివారీ వైపు తిరిగాడు.

'తివారీ, నువ్వు మైదానంలో మొత్తం ఏడు రౌండ్లు పరుగెత్తు. ఆ తరువాత మైదానం మొత్తం శుభ్రం చెయ్యి. టెంట్లు కూడా శుభ్రం చేసే బాధ్యత నీదే. ఆ తరువాత నీ పనిని నేను పరిశీలిస్తాను. ఎక్కడైనా ఒక కాగితం ముక్క, చెత్త దొరికిందంటే మళ్లీ పదిరౌండ్లు కొట్టాల్సిఉంటుంది' కఠినంగా అన్నాడు సుజిత్.

తివారీ నిర్లక్ష్యంగా తల ఎగరేశాడు.

'నేనేం తప్పు చేశాను? అనడిగాడు నిర్లక్ష్యంగా వాదనకు దిగుతూ.

★ ★ ★

'మనం అన్ని పనులకు ప్రాధాన్యం ఇస్తాం కానీ శారీరక వ్యాయామాన్ని చిన్నచూపు చూస్తాం. వ్యాయామానికి మాత్రం మనకి టైం ఉండదు' బ్రేక్‌ఫాస్ట్ చేస్తూ అన్నాడు మురుమ్కర్ కిరణ్‌తో.

కిరణ్ అతడితో ఏకీభవించాడు.

చిన్నప్పటి నుంచీ ఆటలన్నా, వ్యాయామ



మన్నా చిన్నచూపు. చదువులు, మార్కులకు పెద్దపీట. ఎదిగిన తరువాత చదివిన చదువులు వ్యర్థమని తేలుతుంది.

తాము వదిలేసిన వాటి ప్రాముఖ్యం అర్థమౌతుంది.

వ్యాయామం సమయంలో, ఆ తరువాత రాజు, చంద్ర కిరణ్ వైపుకు కూడా రాలేదు.



'అప్పుడే జంటలు, జట్లు ఏర్పడ్డాయి' అన్నాడు మురుమ్కర్ చుట్టూ కలయజూస్తూ, కిరణ్ కలయచూసి నవ్వాడు.

'ఇవాళ మనల్ని డోనాపోలా తీసుకువెళ్తారు. అక్కడ మోటారు బోటులో తిప్పి తీసుకువస్తారు' చెప్పాడు మురుమ్కర్.

బ్రేక్‌ఫాస్టవుతూనే మళ్ళీ విజిల్ వేశారు. 'గ్రూప్ సెవెన్ పది నిమిషాల్లో అందరూ తయారు కావాలి. మనం డోనాపోలా పోతున్నాం' చెప్పాడు సుజిత్.

**7**

**అం**దరూ నడక ఆరంభించారు. 'మిరామర్' బీచ్ చేరారు. 'ఇక్కడ అలలుండవు. కానీ బీచ్ వెంబడి జాగ్రత్తగా నడవాలి. ఎవ్వరూ నీళ్లలోకి వెళ్లొద్దు' ఆజ్ఞాపించాడు సుజిత్.

అప్పటికే జంటలు, జంటలుగా అందరూ నడుస్తున్నారు.

కిరణ్, మురుమ్కర్‌లు బీచ్ వెంబడి నీళ్లను చూస్తూ నడుస్తున్నారు. కాళ్లక్రింద ఇసుక మెత్తగా ఉంది.

నడుస్తున్న మురుమ్కర్ హఠాత్తుగా ఒంగి ఇసుకను గుప్పిట్లోకి తీసుకున్నాడు.

'చూడు... మనం ఎంత గుడ్డిగా బతికేస్తున్నామో ఇక్కడే తెలుస్తుంది. ఒక వైపు అనంతమైన సముద్రం. దానిపైన అనంతమైన ఆకాశం. సముద్రంలో అద్భుతమైన అందం ఉంది. ఆకాశంలో అంతులేని సౌందర్యం ఉంది. ఎవరైనా ఇది గమనిస్తున్నారా?'

చేతన్, సెలిన్‌లు ప్రాజక్త, ఆరోహి

లతో మాట్లాడుతూ నడుస్తున్నారు. కాశ్మీరీలు, అమ్మాయిలు ఆడుతూ, పాడుతున్నారు. బొంబాయి వాళ్ల అల్లరికి అంతు లేదు. జార్ఖండ్ వాళ్లు ఏదో వాదించుకుంటున్నారు.

'పోనీ ఇది వదిలెయ్యి. మన కాళ్ల క్రింద మనం ఎన్ని రహస్యాలను, ఎన్నెన్ని అద్భుతమైన సత్యాలను తొక్కుతూ నడుస్తున్నామో ఎవరైనా ఆలోచిస్తున్నారా? '

అర్థం కానట్టు చూశాడు కిరణ్, అతని వైపు.

'ఇంత ఇసుక ఇక్కడికి ఎలా వచ్చింది? ' అడిగాడు మురుమ్కర్.

'సముద్రం తెచ్చింది' సమాధానం ఇచ్చాడు కిరణ్.

'సముద్రం ఎక్కడినుంచి తెచ్చింది? '

ఆలోచించాడు కిరణ్.

మురుమ్కర్ సమాధానం తనే చెప్పాడు. 'సముద్రంలోకి నదులు వచ్చి కలుస్తాయి. నదులు తాము ప్రవహించే ప్రాంతాలలో మట్టిని కోస్తాయి. కొండలను తొలుస్తాయి. వాటన్నింటినీ తమతో తెచ్చి సముద్రంలో కలుపుతాయి. సముద్రంలో కలసిన ఆ నిక్షిప్తాలు దొర్లుతాయి. పొర్లుతాయి. చెలరేగే అలలతో ఆడుకుంటాయి. ఒకదానితో ఒకటి రాసుకుంటాయి. చివరికి ఇలా అలల ఉపరితలంపై నృత్యమాడుతూ వచ్చి బీచ్‌లో ఆగుతాయి. ఈ ఇసుక ఎంత సన్నగా ఉంటే, అంత దూరం నుంచి వచ్చినట్టు. అంత ఎక్కువ కాలం ఒరిపిడికి గురయినట్టు. సముద్రంలో కలిసే నదులు ప్రవహించే ప్రాంతాలను బట్టి ఇసుక గుణం ఆధారపడి ఉంటుంది. ఈ ఇసుకను పరిశీలిస్తే ఆయా ప్రాంతాలలో ఉండే రాళ్ల గుణాలు, అవి ఏ కాలంలో ఏర్పడ్డాయి, ఎంత ప్రాచీనమైనవి, వాటిలో ఖనిజాలు అన్ని తెలుసుకోవచ్చు. అంటే భగవంతుడు ప్రపంచం అణువణువునా ఎన్నో రహస్యాలను, ఎంతో విజ్ఞానాన్ని నిక్షిప్తం చేశాడు. తెలుసుకోవాలన్న జిజ్ఞాస ఉండాలి, కళ్లు తెరచి చూస్తే ప్రపంచమంతా విజ్ఞానమయం. లేకపోతే ఇదంతా గుడ్డివాడికి దివిటీ చూపినట్టే'.

మురుమ్కర్ మాటల అర్థాన్ని గురించి ఆలోచిస్తూ నడుస్తున్నాడు కిరణ్.

ఒకచోట కాశ్మీరీ యువకులు, యువతులు ఆగి ఉన్నారు. ఓ చేప చచ్చిపోయి ఒడ్డుకు కొట్టుకువచ్చింది. కాశ్మీరీ యువకుడు 'అన్వర్' దాన్ని నోటి దగ్గర పెట్టుకుని ఫోటో దిగుతున్నాడు 'దిల్ చాహ్తాహై' సినిమాలో హీరోల్లాగా.

అది చూసి నవ్వాడు మురుమ్కర్.

'చూశావా, సినిమాల ప్రభావం మనపై ఎంతగా ఉందో. మన జీవితంలో ప్రతిక్షణాన్ని ప్రతి ఆలోచననూ సినిమాలే నిర్దేశిస్తున్నాయి' అన్నాడు.

కిరణ్ మౌనంగా నడవసాగాడు.

అలా నడుస్తూ డోనాపోలా చేరారు. దారిలో వీధులు శుభ్రంగా ఉన్నాయి.

'ఇక్కడ ప్రజలు తమ రాష్ట్రమన్నా, తమ సంస్కృతి అన్నా గర్వపడుతారు. వీళ్లకి రోడ్లు శుభ్రంగా ఉంచమని ఒకరు చెప్పనవసరం లేదు. స్వచ్ఛందంగా వారు నియమాలకు లొంగుతారు' చెప్పాడు మురుమ్కర్.

డోనాపోలా ఎత్తున ఉన్న ప్రదేశం. క్రింద సముద్రం అలలు. ఆ పర్వతాన్ని వేగంగా తాకుతూంటాయి.

'ఇక్కడే ఏక్ దూజేకే లియె షూటింగ్ జరిగింది' అక్కడ ఉన్నవారు చెప్పుకుంటున్నారు.

నవ్వాడు మురుమ్కర్. 'డోనా అనే అమ్మాయి పోర్చుగీసు గవర్నర్ కూతురు. పోలా అనే అబ్బాయి చేపలు పట్టేవాడు. ఇద్దరూ ప్రేమించుకున్నారు. తన కూతురు పేదవాడైన చేపలు పట్టేవాడిని పెళ్లి చేసుకోవటాన్ని వాళ్ల నాన్న వ్యతిరేకించాడు. పోలా లేని తన జీవితం వ్యర్థమని భావించి

## దివ్యౌషధం

అబ్బబ్బ, ఈ తలనొప్పితో చచ్చిపోతున్నాం... ఈ కాస్త జ్వరానికి డాక్టర్ దగ్గరకు వెళ్ళడం దేనికి? ఏదో సొంత వైద్యం చేసుకుంటే పోలా... ప్రతి ఒక్కరూ ఇలా అనుకోవడం పరిపాటి. ఆ సొంత వైద్యం కోసం మెడికల్ షాపుకు పరుగెత్తి ఏ ఆస్ప్రిన్ టాబ్లెట్టో, సారిడాన్ టాబ్లెట్టో తెచ్చుకుని వేసేసుకోవడం అందరూ చేసేదే. డాక్టర్లకు డబ్బు ధారపోయకుండా నొప్పులు తగ్గడానికి మనమంతా ఆశ్రయించే ఆస్ప్రిన్ అనేది దివ్యౌషధమని మీకు తెలుసా? మీ జీవితకాలాన్ని పెంచే గుణం కలిగి ఉండడంతో ప్రస్తుతం ఈ టాబ్లెట్‌కు స్టార్ స్టేటస్ వచ్చేసింది. దానికి కారణం ప్రాణాంతక వ్యాధుల నుంచి ఇది మనల్ని కాపాడగలిగే శక్తి కలిగి ఉండడమే. గుండెజబ్బులు, క్యాన్సర్ వంటి వ్యాధుల నుంచి ఇది మనను దూరంగా ఉంచుతుందంటే ఆశ్చర్యం కలిగినా అది ముమ్మాటికీ నిజం. ప్లేట్‌లెట్లు అనబడే సూక్ష్మ రక్తకణాలు కొంతవరకు రక్తం గడ్డ కట్టించే గుణం కలిగి ఉంటాయి. రక్తం గడ్డ కట్టడం వల్ల గుండెనొప్పి, గుండెపోటు సంభవిస్తాయి. ఈ ఆస్ప్రిన్, ప్లేట్‌లెట్లు రక్తాన్ని గడ్డ కట్టించకుండా అడ్డుకుంటుంది. మీకు ఈపాటికే ఒకసారి గుండెపోటు వచ్చి ఉంటే మరోసారి రాకుండా ఆస్ప్రిన్ అడ్డుకుంటుంది. మీరు ఆరోగ్యవంతులయితే భవిష్యత్తులో గుండెపోటు రాకుండా నివారిస్తుంది. గుండెపోటు వచ్చిన వారిలో దాని తీవ్రత తగ్గిస్తుంది. రోజూ ఒక ఆస్ప్రిన్ తీసుకుంటే 60 శాతం మేరకు మీరు గుండెపోటుకు దూరంగా ఉన్నట్లే. ప్రొస్టేట్ గ్రంధికి, ఊపిరితిత్తులకు సోకే కేన్సర్ నుంచి ఇది మిమ్మల్ని దూరంగా ఉంచుతుంది.

ఆస్ప్రిన్ దివ్యౌషధంగా పరిగణితమవుతున్నా దాని లోపాలు దానికీ ఉన్నాయి. అల్సర్లు, గ్యాస్ట్రిటిస్‌తో బాధపడే వారికి మాత్రం ఇది శత్రువేనని చెప్పక తప్పదు. ఉదరకోశ అల్సర్ల నుంచి ఇది రక్తస్రావాన్ని కలిగించవచ్చు. మెదడులో రక్తస్రావం వల్ల కలిగే 'హెమరేజిక్ స్ట్రోక్'ను ఆస్ప్రిన్ పెంచే ప్రమాదమూ ఉంది. అందుకే ఈ మందు వాడుతూ మీరు ప్రయోజనం పొందాలంటే ముందుగా మీ వైద్యుణ్ణి సంప్రదించక తప్పదు సుమా.

డోనా ఇక్కడినుంచి సముద్రంలోకి దూకి ప్రాణత్యాగం చేసింది. పోలా ఆమెని అనుసరించాడు. అందుకే ఈ ప్రాంతం పేరు 'డోనాపోలా' అయింది' చెప్పాడు మురుమ్కర్.

కిరణ్ చుట్టూ చూశాడు. అందరూ ఫోటోలు దిగుతున్నారు.

మురుమ్కర్ చెప్పిన కథ విన్న తరువాత కిరణ్ హృదయం బరువెక్కింది. పోలాకు దూరంగా ఉండలేక డోనా ఆత్మహత్య చేసుకుంది. డోనా లేని బ్రతుకు వ్యర్థమని భావించి పోలా ఆత్మత్యాగం చేశాడు. వాళ్లిద్దరిదీ అమరప్రేమ అయింది. మరి తను?

వీణ లేనిదే తాను బతకలేననుకున్నాడు. కానీ వీణ మరణించినా హాయిగా తాను జీవిస్తూనే ఉన్నాడు. ఆనందిస్తూనే ఉన్నాడు. తనూ ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయి ఉండాల్సిందా? తనకు చచ్చిపోయేంత తీవ్రమైన ప్రేమ వీణ మీద లేదా?

కిరణ్ ఆలోచనలను గమనించలేదు

మురమ్కర్. అతడు చెప్తూనే పోతున్నాడు.

'ఇక్కడ ప్రత్యేకత తెలుసా! డోనాపోలా ఎడమవైపు జువారి నది, కుడివైపు మాండ్వి నది ఉన్నాయి. ఎదురుగా ఉన్నది అరేబియా సముద్రం. అంటే రెండు నదుల సంగమం అన్నమాట ఇది'.

కిరణ్ అతని మాటలు వినటం లేదు. చివరికి ఉండబట్టలేక అడిగాడు.

'మురమ్కర్... నాకో సందేహం; తీరుస్తారా? '

'తీర్చగలిగితే...'

'మనం ఒక వ్యక్తిని ప్రాణప్రదంగా ప్రేమిస్తాం. ఆ వ్యక్తి మరణించి మనకు దూరమైనా జీవిస్తూనే ఉంటాం. అంటే మనకు ఆ వ్యక్తి అంటే ప్రేమ లేనట్టా? '

కిరణ్ ప్రశ్న వింటూనే మురుమ్కర్ ముఖం అదోలా అయిపోయింది. బాధ స్పష్టంగా కనిపించింది.

'తానా ప్రశ్న అడిగి తప్పు చేశానా? ' అనుకున్నాడు కిరణ్.

కిరణ్ చెయ్యి పట్టుకుని కూచున్నాడు మురుమ్కర్.

'ఒక వ్యక్తిని ప్రేమించటమంటే ఆ వ్యక్తి లేకపోతే మరణించటం కాదు. ఆమె లేకున్నా ఆమె జ్ఞాపకాలలో బతకటం. ఆమెని తలచుకుంటూ హాయిగా బతకటం. నాకు నా మొదటి భార్య అంటే ఎంతో ప్రేమ. ఆమె మరణించిన తరువాత పిల్లల కోసం మళ్లీ పెళ్లి చేసుకున్నాను. రెండో భార్యకు ఏ లోపమూ చేయను. కానీ నా మనసంతా నిండి ఉన్నది మొదటి భార్యనే. అనుక్షణం ఆమె జ్ఞాపకాలలోనే బతుకుతున్నాను'. అతని కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

కిరణ్ మౌనంగా ఉండిపోయాడు. కాస్సేపటికి మళ్లీ మురుమ్కర్ అన్నాడు.

'ఒక వ్యక్తి దూరమైతే భరించలేక మరణించటమే అమరప్రేమ అన్నది పొరపాటు అనిపిస్తుంది. ఎందుకంటే, ఎంత కాదన్నా, ఇద్దరు వ్యక్తులు ఎంత దగ్గరవారయినా, ఎవరి ప్రపంచం వారిది. మనం ప్రేమ అనుకున్నది 'అలవాటు'. ఒకరి సాంగత్యంలో మరొకరు సౌఖ్యంగా ఉండగలగటం. కానీ ఎవరి బతుకు వారే ప్రత్యేకంగా బతకాలి. నా మొదటి భార్య మరణం తరువాత నేనూ ఆత్మహత్య చేసుకుని ఉంటే, ఇప్పుడీ అందాలు, ఆనందాలు, సూర్యోదయాలు, సూర్యాస్తమయాలు అన్నిటికీ దూరమయ్యే వాడినా, కానా? మరణం తరువాత రెండు ఆత్మలు, కలుస్తాయో, ఏమౌతాయో మనకు తెలియదు. అవునా! కాబట్టి మనకు తీవ్రమైన దుఃఖం కలిగినపుడు ఒక్కక్షణం ఓపిక పడితే విచక్షణ ఆవేశాన్ని తగ్గిస్తుంది. ఆఫ్టరాల్, ఈ ప్రపంచంలోకి ఒంటిరిగా వచ్చాం. ఒంటరిగానే పోతాం. కాబట్టి ఒంటరిగానే బతకాలి.' నవ్వాడు మురుమ్కర్.

అతనన్న మాటల అర్థం ఆలోచిస్తూ కూచున్నాడు కిరణ్.

'చలో... చలో... బేస్ క్యాంప్ చలో' అంటూ విజిల్ వేసుకుంటూ వచ్చాడు సుజిత్.

## 8

లంచ్ అయింది.

'నాలుగు గంటల వరకూ మీరు బ్యాగు సర్దుకోండి. ఆ తరువాత ఓరియంటేషన్ క్లాసు ఉంటుంది'

'ఓరియంటేషన్ క్లాసంటే ఏమిటి? ' మురుమ్కర్‌ని అడిగాడు కిరణ్.

'అంటే మనం నడిచేటప్పుడు ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలి. దారిలో ఎటువంటి ప్రమాదాలు ఎదుర్కోవాల్సి ఉంటుంది వంటి విషయాలు వివరిస్తారు? ' చెప్పాడు మురుమ్కర్.

టెంట్‌లో అందరూ బ్యాగులు సర్దుకోవటంలో నిమగ్నమయ్యారు. అవసరమైన వారికి 'రక్‌సాక్' ఇస్తారు.

'రక్‌సాక్' అంటే రెండు భుజాల ద్వారా

# చతుర భాషితాలు

పుడమితల్లి దయామయురాలు. నాగలితో నిలువునా చీరినా నవ్వుతూ ధాన్యపు రాశుల్ని ఇస్తుంది. – జెరాల్డ్

వృద్ధులు ప్రతిదాన్నీ నమ్ముతారు. మధ్య వయస్కులు ప్రతిదాన్నీ సందేహిస్తారు. యువకులు ప్రతిదాన్నీ తెలుసుకుంటారు.

– ఆస్కార్ వైల్డ్

జీవితం గడిచే కొద్దీ మన సామర్థ్యానికి ఉన్న పరిమితులేమిటో అవగతమవుతుంటాయి.

– ఫ్రాడే

ఫలానాది చేయగల సామర్థ్యం ఉంది అనే భావనతో మనని మనం బేరీజు వేసుకుంటాం కానీ మనం ఇదివరకే చేసిన దానిని బట్టి ఇతరులు మనని బేరీజు వేస్తారు.

– లాంగ్‌ఫెలో

ఆరాధన ఆయుష్షు ఎప్పుడూ స్వల్పమే. తాము ఆరాదించే వారి(టి) తో సాన్నిహిత్యం పెరిగే కొలదీ అది క్షీణించడం ప్రారంభమవుతుంది.

– థామస్ అడిసన్

నువ్వు అత్యున్నత స్థానాన్ని లక్ష్యంగా నిర్దేశించుకుంటే కనీసం రెండోస్థానం లేదా మూడో స్థానంలోనయినా నిలవగలగడం గౌరవప్రదంగా ఉంటుంది.

– సిసెరో

పూర్వీకులు సాధించిన విజయాలకు గర్వించని ప్రజలు ఎప్పుడూ, తమ ముందు తరాల వారు గర్వించేటంతటి విజయాలను ఎన్నడూ సాధించలేరు.

– మెకాలే

మరణమంటే భయమెందుకు? జీవితంలో అత్యంత అందమైన సాహసం అది – చార్లెస్ ఫ్రోమాన్

వీపు మీద వేసుకుని మోసే మూట. దానికి బోలెడన్ని ప్యాకెట్లుంటాయి. రక్‌సాక్ సర్దు కోవటంలో టెక్నిక్ ఏమిటంటే, సత్వరం అవసరం కాని అంశాలను అడుగున పెట్టాలి. అత్యవసరమైన వాటిని పైన పెట్టాలి. ఇంకొకటేమిటంటే అవసరమైన వస్తువులే రక్‌సాక్‌లో పెట్టుకోవాలి. ఎందు కంటే దాన్ని భుజాన వేసుకుని మోస్తూ నడ వాల్సి ఉంటుంది.

మురుమ్కర్ ఈ విషయాలు టెంట్‌లో అందరికీ వివరించాడు.

'ప్రతి ఒక్కరు ఒకో టూత్‌పేస్టు మోసే బదులు అందరికీ కలిపి ఒకటో రెండో తీసు కెళ్తే చాలు. ఇలా మనం బరువును తగ్గిం చుకోవచ్చు. ఇక ఈ ట్రెక్‌లో మనమంతా ఒకే టెంటులో ఉంటాం. కాబట్టి మనం కలసికట్టుగా నడవాలి. ఒక జట్టులా నడ వాలి'.

'నాకివన్నీ పడవు. నేను నా ఇష్టం వచ్చి నట్టు నడుస్తా' మొండిగా అన్నాడు సందీప్.

ఇంతలో తివారీ హడావిడిగా వచ్చాడు.

'ఎవరి దగ్గరయినా పెన్నుందా?' అడి గాడు.

కిరణ్ తీసి ఇచ్చాడు.

'నేనో అందమైన అమ్మాయిని చూశాను. నా కళ్లనిండా ఆమె నిండిపోయింది. ఆమె మీద కవిత రాస్తున్నాను. ఇవాళ్ల క్యాంప్‌ఫైర్‌లో వినిపిస్తాను' అనుకుంటూ వెళ్లిపో యాడు.

'బ్యాగ్ సర్దుకోవా?' అరిచాడు సందీప్.

'బ్యాగ్‌కో మారోగోలి. కవిత రాయనీ' ప్రతిగా అరిచాడు తివారి.

'అదిగో స్వప్న పిలుస్తోంది' అంటూ తన బ్యాగుని కిరణ్‌కి అప్పజెప్పి పరుగెత్తాడు రాజు. అతని వెంటే పరుగెత్తాడు చంద్ర.

'మీ ఫ్రెండ్లిద్దరూ బాగానే పట్టారు అమ్మా యిలని' నవ్వుతూ అన్నాడు మురుమ్కర్.

'చేతన్' అంటూ టెంటు దగ్గరకు ఆరోహి వచ్చింది. వెంటనే చేతన్ బయటకు దూకాడు. చేతన్ వెనకే సెలిన్ బయటకు వెళ్లాడు.

గొణుక్కుంటూ తన బ్యాగ్‌ను ఓ మూల విసిరేసి సందీప్ కూడా బయటకు వెళ్లాడు.

మురుమ్కర్ కిరణ్ వైపు చూసి నవ్వాడు.

'నీకెవరూ అమ్మాయిలు నచ్చలేదా?' అన డిగాడు.

కిరణ్ చిన్నగా నవ్వాడు. 'ఆ స్థితి దాటి పోయాను అన్నాడు సమాధానంగా.

మురుమ్కర్ వెనక్కు వాలాడు రిలాక్స్ వతూ.

'మగవాడు తన జీవితంలో ఆ స్థాయిని దాటటం అసంభవం' అన్నాడు.

'అదేమిటి?' అడగకుండా ఉండలేకపో యాడు కిరణ్.

నవ్వాడు మురుమ్కర్.

'ఒక వయసు దాటిన తరువాత స్త్రీ పురు షుడి వైపు మామూలుగా చూస్తుంది. ఆమె దృష్టిలో ఇటువంటి కామన ఉండదు. కానీ ఎన్నేళ్లు వచ్చినా పురుషుడు ఆ స్థాయిని చేరుకోలేడు. అమ్మాయి కనబడితే కళ్లప్పగిం చకుండా ఉండలేడు. అందుకనే మనం గమనిస్తాం. భర్త పోతే మళ్లీ వివాహం చేసుకోకుండా స్త్రీ ఉండగలదు. కానీ పురు షుడు ఒంటరిగా ఉండటం చాలా అరుదు. పురుషుడు మానసికంగా బలహీనుడు. అతని ఆత్మవిశ్వాసం స్త్రీ. ఇద్దరూ కలిస్తే సంపూర్ణ మానవుడు తయారవుతాడు'.

'అంటే ప్రేమ ఏకపత్నీ వ్రతం, అన్నీ అబద్ధం అంటారా?'

'ప్రేమ మనసుకు సంబంధించినది. దానికే శారీరక భావనలకు సంబంధం లేదు. దేని దోవ దానిదే. ఇక ఏకపత్నీ వ్రతం... ఒక్క రాముడికే సాధ్యం. నీకూ నాకూ కాదు.' మాట్లాడుతూనే ఆయన నిద్ర లోకి జారుకున్నాడు.

కిరణ్ ఒంటరిగా ఆలోచిస్తూ కూచు న్నాడు. చివరికి బ్యాగులోంచి వీణ కవితల పుస్తకాలు తీశాడు.

తిరగేస్తూ కూచున్నాడు.

హడావుడిగా తివారి లోపలకు వచ్చాడు?

'ఏం పుస్తకం చదువుతున్నావు?' కిరణ్‌ని అడిగాడు.

'కవితల పుస్తకం'

'నీకు కవితలు అర్థమౌతాయా?'

'కొంచెం కొంచెం'

'నేను నా ప్రేయసి మీద కవిత రాశాను వింటావా?'

'నీ ప్రేయసి? ఇక్కడ క్యాంపులోనా, లేక మీ ఇంటి దగ్గర ప్రేయసియా?'

'ఇంటి దగ్గర బోలెడంత మంది ఉన్నారు. నాకు వ్యాపారం ఉంది. రైతుల దగ్గర ధాన్యం కొంటాను. బజార్లో అమ్ముతాను. డబ్బుంది కాబట్టి అమ్మాయిలు సులభంగా దొరుకుతారు. కానీ ఈ క్యాంపులో ఆ అమ్మాయి చూడగానే నా మనసును దోచేసింది. క్యాంపు వదలి వెళ్లేలోగా నేనా అమ్మాయిని పెళ్లి చేసుకుంటాను'.

'ఎవరు నిన్నంతగా ఆకర్షించిన అమ్మాయి?'

'నా కవిత విని చెప్పుకో చూద్దాం'

కిరణ్ ఆలోచించసాగాడు. జార్ఖండ్ నుంచి వచ్చిన సందీప్‌కు న్యూనతాభావం ఉంది. ఎందుకంటే చదువు లేదు కాబట్టి. కానీ తివారీకి అహంభావం ఉంది. ఎందు కంటే బోలెడంత డబ్బుంది కాబట్టి.

ఈ అబ్బాయిని అంతగా ఆకర్షించాలంటే అమ్మాయి ఆధునికంగా ఉండాలి. పట్నవాసపు అమ్మాయిల సౌంద ర్యానికి ప్రతీకలా ఉండాలి.

అలా ఎవరున్నారు?

ప్రీతి!

'ఎవరిని ప్రీతినా నువ్వు ప్రేమించేది?' అడిగాడు కిరణ్.

ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూశాడు తివారి, కిరణ్ వైపు. ఆ తరువాత 'గురూ... నువ్వు మహా గురువ్వు' అంటూ కిరణ్‌ని కౌగలించుకున్నాడు.

'నేను ప్రీతికి నచ్చుతానా?' అడిగాడు జుట్టు సవరించు కుంటూ.

నచ్చడని కిరణ్‌కి తెలుసు.

ప్రీతి పట్నంలో, అదీ ఢిల్లీలో పెరిగిన అమ్మాయి. బాగా చదువుకుంది. రీసెర్చి చేస్తోంది. ఆ అమ్మాయి, గారపళ్లతో, ఎప్పుడూ పాన్ నములుతూ, అజమాయిషీ చేసే తివారీని మెచ్చుతుందా?

ఆ అమ్మాయికి ఢిల్లీలో ఇటువంటి వాళ్లే కాదు, ఇంత



కన్నా రాటుదేలిన వాళ్లు అనేకులు పరిచయమై ఉంటారు. వారిని తరిమివేయటం ఆ అమ్మాయికి అలవాటై ఉంటుంది. కాబట్టి తివారీ ఆశా భంగానికి సిద్ధంగా ఉండాలి. కానీ తివారి ఉత్సాహాన్ని భంగం చేయటం ఇష్టమనిపించ లేదు కిరణ్‌కు.

అందుకే అతని ప్రశ్నకు సమాధానం ఇవ్వకుండా 'నువ్వు ప్రీతితో మాట్లాడావా?' అని అడిగాడు.

'మాట్లాడాను. బాగానే మాట్లాడింది. నేనంటే తనకి కూడా ఇష్టం ఉన్నట్టే ఉంది' అన్నాడు.

నవ్వాడు కిరణ్. తివారీ ఆలోచనలు సిల్లీగా అనిపించాయి. కానీ ఆ వయసులో అందరి ఆలోచనలూ కాస్తంత తేడాతో ఇలాగే ఉంటాయి. తాను మాత్రం ఇందుకు భిన్నం కాదు.




## మరచిపోయిందెవరు?

బతకలేక బడిపంతులు అన్నదానికి ప్రతీకగా ఉండేవారు జాషువా. అసలే జీతం తక్కువ అదీ నెలనెలా అందక అవస్థలు పడేవారు. అలాంటి దశలో స్నేహితుడు ఒకరు ఆయనకు పాతిక రూపాయల మనియార్డరు చేశారు. దాని కూపనులో 'రాత్రి దేవుడు నాకు కలలో కనబడి మీకు ఈ మొత్తం పంపమన్నారు. అందుకే పంపుతున్నాను..' అని చమత్కారంగా రాశారు.

వెంటనే జాషువా 'అయ్యా.. మీ కలలో కనబడిన భగవంతుడు 25 పక్కన సున్నా పెట్టమని చెప్ప లేదా? లేక చెప్పినా మీరు మరచిపోయారా?' అని మరింత చమత్కారంగా ఆయనకు జవాబు రాశారు.

తివారి పెరిగిన సామాజిక వాతావరణాన్ని బట్టి, అతని ఆలోచనలు అమాయకంగా, ప్రవర్తన 'క్రూడ్'గా ఉంది. తాను పెరిగిన వాతావరణాన్ని బట్టి తన ప్రవర్తన మరో రకంగా ఉంది. మౌలికంగా అమ్మాయి కనబడగానే మనసు కోతివేషాలు వేసేయటం, మెదడు కలల్లో తేలిపోవటం అన్న భావన ఒకటే.

'నీకింకో రహస్యం చెప్తా' అని కిరణ్‌కు దగ్గరగా జరిగాడు తివారి.

'మన సందీప్ లేడూ, వాడు కూడా ఈ క్యాంప్ అయ్యేలోగా పెళ్లి చేసేసుకోవాలని నిశ్చయించుకున్నాడు"

కిరణ్ నవ్వకుండా ఉండలేకపోయాడు.

'ఎవరినయినా నిశ్చయించుకున్నాడా?'

'అదే సందిగ్ధంలో ఉన్నాడు. వాడికి అసావేరి నచ్చింది. అరోహి నచ్చింది. సురభి వాడి వెంట పడుతోంది.'

అసావేరి డిగ్రీ చదువుతోంది. అరోహి ఎంబిబియస్ రాసింది. సురభి ఎనిమిదో తరగతి మాత్రమే.

వీరిలో ఎవ్వరు కూడా సందీప్ వైపు కన్నెత్తి కూడా చూడరు. మగవాళ్లు, ముఖ్యంగా యువకులు ఇంత మూర్ఖులా?

'వాడు ముగ్గురి వెంట పడ్డాడు. ఎవరు చిక్కితే వాళ్లని పెళ్లి చేసుకుంటాడు' చెప్పాడు తివారి.

ఇంతలో రాజు ఆవైపు రావటం చూసి, లేచాడు తివారి. 'మళ్లీ తరువాత కవిత విని పిస్తాన'ంటూ వెళ్లిపోయాడు.

'ఏమోయ్ కిరణ్, ఎలా ఉంది మన

ట్రెక్?' అడిగాడు రాజు కూచుంటూ.

'ఇంకా ఆరంభం కానేలేదు కదా?' అన్నాడు కిరణ్.

'నాకైతే చాలా బాగుంది. స్వప్న ఈజ్ వెరీ స్వీట్' అన్నాడు రాజు.

'నువ్వు చంద్రను చేసిన హెచ్చరిక నీకు కూడా వర్తిస్తుంది. నీకూ పెళ్లయింది. పిల్లలున్నారు' అన్నాడు కిరణ్. అతనికి తివారీ, సందీప్‌లకూ రాజు, చంద్రలకూ మధ్య పెద్ద తేడా కనిపించటం లేదు.

రాజు నవ్వాడు.

'నాకు స్వప్నతో ఫ్రెండ్షిప్ జస్ట్ టైమ్‌పాస్. ఈ వారం రోజులు హాయిగా గడచిపోతాయి. ఆ తరువాత స్వప్న ఎవరో, నేనెవరో' కానీ చంద్ర ఈ ఫ్రెండ్షిప్‌ని సీరియస్‌గా తీసుకుంటాడు. అందుకని హెచ్చరించాను' కిరణ్ నవ్వాడు.

మనిషి మనస్తత్వంలోని ఈ అంశం కిరణ్‌ను ఆశ్చర్యపరుస్తుంది.

ఎదుటివాడు ఒక పని చేస్తుంటే విమర్శించి నీతులు చెప్పే మనిషి తాను అదే పని చేస్తూ సమర్థించుకుంటాడు. అంటే, తనలో ఆ లోపం ఉన్నా, ఎదుటివాడి లోపాన్ని ఎత్తి చూపించటం ద్వారా తన లోపం అదృశ్యమైపోతుందనుకుంటాడా మనిషి?

'నేను బ్యాగు సర్దుకోవాలి?' అంటూ వెళ్లిపోయాడు రాజు.

రాజు వెళ్తూనే చంద్ర వచ్చాడు.

'ఏంటీ, బాగు సర్దుకోవటం అయిపోయిందా?'

'అయిపోయింది' చెప్పాడు కిరణ్.

కిరణ్ పక్కనే కూర్చున్నాడు చంద్ర.

'నాకు రాజు ప్రవర్తన ఏమీ నచ్చటం లేదోయ్' అన్నాడు.

'ఏం చేశాడు?' ఏమీ తెలియనట్టు అడిగాడు కిరణ్.

'ఆ స్వప్న మీద ఫెదా అయిపోయాడు. నేను కశ్మీరాతో మాట్లాడితే మండిపడుతున్నాడు. ఆ స్వప్న వీడిని వాడుకుని వదిలేస్తుంది. వాళ్లకిది టైమ్‌పాస్. మనవాడు ఆ నటన నిజమని నమ్మితే దెబ్బతింటాడు'.

కిరణ్ మాట్లాడలేదు.

'సరే. బ్యాగు సర్దుకుంటా. ఓరియంటేషన్ క్లాసుకి టైమ్ అవుతోంది' అంటూ వెళ్లిపోయాడు చంద్ర.

వాళ్లిద్దరు వెళ్లిన వైపు చూస్తూ కూచున్నాడు కిరణ్.

ఒక వంక అంతులేని అనంత పాధోరాశి, మరో వంక మానవుడు నిర్మించిన ఆధునిక సాంకేతిక ప్రగతికి ప్రతీకల వంటి భవంతులు. ఈ రెంటి నడుమ ఈ ఆవేశాలు.. ఆరాటాలు...

ఇదేనా జీవితం?




'హలో... ఫ్రెండ్స్... ముందుగా గోవాలో ట్రెక్కింగ్ చేయాలని నిశ్చయించుకున్న మీ అందరికీ అభినందనలు. గోవా ప్రాకృతికంగా అందమైనదే కాదు ఘనమైన చరిత్ర కల ప్రాంతం. ఈ ఓరియంటేషన్ క్లాసులో మీకు గోవా చరిత్రను టూకీగా పరిచయం చేస్తాను. మీ ట్రెక్కింగ్ దారిలో తీసుకోవాల్సిన జాగ్రత్తలు, గమనించవలసిన అందాలు వివరిస్తాను' అన్నాడు మనోహర్ జోషి అందరినీ కలయచూస్తూ.

అందరూ ఆసక్తిగా వినసాగారు అతడిమాటలు.

'మీరంతా దేశం నలుమూలల నుంచి వచ్చారు. విభిన్న జీవనవిధానాలు, ఆలోచనలు, పరిస్థితుల నుంచి వచ్చిన మీరు కలసి

ఒక్కజట్టుగా ట్రెక్కింగ్ చేయాలి. మన దేశ సంస్కృతిలో ఎలాగయితే భిన్నత్వంలో ఏకత్వం అంతస్సూత్రంగా ఉందో, అలాగే మన ట్రెక్కింగ్‌లో భిన్నత్వంలో ఐకమత్యం ప్రధాన సూత్రం' అని అందరి వైపూ చూశాడు.

'గోవా భారతదేశంలో అన్ని ప్రదేశాలలోకి అత్యంత సుందరమైన ప్రదేశం' అని నవ్వాడు.

'గోవా కన్న కాశ్మీర్ బాగుంటుంది' అరిచాడు నవీద్.

'డార్జిలింగ్ ఎక్స్‌లెంట్‌గా ఉంటుంది' అన్నాడు బెంగాలీ అబ్బాయి.

నవ్వాడు మనోహర్. 'బస్... బస్... బస్... అంటే అర్థం ఏమిటంటే ప్రపంచమంతా సుందరమైనది. ప్రకృతి అందాల మయం. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గదపి గరీయసి' అన్నారు పెద్దలు. అంటే మన జన్మభూమి స్వర్గంతో సమానం. అలాగని ఇతర ప్రాంతాల సౌందర్యాన్ని మనం తక్కువ చేయకూడదు. ప్రపంచమంతా సౌందర్యమయం. అ సౌందర్యాన్ని దర్శించేందుకు మన మనస్సు, తనువు సర్వం పెద్దగా ఉండాలి. మెదడు విశాలంగా ఉండాలి. ఇటువంటి ట్రెక్కింగ్ కార్యక్రమాలు మన మనసుకు సౌందర్య చక్షువులనిస్తాయి. మెదడు చుట్టూ నిర్మితమై ఉన్న గోడలను కూల్చి అన్ని వైపుల నుండి ఉన్నతమైన అందాల అస్వాదనకు సంసిద్ధం చేస్తాయి.

అందరి వైపు చూశాడు. అందరూ ఏకాగ్రతతో వింటున్నారని నిర్ధారించుకుని సంతృప్తిగా నిట్టూర్చాడు.

'గోవాకు పశ్చిమాన అరేబియా సముద్రం, తూర్పున సహ్యాద్రి పర్వతాలు, ఉత్తరాన మహారాష్ట్ర, దక్షిణాన కర్ణాటక సరిహద్దులుగా ఉన్నాయి. సముద్రగర్భంలో ఉన్న గోమంతల్ భూమిని ఒక్క బాణంతో పరశురాముడు, సముద్రాన్ని చీల్చి వెలికి తెచ్చాడని పురుణాల్లో గోవా ఆవిర్భావం గురించి రాసి ఉంది. శివుడు కూడా ఈ ప్రాంతానికి వచ్చి తపస్సు చేశాడని అంటారు. మండోవి, జువారి నదులు గోవాను సారవంతం చేస్తున్నాయి. పోర్చుగీసు, ఫ్రెంచి, బ్రిటీష్, డచ్చివారు గోవాను పాలించారు. బాదామి చాళుక్యులు, కాంబ రాజులు, విజయనగరరాజులు కూడా గోవాను గెలుచుకున్నారు. 1498లో వాస్కో డిగామా గోవాలో అడుగిడాడు. ఈ రకంగా అనేక సంస్కృతిసంప్రదాయాలు కలగలుపు మిశ్రమంగా ఎదిగింది గోవా. అందుకే ఇక్కడ మందిరాలున్నాయి, మసీదులున్నాయి. పురాతన చరిత్రకల చర్చిలున్నాయి.

గోవాలో మద్యంపై నిషేదం లేదు. కానీ, ఎవరైనా రోడ్డు మీద తాగా అసభ్యంగా ప్రవర్తిస్తూంటే ఖచ్చితంగా వాడు గోవాకు చెందిన వాడు కాదు టూరిస్ట్ అని చెప్పవచ్చు. అందరూ నవ్వారు.

అందమైన బీచ్‌లకు గోవా పెట్టింది పేరు. అడుగడుక్కి బీచ్‌లు కనిపిస్తూనే ఉంటాయి. మీకు ట్రెక్కింగ్ దారిలో బోలెడన్ని బీచ్‌లు వస్తాయి. ఒక రోజంతా ప్రపంచంలో అతి పెద్ద బీచ్‌లలో ఒకటయిన 'చెనవలియమ్' బీచ్‌లో నడవాల్సి ఉంటుంది. అని అందరి వైపు చూసి నవ్వాడు.

'మీలో ఈత ఎందమందికి వచ్చు?'

కొందరు చేతులెత్తారు.

'ఈతరాని వారికి ఎలాగో చెప్పాల్సిన అవసరం లేదు. కాబట్టి ఈత వచ్చిన వారికిది హెచ్చరిక. గోవాలో సముద్రాలకు ఇతర ప్రాంతాలలో సముద్రాలకూ తేడా ఉంది. ఇక్కడ బీచ్ హఠాత్తుగా లోతై పోతుంది. ఎక్కడ ఎంత లోతుందో చెప్పటం కష్టం. ఒక అడుగుతో మోకాలిలోతు నీరు మెడలోతు నీరుగా మారవచ్చు పైగా అండర్‌కరెంట్స్ ఎక్కువ. అంటే సముద్రంలోకి

# కంప్యూటర్ విజన్ సిండ్రోమ్



టీవీని ఎక్కువసేపు, అదీ దగ్గరనుంచి చూస్తే కళ్ళు పాడవుతాయి అని ఇప్పటికీ తల్లిదండ్రులు పిల్లల్ని హెచ్చరిస్తారు. అయితే టివి స్థానాన్ని కంప్యూటర్లు ఎప్పుడో ఆక్రమించేశాయి. కంప్యూటర్‌తో ఎక్కువ సేపు గడిపే పిల్లల్లో దృష్టిలోపం పెరిగిపోతోంది. ఆ పిల్లల కళ్ళపై అనవసర ఒత్తిడి పడుతోంది. కంప్యూటర్లను గంటలపాటు విడచిపెట్టని పిల్లల్లో 30 శాతం మంది ఈ ఒత్తిడి కారణంగా స్పెషల్ కంప్యూటర్ కళ్ళజోళ్ళు అవసరమయ్యే పరిస్థితిలోకి జారిపోతున్నారు. వీళ్ళు కంప్యూటర్ విజన్ సిండ్రోమ్ బారిన సులువుగా పడే ప్రమాదముంది. కళ్ళ అలసట చెందటం, మండడం, పొడిగా తయారుకావడం, కాంతిని భరించలేకపోవడం, తలనొప్పితో బాధపడడం, మెడ, భుజాల్లో నొప్పి; దృష్టి మసకబారడం కంప్యూటర్ విజన్ సిండ్రోమ్ లక్షణాలు. అందువల్ల పిల్లల్ని ఎక్కువసేపు కంప్యూటర్ వద్ద కూర్చోనివ్వొద్దని, ఎక్కువసేపు గడిపేవారు మధ్యమధ్యలో విరామం తీసుకోవాలని వైద్యులు సెలవిస్తున్నారు.

లోపలనుండి లాగే అలలాంటిదన్నమాట. ఎంతటి గజ ఈతగాళ్లయినా వాటి ధాటికి తట్టుకోలేరు. కాబట్టి సముద్రంలో లోతుకు వెళ్లకండి. ప్రతి బీచ్‌లో లైఫ్‌గార్డులుంటారు. అయినాసరే ప్రతిరోజూ అయిదారుగురు సముద్రంలో మరణిస్తూంటారు. కాబట్టి 'జాగ్రత్త'

అందరూ తలలూపారు.

'రేపు ఉదయం తొమ్మిది కల్లా 'మిరామార్' బీచ్ గుండా నడుస్తూ డోనాపాలా చేరాలి' అని అందరి వైపూ చూసి 'మిరామార్' అంటే అర్థం ఎవరికయినా తెలుసా? అడిగాడు.

అందరూ మౌనంగా ఉన్నారు.

'మిరామార్' అంటే సముద్రాన్ని దర్శించేందుకు అనువైన స్థలం అని అర్థం. ఈ బీచ్ వెంబడి సాయం నడక అద్భుతంగా ఉంటుంది. అయితే మీరు ఉదయం నడుస్తారన్నమాట. డోనాపాలాకు తొమ్మిదికల్లా చేరుకుంటే 'లాంచి' మీకోసం ఎదురుచూస్తూంటుంది. సరిగ్గా తొమ్మిది గంటలకల్లా బయలు దేరుతుంది లాంచి. ఆలస్యంగా వెళ్లిన వాళ్ల బాధ్యత మాది కాదు. డోనాపాలా నుండి లాంచి మిమ్మల్ని 'మర్మగోవా' హార్బర్ చేరుస్తుంది. అటునుంచి మీరు బోగ్మాలో బీచ్ ద్వారా మొదటి క్యాంప్ చేరతారు. దారిలో మీరు మన వైమానిక దళ స్థావరం గుండా నడవాల్సి వస్తుంది. మన కోసం వైమానిక దళం వారు ప్రత్యేకంగా అనుమతినిచ్చారు. ఈ నడకలో ఎవ్వరూ

ఫొటోలు తీయకూడదు. బీచ్‌లలో ఫోటోలు తీసుకోండి. కానీ వైమానిక దళ స్థావరాలలో మాత్రం ఫోటోలు తీయకండి. మిలటరీ వాళ్లు పట్టుకుంటే బాధ్యత మాదికాదు. ఎవ్వరూ మమ్మల్ని గమనించట్లేదని అనుకోకండి. రహస్య కెమేరాలుంటాయి.

తివారీ భుజాలెగరేశాడు. కిరణ్ చెవిలో చెప్పాడు 'అంతా ఉట్టిదే' అని. బోగ్మలో బీచ్ క్యాంపు నుండి ఉదయమే ప్రయాణమౌతారు. ఆ రోజంతా మీరు బెనావ్‌లిమ్ బీచ్‌లో నడవాల్సి ఉంటుంది.

అందరూ ఉత్సాహంగా అరిచారు. నవ్వాడు మనోహర్.

'ఈ ఉత్సాహం మీరు బీచ్‌లో నడిచే రోజు కూడా ఉండాలని ఆశిస్తున్నాను. ఎందుకంటే పైన చురచుర మండించే ఎండ ఉంటుంది. బీచ్‌లో నీడ అన్నది ఉండదు. క్రింద ఇసుక కాలుస్తూ ఉంటుంది. వీపు మీద రక్‌సాక్ బరువుంటుంది. ఇవన్ని అనుభవిస్తూ దాదాపుగా 14 కిలోమీటర్లు నడవాల్సి ఉంటుంది. ఆలోచించండి.'

అది వింటూంటే అందరి ఉత్సాహం చల్లబడింది.

'మీరు బెనావ్‌లిమ్ బీచ్‌లో నడిచేటప్పుడు ఒక విషయం గమనించండి. ఈ బీచ్ రూపం ఒక గొడ్డలిలా ఉంటుంది. పరశురాముడు విసిరిన గొడ్డలి ఈ ప్రాంతంలో స్థిరంగా నిలబడిందని పురాణ కథనం. పోర్చుగీసు భాషలో 'బానాలి' అంటే గొడ్డలి అని అర్థం. కాలక్రమేణా ఇది బెనావ్‌లిమ్ అయింది. ఆ రోజు మీ క్యాంపు బెనావ్‌లిమ్ బీచి చివర్లో ఉంటుంది. అద్భుతమైన అనుభవం అది. ఎంజాయ్ చేయండి.

తెల్లారేసరికి మీ కోసం బస్సు సిద్ధంగా ఉంటుంది. మిమ్మల్ని మర్మగోవా రైల్వేస్టేషన్ వరకూ తీసుకువెళ్తుంది. అక్కడకు వచ్చే ప్యాసెంజర్ బండి ఎక్కి కోలెమ్ రైల్వేస్టేషన్‌లో దిగుతారు. స్టేషన్ బయటకు



రాగానే 'భగవాన్ మహావీర్ సాన్చ్యురీ' తోవలో నడవాలి. ఇటు నుండి మీరు అడవిలో ప్రయాణిస్తారు. దారి దట్టమైన అడవిలోంచి వెళ్తుంది. జాగ్రత్తగా, అందరూ కలసి నడవాలి. అడవిలో రకరకాల దారులుంటాయి. అన్ని చోట్లా గుర్తులు ఎర్రగా కనిపిస్తాయి. ఏ మాత్రం పొరపాటు జరిగినా మీరు దారితప్పి పోతారు. ఒక్కసారి దారితప్పితే ఇక మీరు అడవిలో తిరుగుతూనే



ఉంటారు. కాబట్టి జాగ్రత్తగా నడవండి ఆ దారి గుండా వెళ్తే 'దూధ్‌సాగర్ జలపాతం' క్యాంపు వస్తుంది. క్యాంపు జలపాతానికి రెండు కిల్లోమీటర్ల దూరంలో ఉంటుంది. క్యాంపు క్యాంపు చేరి రిలాక్కయి సాయంత్రం జలపాతం దగ్గరకు వెళ్లవచ్చు. మళ్లీ ప్రొద్దున్నే లేచి కొండఎక్కాల్సి ఉంటుంది. అంటే జలపాతం పైకి ఎక్కుతా రన్న మాట. ఎంతో అందంగా ఉంటుందా దృశ్యం. మళ్లీ నడక అంతా అడవిలోనే. అయితే కొండదిగటం తోటే మీరు కర్ణాట కలో ప్రవేశిస్తారు. దట్టమైన అడవులు. పులులు, ఎలుగుబంట్లు ఉంటాయి. మీ అదృష్టం బాగుంటే ఎగిరే ఉడతలను చూడ వచ్చు. అయితే ఒక విషయం. అడవిలో అనేకంగా ఘోరమైన విషం కలిగి ఉన్న పాములుంటాయి. అడుగు చూసి వేయండి.

పాములు చెట్టు కొమ్మల్ని పట్టుకుని వ్రేలాడుతూంటాయి. కాబట్టి చెట్లపై చేతులు వేసే ముందు జాగ్రత. మీరు జాగ్రత తీసుకోవాల్సిన ఇంకో విషయం ఏమిటంటే, అడవుల్లో నడచేటప్పుడు అందరూ కలసికట్టుగా నడవాలి. మీతో ఓ గైడ్ కూడా ఉండాలి. ఒక వేళ మీకు ఎలుగుబంటి ఎదురైతే....' అని అందరి వైపు చూశాడు.

అందరూ గుసగుసలాడసాగారు.

'నేను ఎలుగుబంటిని తరిమేస్తా' అన్నాడు తివారి.

'కవిత వినిపించా?' అడిగాడు మురుమ్కర్.

అందరూ నవ్వారు.

'నవ్వులాట కాదు. అడవిలో ఎలుగుబంట్లున్నాయి. అప్పుడపుడూ అవి బయటకు వస్తుంటాయి. ఒక వేళ మీ దారిలో ఎలుగుబంటి వస్తే... భయపడి. ఎంతగా భయపడాలంటే, అందరూ కలసి గొంతు చించుకుని కేకలు వేయండి. అరుపులకు భయపడుతుంది ఎలుగుబంటి. అంతేతప్ప ఎవరూ అనవసరమైన హీరోయిజం ప్రదర్శించాల్సిన అవసరం లేదు.'

అందరూ తలలూపారు.

ఇక్కడ నుంచి మీరు కర్ణాటకలో ఉన్నట్టు. ఆ క్యాంపు పేరు 'కువేషి' క్యాంపు. కువేషి క్యాంపు చాలా సుందరంగా ఉంటుంది. మళ్లీ తెల్లారే నడక ఆరంభించాలి. ఈ సారి మరింత దట్టమైన అడవి లోంచి నడవాల్సి ఉంటుంది. అడవి దాటగానే 'కాసిల్‌రాల్' క్యాంపు వస్తుంది. మళ్లీ తెల్లారే అడవిలోంచి నడుస్తూ మహావీర్ సాంక్చురీ దాటాలి. అక్కడ మీ కోసం బస్సు సిద్ధంగా ఉంటుంది. సాయంత్రం కల్లా మళ్లీ బేస్ క్యాంపు చేరుకుంటారు. ఇదీ మీ ట్రెక్కింగ్ కార్యక్రమం.'

అందరూ నిట్టూర్చారు.

'ట్రెక్కింగ్‌లో మీరు కొన్ని జాగ్రత్తలు పాటించాలి. నీళ్ల దగ్గర ఉంచుకోండి. కానీ అంతా ఒకేసారి తాగద్దు. ఒక్కొగుక్క తాగండి. మళ్లీనీళ్లు దొరికే స్థలం వచ్చేవరకు నీళ్లు అయిపోకుండా చూసుకోండి. నీళ్లు దొరికే చోట బాటిల్ నింపుకోండి. దారిలో పిప్పర్‌మెంట్లు తినండి. అవకాశం దొరికినప్పుడల్లా 'టీ' తాగండి. మరీ పరుగెత్తినట్టు నడవాల్సిన అవసరం లేదు. మీరు ప్రకృతిని ఎంజాయ్ చేస్తూ నడవండి. ప్రకృతి మీతో మాట్లాడేందుకు మీకు బోలెడన్ని విషయాలు చెప్పేందుకు సిద్ధంగా ఉంటుంది. కానీ ప్రకృతి నేర్పేపాఠాలు వినే ఆసక్తి ఓపిక మీకున్నాయా? ఆలోచించుకోండి. మరో ముఖ్యవిషయం...ట్రెక్కింగ్‌లో ఎవరూ తాగొద్దు. అమ్మాయిలతో అసభ్యంగా ప్రవర్తించవద్దు. వారు ఎంతో భరోసాతో, ఎంతో దూరం నుంచి ఒంటరిగా వచ్చారు. మన మీద వారుంచిన నమ్మకాన్ని వమ్ముచేయకూడదు. ఎవరైనా ఈ నియమాలను ఉల్లంఘించినట్లు తెలిస్తేమాత్రం పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయి.' కఠినంగా చెప్పాడు మనోహర్.

అందరికీ రూట్‌మ్యాపులు అందించాడు.

'ఇప్పుడు మీరు మీ గ్రూప్‌కి నాయకుడిని, ఉపనాయకుడిని ఎన్నుకోవాలి'. నాయకుడు ముందు దారి చూపిస్తుంటాడు. ఉపనాయకుడు అందరికన్న చివర్న ఉంటాడు. అంటే ఏ క్యాంపుకయినా ముందుచేరేది నాయకుడు. అందరూ చేరిన తరువాత చేరేది ఉపనాయకుడు అన్నమాట. చెప్పండి ఎవరు మీలో నాయకుడిగా ఉంటారు?'

'నేను' లేచాడొక నడివయసు వ్యక్తి. అతని పేరు వినాయక్. బొంబాయి నుంచి వచ్చాడు.

'ఎవరికీ అభ్యంతరం లేదు కదా!' అడిగాడు మనోహర్.

ఎవరూఏమీ మాట్లాడ లేదు.

'మరి ఉపనాయకుడు?'

'నవీద్' అరిచారెవరో.

'వెరీగుడ్. కాశ్మీర్ నుంచి వచ్చిన నవీద్

ఉపనాయకుడు' అన్నాడు మనోహర్.

'చూశావా... ఇదీ సూక్ష్మంలో మన దేశంలో ఎన్నికల్లానే ఉంది. మన నాయకుడు ఎవరో, వాడికే లక్షణాలున్నాయో, వాడికి నాయకత్వ లక్షణాలున్నాయో లేదో, ఏదైనా అనుభవం ఉందా, విచక్షణ, విజ్ఞానాలున్నాయా మనకు అనవసరం. మనం చేయని ధైర్యం వాడు చేశాడు. ముందుకు వచ్చాడు కాబట్టి వాడు నాయకుడయ్యాడు. మనం వాడి మాట వినాల్సిందే. ఇదీ మన పరిస్థితి. నిజంగా నాయకత్వ లక్షణాలుండి, ప్రతిభ ఉన్నవాడు బాధ్యతను భయపడి మౌనంగా ఉంటాడు. చేతకాని వాడు ముందుకొచ్చి మన భవిష్యత్తు నిర్ణయిస్తాడు' అన్నాడు మురుమ్కర్ కిరణ్‌తో.

'ఎవరికైనా ఏమైనా సందేహాలున్నాయా?' అడిగాడు మనోహర్.

ఇంతలో తుఫానులా నలుగురు పొడుగ్గా, బలిష్టంగా ఉన్న వ్యక్తులు మనోహర్ దగ్గరకు వచ్చారు.

'సార్, మేం ఫోన్ చేసి చెప్పాం. లేటుగా వస్తామని'. అన్నాడు వారిలో కాస్త వయసు మళ్లిన వాడిలా ఉన్న వ్యక్తి.

'ఎక్కడ నుంచి వచ్చారు మీరు?' అడిగాడు మనోహర్.

'హర్యానాసే' అంటూ 'హ్హహ్హహ్హ' అని నవ్వాడా వ్యక్తి.

'అమ్మో... వీళ్లొచ్చారా?' అన్నాడు మురమ్కర్.

'వీళ్లు మీకు తెలుసా?' అడిగాడు కిరణ్.

'తెలుసు. వీళ్లని 'హర్యానా బర్రెలు' అంటారు. వీళ్లు ఎవరిమాటా వినరు. పోరాటానికి సిద్ధంగా ఉంటారు. అరుపులు, కేకలు, హడావిడి, వీళ్లుంటే ట్రిప్ మొత్తం గందరగోళంగా అవుతుంది.

మురుమ్కర్ మాట పూర్తికానేలేదు. హర్యాన వాళ్లలో మీసాలుండి, పొడుగ్గా, దిట్టంగా, విలన్లా ఉన్నవాడు. 'బోలేసోనిహాల్' అని పెద్దగా అరిచాడు.

'బోలే'లో 'లే' దగ్గర చాలసేపు దీర్ఘం తీశాడు.

జట్టుంతా ఉత్సాహంగా 'సత్‌శ్రీఅకాల్' అని అరిచింది.

'చూశావా... ఇదీ వరుస' అన్నట్టు నవ్వాడు మురుమ్కర్.




నిజంగా హర్యానా వాళ్లు రావటంతోటే తుఫాను వచ్చినట్టుంది. వాళ్లంతా 'హహహ' అని పెద్దగా నవ్వుతూనే ఉన్నారు.

పలకరించేవాడిని ముందుగా భుజంమీద చరిచి పలకరిస్తున్నారు. వాళ్లని చూస్తేనే అంత చదువు ఉన్న వారు కాదని తెలుస్తోంది. కానీ వాళ్ల దగ్గర ఉన్న ఆధునిక వస్తువులు చూస్తే డబ్బున్న వారని అర్థమౌతోంది.

'నేను రైతును మట్టిని పిండి మాణిక్యాలు తయారు చేసి బంగారు పంటను పండించే వాడిని' వాళ్లలో కాస్త వయసు మళ్లిన వాడిలా ఉన్న సుదర్శన్ అన్నాడు.

'నన్ను 'తావూ' అని పిలవండి. మా భాషలో తావూ అంటే పెద్దన్న అని అర్థం' అని హోహోహో అని నవ్వాడు.

'నా పేరు బల్వీందర్' అని పొట్టిగా లావుగా ఉన్న అతను చెప్పాడు. 'నేను బ్యాంక్ ఆఫ్ పాటియాలాలో క్యాషియర్‌ని.

'నేను నారంగ్. నాకు కేబిల్ బిజినెస్ ఉంది' అన్నాడు పొడుగ్గా ఉన్న నారంగ్.

అతడి కళ్లు అటూ ఇటూ తిరిగే అమ్మాయిల్ని వదలటం లేదు.

'నేను పుల్విందర్, మాకు ట్రాన్స్‌పోర్ట్ వ్యాపారం ఉంది' బోలే అని గొంతు చించుకుని అరిచిన అతనన్నాడు.

వాళ్లూ ఏడవ నెంబర్ టెంట్‌లోకి వచ్చారు. వస్తూనే టెంట్‌నంతా ఏకం చేశారు. 'టెంట్‌లో ఈ మట్టి ఏమిటి ఈ దుమ్ము ఏమిటి?' అంటూ చకచకా నలుగురూ టెంటులోని కంబళ్లను దులిపేశారు.

'మనం ఉండేదేదో శుభ్రంగా ఉండాలి' అన్నారు.

ఆ రాత్రి క్యాంప్‌ఫైర్‌లో తివారి కవిత చదివాడు. దాదాపుగా పదిహేను నిమిషాలుండే ఆ కవిత వింటూ, అందరూ విసుగొచ్చి గోల చేశారు. కేకలు వేశారు. కానీ ఉరుములు, పిడుగులు పడుతున్నా, మైకు వదలకుండా ఉపన్యాసాలిచ్చే రాజకీయ నాయకుడిలా అతను కవిత చదువుతూనే ఉన్నాడు.

అర్థం లేకుండా సాగిన ఆ కవితను సాగదీస్తూ ప్రీతివైపు చూస్తూ చదివాడు తివారి.

అతను కవితను చదవటం అపిన తరువాత రిలీఫ్‌తో అందరూ చప్పట్లు చరిచారు. కవిత చదివి పరుగు పరుగున కిరణ్ వద్దకు వచ్చాడు తివారి.

'ఎలా ఉంది నా కవిత? అందరి ముందూ నా హృదయంలో మాట ప్రీతికి చెప్పేశా! ఇప్పుడేమంటుంది?' గుసగుసగా అడిగాడు.

నవ్వాడు కిరణ్.

'ఏమంటుందో రేపు తెలుస్తుంది' అన్నాడు.

కానీ హర్యానా వాళ్లు తివారిని ఆటపట్టించటం ఆరంభించారు.

అతడు టెంటులోకి అడుగుపెడుతుంటేనే 'అహో కవి కూలిదాస్' అని పిలిచారు.

'కూలిదాస్ కాదు కాలిదాస్' అని సవరించబోయాడు తివారి.

వాళ్లు వినలేదు. 'కాలిదాస్.... కాలి (నల్ల) దాస్.' అని ఏడ్పించారు.

'క్యాంప్‌ఫైర్ అయిపోయింది. ఇప్పుడు టెంట్‌ఫైర్ ఆరంభం' అన్నారు.

'టెంట్‌ఫైరంటే?' అమాయకంగా అడిగాడు చేతన్.

'హ్హాహ్హాహ్హా' అని నలుగురూ అక్కడున్న టెంట్లన్నీ అదిరేలాగా నవ్వారు.

'క్యాంపుఫైర్‌లో ఐటమ్స్ శాఖాహార ఐటమ్స్. అందరూ తినేందుకు వీలయిన ఐటమ్స్. టెంట్‌ఫైరులో పూర్తిగా నాన్‌వెజ్ ఐటమ్స్ ఉంటాయి. బలహీన మనుషులకు కాదీ టెంట్‌ఫైర్' అని షురూ హోజా నారంగ్ అన్నాడు సుదర్శన్.

వెంటనే నారంగ్ రకరకాల జోక్స్ చెప్పటం ఆరంభించాడు.

అతడు చెప్పే జోక్స్‌కి నవ్వు రాకున్నా హర్యాణీ యాసలో పంజాబీ, హర్యాణీ కలిసిన భాషతో అతడు చెప్పే విధానానికి నవ్వు రాసాగింది. టెంటు నవ్వులతో దద్దరిల్లింది.

ఎంత వద్దనుకున్నా కిరణ్ పెదవులపై చిరునవ్వు నిలిచింది.




మరుసటి రోజు ఉదయం నుంచీ హడావిడి మొదలయింది.

'అరె నా షూస్ నేను డిపాజిట్ చేసేశాను' అరిచాడు తివారి.

'షూ లేకున్నా పరవాలేదు. చెప్పుల్తో నడవొచ్చు' చెప్పాడు మురుమ్కర్.

ఉదయం ఏడున్నరకల్లా అందరూ వరుసగా నడవటం ఆరంభించారు. ఎనిమిదిన్నరకల్లా డోనాపోలా చేరుకున్నారు.

రాజు, చంద్రలు స్వప్న, కాశ్మీరాలకు అతు

క్కుపోయారు. చేతన్, సెలిన్‌లు అనురాధ, ఆరోహీలవైపున్నారు. మిగతా అడపిల్లలు కాశ్మీరీల చుట్టూ చేరారు. ప్రీతి ఒక్కర్తే దూరంగా కూచుని ఉంది. ఆమె అందరినీ చూసే విధానంలోనే తాను అందంగా ఉన్నానన్న అహంకారం స్పష్టంగా తెలుస్తోంది.

మురుమ్కర్ హర్యానా వాళ్లతో మాట్లాడుతున్నాడు.

ఒంటరిగా కూర్చున్న కిరణ్ కళ్లు ఎంత వద్దనుకున్నా ప్రీతి ముఖాన్ని వదలటంలేదు. 'అమ్మాయి నిజంగా అందంగా ఉంది' అనుకున్నాడు కిరణ్.

ఇంతలో లాంచి వచ్చింది. అందరూ పోటీపడి లాంచ్‌లోకి దూకారు. లోపలి సీట్లన్నీ అయిపోయాయి. హర్యానా వాళ్లు కిరణ్, చేతన్, సెలిన్‌లు పైకెక్కారు.

చేతన్ కెమేరా తీశాడు.

లాంచి నీటిని కోసుకుని పోతోంది.

ఎందుకో తెలియని ఉత్సాహంతో కిరణ్ మది ఉప్పొంగింది.

నీటిని చూస్తే వెర్రెక్కిపోయేది వీణ. సముద్రపు కెరటాలపై నురుగ అయి ఆడుకునేది. ఇలా బోట్లో ప్రయాణం చేస్తుంటే నీళ్లలో చేతులు పెట్టి ఆడేది. ఫొటోలు టపటప తీసేది. చిన్న పిల్లలా సంబరపడేది. వీణ ఆనందం చూస్తే కిరణ్ ఆనందం రెట్టింపు అయ్యేది.

కిరణ్ వీణనుంచి ఆలోచనలు మళ్లించి చుట్టూ చూశాడు.

ఎటు చూసినా నీళ్లే. నీలిరంగులో ఉన్న చిక్కటి నీళ్లు. నెమ్మదిగా లేచి పడుతున్నాయి అలలు. అలల ఉపరితలంపై సూర్యకిరణాలు పడి వెలుగుకన్యలుగా మారి తళతళమంటూ నృత్యం చేస్తున్నాయి.

అది చూస్తూ మైమరిచిపోయాడు కిరణ్.

'ప్రకృతిలో ఎంత ఆనందం ఉంది. అంతకు మించిన అందం ఉంది. ఈ ఆనందాన్ని సంపూర్ణంగా మనిషి గ్రహించగలడా? ఈ అనంతమైన అందం నుండి అపరిమితమైన ఆనందాన్ని మనిషి అనుభవించగలడా?'

ఓవైపు నుంచి మరో వైపుకు వంగితే, అవే నీళ్లు, అవే అలలు అయినా దృశ్యంలో తేడా కనిపిస్తోంది.

మనిషి ఏమి అనుభవించినా తన ఇంద్రియాల ద్వారా గ్రహించిన వాటినే అనుభవించాలి.

కానీ ఇంద్రియాల పరిధి పరిమితమైనది. అంటే ఎంత లేదనుకున్నా మన అనుభవాలు పరిమితమా? మన అనందాలు పరిమితమా?

లాంచి హార్బర్‌లో ప్రవేశిస్తున్నట్టుంది. పెద్దపెద్ద షిప్‌లు కనిపించసాగాయి. చూస్తుంటే ఒక్కో నౌక ఒక్కో అయిదారంతస్తుల అపార్ట్‌మెంట్‌లా ఉంది.

అందరూ మాటలాపి నోరు తెరచి వాటివైపే చూడసాగారు.

లాంచి గమ్యం చేరింది.

ఒకరొకరుగా గట్టు మీదకు దూకసాగారు.

చేతన్ దిగి ఆరోహీకి చేయి అందించాడు. సెలీన్, ఆరోహీ వాళ్లమ్మ



**ప్రకృతిలో ఎంత ఆనందం ఉంది. అంతకు మించిన అందం ఉంది. ఈ ఆనందాన్ని సంపూర్ణంగా మనిషి గ్రహించ గలడా? ఈ అనంతమైన అందం నుండి అపరిమితమైన ఆనందాన్ని మనిషి అనుభ వించగలడా?'**



అనూరాధకు చేయి అందించాడు. రాజు, చంద్ర, స్వప్న, కాశ్మీరాల చేతులు వదలడం లేదు. తివారీ, సందీప్‌లు ప్రాజక్త, ప్రీతి, సురభిల చుట్టూ తిరుగుతున్నారు.

ఇదంతా చూస్తున్న కిరణ్‌కు నవ్వు వచ్చింది.

ఒక వంక ప్రకృతి ఎవరితో సంబంధం లేకుండా తన అపరిమిత మైన అందాన్ని సంపూర్ణంగా ప్రదర్శిస్తోంది.

మరోవంక పరిమితమైన పరిధి కల మానవుడు, ఆ అపరిమితమైన అందం జోలికి పోకుండా, కనీసం దాన్ని అర్థం చేసుకోవాలనే ప్రయత్నం కూడా చేయకుండా తన గోలలో తానున్నాడు.

అయినా సరే ఎవరి కోసం సూర్యుడు ఇంత ఉజ్వలంగా ప్రకాశిస్తూ, జగతిని ప్రకాశవంతం కావిస్తున్నాడు?

ఎవరు చూడాలని నీరు నీలం రంగు పులుముకుంది? ఎవరి కోసం అలల శృంగాలపై సూర్యకిరణాలు మణుల రూపంలో తళతళ మెరుస్తున్నాయి?

'బోలే సోనిహాల్' మళ్లీ గొంతు చించుకుని అరిచాడు పుల్వీందర్.

అందరూ అతడిని అనుసరించారు.

కిరణ్ కూడా ఆ వైపు నడిచాడు. షరా మామూలుగా అతని మనస్సులో ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి.

వీణ మరణించిన తరువాత తానెందుకు ఇంకా బతికి ఉన్నాడా అని ఆలోచిస్తూ గడిపాడు.

ఇప్పుడు అతని ఆలోచనలు 'మనిషి జీవితానికి అర్థం ఏమిటి?' అన్న ప్రశ్నపై కేంద్రీకృతమయ్యాయి.

పైన ఎండ చుర్రుమనిపిస్తోంది.

ఎవరికి వారు గుంపులుగా ఏర్పడి నడుస్తున్నారు.

కిరణ్ ఒక్కడే అందరి వెనుక నెమ్మదిగా నడుస్తున్నాడు.

ముందు వెళ్తున్న నవీద్, ఆగి వెనక్కు తిరిగి 'హలో' అన్నాడు.

కిరణ్ అతని వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

'త్వరగా రావాలి సార్' అన్నాడు.

కిరణ్ అడుగుల వేగం పెంచాడు. కానీ పైన ఎండకి చెమటలు కారిపోతున్నాయి. నోరెండి పోతోంది. నీరసంగా అనిపిస్తోంది.

మొదటి రోజు మొదటి గంటలోనే ఇలా ఉంటే ఇంకా వారం రోజుల్లో తన పరిస్థితి ఏమౌతుంది? అనుకున్నాడు.

కిరణ్‌ని త్వరగా రమ్మని చెప్పి నవీద్ ముందుకు పరుగెత్తాడు. ముందు నడుస్తున్న రుజిత్‌ను చేరుకున్నాడు.

రుజిత్ అతడిని చూసి నవ్వింది. నవీద్ కూడా ఆమెను చూసి సమ్మోహనంగా నవ్వాడు.

వాళ్ల నుంచి దృష్టిని మరల్చి కుడివైపు చూసిన కిరణ్ ఆశ్చర్యంతో ఆగిపోయాడు.

కుడివైపున నీలం తివాచీ పరచినట్లు సముద్రం ఉంది.



వీణ మరణించిన తరువాత తానెందుకు ఇంకా బతికి ఉన్నాడా అని ఆలోచిస్తూ గడిపాడు. ఇప్పుడు అతని ఆలోచనలు 'మనిషి జీవితానికి అర్థం ఏమిటి?' అన్న ప్రశ్నపై కేంద్రీకృతమయ్యాయి.



తివాచీలో అద్దాలు అమరిస్తే, వాటిపై సూర్యకాంతి పడి మెరుస్తున్నట్టు, సన్నగా లేస్తున్న అలలపై వెలుతురు మిలమిలలాడుతోంది.

అది చూస్తూ కదలలేక పోయాడు.

పైన ఎండవేడి అదృశ్యం అయిపోయింది. దప్పికను మరిచిపోయాడు. నీరసం ఎగిరిపోయింది. ఏదో తెలియని ఆనందం మనసు నిండా నిండింది.

అతని అడుగులు వేగంగా పడసాగాయి. అందరినీ దాటి బోటు ముందుకు పోసాగాడు.

ఏదో గొప్ప సత్యాన్ని దర్శించిన భావనతో అతని శరీరం తేలికయిపోయింది.

'ఏమోయ్ గేర్లు మార్చినట్టున్నారు?' చెమటలు కక్కుతూ, ఆయాసపడుతున్న మురుమ్కర్ అడిగాడు.

నవ్వాడు కిరణ్. సముద్రం వైపు చేయి చూపించాడు. ఆవైపే చూస్తూ ముందుకు సాగాడు.

మలుపు తిరిగే సరికి ఎదురుగా విశాల సముద్రం! ఎటు చూసినా అనంత నీలిపాథోరాశి! దూరం నుంచి చూస్తే కెరటాల జోరు తెలియడం లేదు. కానీ బీచ్‌లో కెరటాలు ఎగిరెగిరి పడుతున్నాయి.

అప్పటికే ముందుగా చేరినవారు నీళ్లలో దిగి కేరింతలు కొడుతూ ఆడుతున్నారు.

కిరణ్ కూడా బ్యాగు ఇసుకలో పెట్టి నీళ్ల ల్లోకి దిగాడు. మోకాలు లోతు నీళ్లు రాగానే ఆగిపోయాడు. అక్కడే నిలబడి అందరినీ చూస్తున్నాడు.

'హేయ్... అక్కడే నిలబడ్డావు నీళ్లల్లోకి రా' పిలిచాడు నవీద్

'నేను రాను. ఈత రాదు' చెప్పాడు కిరణ్.

'ఆవో భాయ్' అంటూ ఒక్క అంగలో కిరణ్‌ని చేరుకుని నీళ్లలోకి లాగాడు నవీద్. కిరణ్ ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

'నాకు ఈత వచ్చు' అంటూ నవీద్ కిరణ్‌ని నీళ్లలోపలకు తీసుకుపోయాడు.

పొడుగు వాడవటం వల్ల నీళ్లు నవీద్ నడుం వరకే వచ్చాయి. కానీ కిరణ్‌కు గుండెల వరకూ వచ్చాయి.

ఒకరిపై ఒకరు నీళ్లు చల్లుకున్నారు. ఇది చూసి మిగతా వారు వీళ్ల దగ్గరకు వచ్చారు. అందరూ నవ్వుతూ కేరింతలు కొట్టసాగారు.

హఠాత్తుగా కిరణ్‌కు వీణ గుర్తుకు వచ్చింది. తనూ, వీణ నీళ్లలో ఇలాగే ఆడుకునేవారు. ఇప్పుడు వీణ లేకుండా తాను ఒంటరిగా ఆడుతున్నాడు. గిల్టీగా అనిపించింది.

అంతమంది మధ్య ఒంటరిగా అనిపించింది. నెమ్మదిగా నీళ్ల నుంచి బయటకు వచ్చాడు.

'ఏమైంది?' అడిగాడు మురుమ్కర్.

'ఏమీ కాలేదు' ముక్తసరిగా సమాధానం ఇచ్చాడు కిరణ్.

'ఎవరైనా జ్ఞాపకం వచ్చారా?' అడిగాడు మురుమ్కర్.

కిరణ్ కళ్లలోకి నీళ్లు ఉబికి వచ్చాయి. సముద్రం నీళ్ల కన్నా ఉప్పగా ఉన్నాయి కన్నీళ్లు. కిరణ్ వైపు చూసి నవ్వుకుని మళ్లీ నీళ్లలో ఆడుతున్న వాళ్లవైపు చూస్తు కూర్చున్నాడు మురుమ్కర్.




'ఇదే బోగ్మలో బీచ్' దూరం నుంచీ నీటి తళతళలు కనిపిస్తున్నాయి. 'మనం ఇక్కడే లంచ్ చేస్తాం రెండున్నరకి బయలు దేరతాం' చెప్పాడు గ్రూప్ లీడర్. అందరూ తమకనువైన స్థలం వెతుక్కోసాగారు.

మురుమ్కర్ మోచేత్తో పొడిచి కిరణ్‌కు

ఆవైపు చూపించాడు.

బీచ్‌కి ఒక మూల కొందరు విదేశీయులు రంగురంగుల గొడుగు క్రింద దాదాపుగా నగ్నంగా పడుకొని ఉన్నారు.

హర్యాణా వాళ్లు గబగబా ఆ వైపుకి వెళ్తున్నారు.

సందీప్, తివారీలు ముందే అక్కడకు చేరుకున్నారు.

'మనవాళ్లకి విదేశీయులంటే ముందే క్రేజు. వారు నగ్నంగా ఉన్నారంటే కోతికి కొబ్బరి కాయ దొరికినట్టే' అన్నాడు మురుమ్కర్

విదేశీయులు హాయిగా పడుకున్నారు. ఒక అబ్బాయి ఏదో పుస్తకం చదువుతున్నాడు. ఇంకొందరు నీళ్లలో ఈదుతున్నారు.

తమ వైపు వస్తున్న వారిని చూసి పడుకున్న అమ్మాయిలు లేచి శరీరాన్ని టవల్‌తో కప్పుకున్నారు.

ఒక్కక్కరుగా ట్రెక్కింగ్ బ్యాచ్‌లో ఉన్న మగవారంతా విదేశీయులు ఉన్నవైపు చేరారు.

వాళ్లని కళ్లప్పగించి చూడసాగారు.

అందరూ ఆవైపు రావటం చూసిన హర్యాణ వాళ్లు నెమ్మదిగా మరింత దూరం వెళ్లారు. మురుమ్కర్, కిరణ్ వాళ్లని అనుసరించారు.

వాళ్లు నలుగురు ఎవరికీ కనబడకుండా కూర్చుని బాటిళ్లు ఓపెన్ చేశారు.

మురుమ్కర్ నవ్వసాగాడు

'వీళ్లీ వైపుకు రావటం చూసి నేను విదేశీ నగ్న వనితలను చూసేందుకు వచ్చారనుకున్నాను. కానీ వీళ్లు వచ్చింది తాగేందుకు చూశావా మనం ఎంతగా పొరపాటు అంచనా వేస్తామో' అన్నాడు మురుమ్కర్.

ఇంతలో సందీప్ తివారీలు హర్యాణా వాళ్ల దగ్గరకు వచ్చారు. వారూ తాగసాగారు. కిరణ్‌కి ఎందుకో ఆ దృశ్యం అంతగా రుచించలేదు. చిన్న పిల్లలు, పెద్దలు అంతా కలసి తాగటం ఎలాగో అనిపించింది. అటువైపు చూసేసరికి బోర్లా పడుకున్న ఓ విదేశీ వనితకు, ఏదో లోషన్ రాస్తున్న విదేశీ యువకుడు కనిపించాడు. వాళ్లకి చుట్టూ మనుషులు తమని గమనిస్తున్నారన్న స్పృహ కూడా లేనట్టుంది. లేక మనుషులు కళ్లప్పగించి తమని చూడటం వాళ్లకి అలవాటయిపోయిందా?

కిరణ్ వాళ్లనుంచి కళ్లు తిప్పుకుని సముద్రం వైపు చూశాడు. హఠాత్తుగా ఓ డాల్ఫిన్ నీళ్లల్లోంచి ఎగిరి దూకింది.

అద్భుతంగా అనిపించింది. ఇంతలో వరుసగా డాల్ఫిన్ల గుంపు ఒకటొకటిగా నీళ్లలో ఆటలాడటం ఆరంభించాయి.

మిలమిల మెరిసే నీళ్లలో, బంగారు వస్త్రాలు ధరించి ఠీవిగా విహరిస్తున్న మహారాజుల్లా విన్యాసాలు చేయసాగాయి డాల్ఫిన్లు.

కిరణ్ మనస్సు చెప్పలేని ఆనందంతో పొంగిపొర్లసాగింది. ఎటువంటి చీకూచింతా లేకుండా నీళ్లలో హాయిగా, ప్రపంచమంతా తమదేనన్నట్టు స్వేచ్ఛగా ఆడుకుంటున్న ఆ డాల్ఫిన్లను చూస్తే అసూయ అనిపించింది.

ఇటువైపు చూస్తే తాగుతున్న వాళ్లు కనిపించారు. మరోవైపు విదేశీ వాళ్లవైపు కళ్లు అప్పగించి చూస్తున్న వాళ్లు కనిపించారు. రాజు, చంద్ర వారి మిత్రురాళ్లతో మాట్లాడుతూ కనిపించారు. కాశ్మీరీ యువకులు, యువతులతో నీళ్లల్లో ఆడుతూ కనిపించారు.

మురుమ్కర్ వైపు చూశాడు. ఆయన ఓ రాయికి ఆనుకుని గుర్రు పెడుతున్నాడు. మిగతా వారిని పట్టించుకోవటం మాని కిరణ్, ప్రకృతి తన కోసమే సందర్శిస్తున్న ఆ ఆనంద నృత్య కేళీ విలాసాన్ని చూస్తూ కూచున్నాడు. ఎంతో అద్భుతంగా అనిపించింది

తన ఎదురుగా ఓ పెద్ద కేన్వాసు ఉన్నట్టుంది. దాని పైన నీలాకాశాన్ని, క్రింద నీలి

# విరామ కేంద్రాలు



ఆహ్లాదపరిచే ప్రకృతి ఒడిలో ఏర్పాటు చేసిన క్యాంపు

ట్రెక్కింగ్ చేసే వారి కోసం అక్కడక్కడ క్యాంపులు ఏర్పాటు చేస్తారు.

ఒక క్యాంపు నుంచి మరో క్యాంపుకు నడుమ ఉండవలసిన దూరాన్ని ఒక సామాన్యుడు నెమ్మదిగా నడిస్తే అయిదారు గంటల్లో చేరుకునేంత దూరాన్ని బట్టి నిర్ణయిస్తారు. దారిలో ఎత్తు ఎక్కువగా ఉంటే తక్కువ దూరం కోసం ఎక్కువ సమయం, దారి సమతలంగా ఉంటే ఎక్కువ దూరానికి, తక్కువ కాలం నిర్ణయిస్తారు. క్యాంపును నీరు దొరికే ప్రాంతంలో ఏర్పాటుచేస్తారు. వీలయినంత వరకు క్యాంపు నలువైపులా రక్షణ ఉండేట్టు చూస్తారు. క్యాంపులో ఆడవాళ్లకు, మగవాళకు వేర్వేరు టెంట్లు ఉంటాయి. ఆ ప్రాంతంలో ఉండే వాతావరణ పరిస్థితులను బట్టి దుప్పట్లు, గొంగళ్లు ఇస్తారు. మరీ చలిగా ఉండే ప్రాంతాలలో, హిమాలయాల్లో ఎత్తైన 'స్లీపింగ్ బాగ్స్' ఇస్తారు. వాటిలో దూరి పడుకుంటే వెచ్చగా, హాయిగా ఉంటుంది.

ప్రతి క్యాంపుకూ ఓ అనుభవజ్ఞుడయిన ట్రెక్కర్ క్యాంపు లీడర్‌గా ఉంటాడు. క్యాంపులో వంట వ్యవస్థ ఉంటుంది. అయితే హిమాలయాల్లో జన సంచారం లేని ప్రాంతాల్లో ఆలుగడ్డలను స్థానికులు, తలపై మోసుకుంటూ లేదా కంచరగాడిదల ద్వారా క్యాంపులకు చేరుస్తారు. కాబట్టి వరుసగా రోజూ మందమైన పూరీలు, ఉడికీ ఉడకని ఆలుగడ్డలే తినాల్సి వస్తుంది. క్యాంపు లీడర్ ట్రెక్కర్లకు సహాయసహకారాలందిస్తాడు. మరుసటి రోజు తెల్లారి వీడ్కోలు చెప్తాడు. ఒకవేళ మంచులో నడవాల్సి వస్తే బాట ఏర్పరచుకోవడంలో ట్రెక్కర్లకు క్యాంపు లీడరు చేయూతనందిస్తాడు. అడవుల్లో వెంట గైడ్లుంటారు.



మంచుబాటలో ముున్ముందుకు సాగుతూ...

సముద్రాన్ని అందులో చీకు చింతా లేకుండా మెరిసే శరీరాలతో ఆడుతున్న డాల్ఫిన్లను ఎవరో చిత్రించారు. ఎవరీ చిత్ర కారుడు? ఇంత అద్భుతమైన కళాకౌశలంతో ఈ రమణీయమైన ప్రకృతి దృశ్యాన్ని చూసి ఆనందిస్తున్న తన దెంత అదృష్టం!

★ ★ ★

'బోగ్మాలో బీచ్' క్యాంపు చూడగానే నచ్చింది కిరణ్‌కు.

చుట్టూ కొబ్బరి చెట్లున్నాయి. మధ్యలో ఉన్న ప్రదేశంలో ఆరు టెంట్లు వేశారు. కిరణ్ క్యాంపు చేరేసరికి ఓ టెంట్లోంచి మురుమ్కర్ పిలిచాడు. 'కిరణ్ ఇది మన టెంటు' అని

అప్పటికే చేతన్, సెలిన్ టెంటులో ఉన్నారు. హర్యాణా వాళ్ల నలుగురు చాలా సీరియస్‌గా ఉన్నారు. క్యాంపులో ఉన్న రాళ్లమీద రాజు, చంద్ర, స్వప్న, కాశ్మీరలతో మాట్లాడుతున్నారు.

మీరే టెంట్‌లో ఉన్నారు? ' అడిగాడు కిరణ్

'అదే హర్యాణా వాళ్ల టెంటు' కిరణ్ వైపు చూడకుండా చెప్పారు.

కిరణ్ టెంట్‌లోకి వెళ్లేసరికి, గంటు మొహంతో సందీప్, తివారీలు వచ్చారు. 'మమ్మల్ని కాశ్మీరీలు వాళ్ల టెంట్‌లోకి రాని వ్వటం లేదు. ఇక్కడ జాగా ఉందా'? దీనంగా అడిగాడు సందీప్.

'వాళ్లు మమ్మల్ని కూడా తరిమేశారు. ఏమనుకుంటున్నారు వాళ్ల గురించి వాళ్లు? ' గట్టిగా అరిచాడు సుదర్శన్.

'బెంగాలీ వాళ్లు, కాశ్మీరీ వాళ్లు ఒక టెంట్లో ఉంటారట' ఓ మూల సర్దుకుంటూ అన్నాడు సందీప్.

'మా దగ్గర తాగుడు వాసన వస్తున్న దట. అందుకని టెంటులోకి రానియ్యలేదు. వాళ్లెప్పుడూ తాగలేదా? అరిచాడు బల్వీం దర్ కోపంగా.

నారంగ్ ఏదో జోకు చెప్పాడు. అంత వరకూ కోపంగా అరుస్తున్న వాళ్లంతా ఘొల్లుమని నవ్వారు.

కిరణ్ నెమ్మదిగా టెంటు బయటకు వచ్చాడు.

చిరుగాలికి చెట్ల ఆకులు గలగల లాడసాగాయి. తమని చూసి అవి పకపక నవ్వుతున్నాయని పించింది కిరణ్‌కు.

'వెల్‌కమ్ డ్రింక్‌కు రండి' పిలిచాడు క్యాంప్ లీడర్

అందరూ గ్లాసులు పట్టుకుని వచ్చారు.

ప్రతి క్యాంపులో చేరినవారికి ముందు 'వెల్‌కమ్ డ్రింక్' ఇస్తారు. అది శీతల పానీయం. నడచి వచ్చిన అలసట తీరు తుంది.

ఆ తరువాత కాస్సేపటికి 'స్నాక్స్' ఏవైనా ఇస్తారు. టీ ఇస్తారు. వేయించిన పల్లీలు, చిప్స్, లేకపోతే టీ బిస్కట్లు ఇస్తారు. మళ్లీ రాత్రికి డిన్నర్ ఉంటుంది. క్యాంప్‌ఫైర్‌లో బోర్నవిటా ఉంటుంది. అలా నడుస్తూ కోల్పోయిన శక్తిని మళ్లీ కాంపు వదిలే లోపల పుంజుకోవటం జరుగుతుంది. మరుసటిరోజు నడకకు సిద్ధం అవుతారు.

వెల్‌కం డ్రింక్ కాగానే క్యాంపు లీడర్ అందరినీ పిలిచాడు.

'డియర్ ఫ్రెండ్స్... మీ అందరికీ బోగ్మలో క్యాంపుకు ఆహ్వానం. నా పేరు చౌహాన్. నేను మహారాష్ట్ర నుంచి వచ్చాను' అని అందరినీ తమని తాము పరిచయం చేసుకోమన్నాడు.

ఆ తరువాత క్యాంపు నియమాలు వివ రించాడు.

'ఎవ్వరూ క్యాంపు వదలి బయటకు వెళ్ల టానికి వీలు లేదు. మీలో కొందరు దారిలో తాగేరని నాకు కంప్లయింట్ అందింది. ఇది మొదటిసారి కాబట్టి నేను హెచ్చరించి వదిలేస్తున్నాను. ఇంకోసారయితే మాత్రం కఠినచర్యలు తీసుకోవాల్సి ఉంటుంది. మగ వాళ్లు నేచర్ కాల్‌కి అడవిలోకి వెళ్లాల్సి

ఉంటుంది. ఒంటరిగా వెళ్లకండి. కనీసం ఇద్దరు ముగ్గురు కలిసి వెళ్లండి. ఆడవాళ్లకి అక్కడ తాత్కాలికంగా టాయిలెట్లు నిర్మించాం.

'అడవిలోకా?' గట్టిగా అరిచాడు చంద్ర.

చౌహాన్ అతనివైపు చూసి నవ్వాడు. 'ట్రెక్కింగ్‌లో ఉండే మజా అదే. ఎంజాయ్. మీకో విషయం తెలుసా? అసలు ట్రెక్కింగ్ అంటే మీ టెంటుతోసహా ఇతర అవసరమైన సామాన్లన్నీ మీరే మోసుకుంటూ వెళ్ళి మీరే దారి కనుక్కుంటూ నడవాలి. క్యాంపుకు కూడా ఎక్కడ అనువైన స్థలమో మీరే ఎంచుకోవాలి. కానీ ఇప్పుడు మీకు అటువంటి కష్టాలేవీ లేకుండా, మీ కోసం ఎదురు చూస్తూ, రాగానే అన్ని అమర్చి పెడుతున్నాం. మీకన్నా ముందే మీరెళ్ళాల్సిన దారుల్లో మేం నడచుకుంటూ వెళ్ళి మీకు దారిలో కష్టాలు కలగకుండా చూస్తున్నాం. మేం మీ కోసం ఇన్ని కష్టాలు పడుతూంటే, మీరు కాస్త ఇబ్బందిని భరించలేరా?'

'నో ప్రాబ్లెమ్' అందరూ అరిచారు.

'వెరీ గుడ్. ఆరు గంటలకు మీకు 'స్నాక్స్ విత్ టీ' ఉంటాయి. అంతవరకూ రిలాక్స్ అండ్ ఎంజాయ్' అన్నాడు చౌహాన్.

మళ్లీ అందరూ గుంపులుగా విడిపోయారు.

కిరణ్ ఒక్కడే కూచుని గలగలలాడుతున్న చెట్లవైపు దృష్టి సారించాడు.

నిజంగా, గమనిస్తే ప్రకృతిలోని ప్రతి శబ్దంలో లయ ఉంది. పక్షి కూతలో లయ ఉంది. గాలి వీయటంలో లయ ఉంది. అలలు రేగటంలో లయ ఉంది. ఆకుల గలగలల్లో లయ ఉంది. మనిషి ఊపిరి కదలికలో లయ ఉంది. మరి జీవితంలో కూడా లయ ఉందా?

'ఏమిటీ... ఎప్పుడూ ఒంటరిగా ఆలోచిస్తూంటావు?' చనువుగా దగ్గరకు వచ్చాడు నవీద్.

నవీద్ వెనకాలే మిగతా కాశ్మీరీ వాళ్లంతా వచ్చారు.

వీళ్లల్లో కిరణ్ గమనించిన అంశం ఇదే. వీళ్ల ఆరుగురి కళ్లూ ఎప్పుడూ ఒకరినొకరిని అనుసరిస్తూ ఉంటాయి.

ఎక్కడనుంచి ఏ ప్రమాదం ముంచుకొస్తుందోనన్నట్టు బెదురుతూనే ఉంటారు వారు.

'బహుశా కాశ్మీర్‌లో ప్రస్తుతం నెలకొని ఉన్న పరిస్థితి ప్రభావమేమో ఇది' అనుకున్నాడు కిరణ్.

'నా ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదు. ఏం ఆలోచిస్తున్నారంతగా?' అడిగాడు నవీద్.

'ఏమీ లేదు' అన్నాడు కిరణ్.

'ఏమీ లేకపోతే మాతో ఎందుకు కల



## సగం తగ్గింది

**జాషువాకు** ఓ సారి జ్వరం వచ్చింది. కుటుంబ సభ్యులెవరో మందుతెచ్చి ఇచ్చారు. మర్నాడు 'తగ్గిందా.. జ్వరం ఎలా ఉంది?' అని వారడిగితే 'మందు సగం తగ్గింది.. జ్వరం బాగానే ఉంది' అని జవాబిచ్చారాయన.

అదేమిటంటే 'అవును.. మందు సీసాలో సగం తగ్గింది.. జ్వరం మాత్రం అలాగే ఉంది' అని ఆ పరిస్థితిలోనూ హాస్యధోరణినే ప్రయోగించారు.



వరు? '

'కలవకపోవటం అంటూ ఏమీ లేదు. మీరంతా యువకులు. మీ దృష్టి వేరు. మీ దృక్పథం వేరు. మనకు మాట్లాడేందుకు కలిసేందుకు పెద్దగా ఏమీ లేవు. మీ వయసువారితో ఉన్నంత స్వేచ్ఛగా, కలసినంత త్వరగా నాతో కలవలేరు కదా!' అన్నాడు కిరణ్.

'మీ హర్యానావాళ్ళు ఏదో అరుస్తున్నారు? ' అడిగాడు నవీద్ సూటిగా.

'వాళ్ళు అరిచేట్టు చేసింది మీరేగా? ' అంతే నిర్మొహమాటంగా అన్నాడు కిరణ్.

లేకపోతే వాళ్ళట్టి నీచులు. బీచిలో తాగారు. మన గ్రూప్‌లో ఆడపిల్లలున్నారు. పెద్దవాళ్ళున్నారు. అయినా కనీసం మర్యాద లేకుండా తాగారు. అందుకే వాళ్లని మా టెంట్‌లోకి రానివ్వలేదు. కోపం వస్తే రానీ' ఆగ్రహంగా అన్నాడు నవీద్.

కిరణ్ నవ్వాడు. 'మీరు భగవంతుడిని నమ్ముతారా? ' అడిగాడు.

'నమ్ముతాం'

'భగవంతుడు కరుణామయుడు. ఆయన సృష్టిలో పొరపాటు ఉండదు కదా!'

'ఉండదు'

'మరి భగవంతుడు నీచులను సృష్టిస్తాడా? '

వాళ్ళేమీ మాట్లాడలేదు.

'నవీద్... ప్రపంచంలో అందరూ మంచివాళ్ళే. ఎదుటి వ్యక్తి చెడుగా కనిపిస్తున్నాడంటే, మన దృష్టిలోనే ఎక్కడో లోపం ఉందన్నమాట. భగవంతుడి సృష్టిలో నీచమైనదేదీ లేదు. కాదంటావా? '

నవీద్ కాస్సేపు ఆలోచించాడు. 'మీరు ఇలా వాదిస్తే నేనేమీ అనలేను. కానీ వాళ్ళు మాత్రం నీచులే!'

కిరణ్ నవ్వాడు. 'ప్రతి వ్యక్తిలో మంచి చెడు ఉంటాయి నవీద్. మనం కాస్త చెడు కనబడగానే అంతా మంచి చూడటం మానేస్తాం. మనిషి పూర్తిగా చెడు అని ముద్ర వేస్తాం. కానీ జాగ్రత్తగా గమనించి చూస్తే ప్రతి మనిషిలో కొంత మంచి కొంత చెడు కనబడతాయి'

నవీద్ పెద్దగా నవ్వి 'మేం ఇంతవరకూ కలిసినందరిలోకీ మీరు భిన్నంగా ఉన్నారు. ఎందుకంటే అందరూ మమ్మల్ని కాశ్మీర్ గురించి రకరకాల ప్రశ్నలు అడిగారు. మీరొక్కరే మమ్మల్ని ఏమీ అడగలేదు' అన్నాడు.

'అడగటానికి ఏముంది? '

నవీద్ మాటల కోసం తడుముకున్నాడు.

కిరణ్ నవ్వి 'చూడు నవీద్... తెలియని వాళ్లకి తెలుసుకోవాలని ఉంటుంది. నాకు కాశ్మీర్‌లో పరిస్థితి తెలుసు. అడకత్తెరలో పోకలా నలుగుతున్న మీ పరిస్థితీ తెలుసు. ఒకవైపు తీవ్రవాదులు, మరోవైపు మిలటరీ వాళ్ళు... నడుమన మీరు మీ అస్తిత్వాన్ని కోల్పోతున్నారని తెలుసు. నేను మిమ్మల్ని ఏం అడగను? '

'అన్నీ తెలిస్తే మా సమస్యకు పరిష్కారం ఏమిటో చెప్పవచ్చుగా' కోపంగా అన్నాడు అంతవరకూ మౌనంగా ఉన్న అన్వర్.

'పరిష్కారం ప్రజల మనస్సులలోంచి రావాలి. మీరు పాశవిక శక్తికి తలవంచమని నిశ్చయించుకోవాలి. అప్పుడు ఏ శక్తీ మీ ఇష్టానికి వ్యతిరేకంగా ఏమీ చేయలేదు. కానీ ప్రజలు గొర్రెల్లాంటివారు. కర్ర ఎవరి చేతిలో ఉంటే వాడి మాట వింటారు. ప్రజలు గొర్రెల స్థాయినుండి మనుషుల స్థాయికి ఎదిగే వరకూ కాశ్మీర్ సమస్యే కాదు ఇతర ఏ సమస్య కూడా పరిష్కారం కాదు. ఒకటి పోతే మరొకటి వస్తుంది' నవీద్ మౌనంగా కిరణ్ భుజం మీద చేయివేశాడు.

'భాయ్... అందరూ మమ్మల్ని వింత జంతువుల్ని చూసినట్టు చూస్తున్నారు. కొందరు మమ్మల్ని దేశద్రోహులంటున్నారు. ప్రతి కాశ్మీరీ తీవ్రవాది అంటున్నారు. కానీ భాయ్, మాకు కూడా ప్రాణభయం ఉంటుంది కదా? '

"మీరు ప్రస్తుతం సురక్షితమే కదా. ఉన్నంతకాలం హాయిగా ఉండండి' అన్నాడు కిరణ్. ఆ తరువాత చాలాసేపు వాళ్ల మధ్య మౌనం రాజ్యం చేసింది.

'నాకు దేశంలోని ఇతర యువతీ యువకుల్ని చూస్తే అసూయగా ఉంటుంది' 'ఎందుకు? ' అని కిరణ్ అడగలేదు. కానీ నవీద్ చెప్పసాగాడు.

'వీళ్లకి రక్తపాతం తెలియదు. తుపాకీ మోతలు, బాంబుల ప్రేలుళ్లు తెలియవు. హాయిగా చదువుకుంటున్నారు. ప్రేమించుకుంటున్నారు. వీళ్లకి జీవితంలో బాధలు, భయాలు తెలియవు. మేం పుట్టటమే తుపాకీ గుళ్ల మోతలో పుడతాం. హ్యాండ్ గ్రెనేడ్లతో పెరుగుతాం. మాకు మరణం ఎప్పుడు ఏ వైపునుంచి ఎలా వస్తుందో తెలియదు. మా జీవితాల్లో శవాలు, చావులు తప్ప ప్రేమలు, పూజలు తెలియవు'

నవీద్ భుజంమీద చేయివేశాడు కిరణ్. 'నవీద్, మన జీవితం భగవంతుడు మనకు పెట్టే పరీక్షలా అనిపిస్తుంది. నిప్పులో కాలిన తరవాత కూడా స్వచ్ఛంగా మెరిసేదే బంగారం అవుతుంది. మళ్లీ మంచి రోజులొస్తాయి. మనమంతా కలసి కాశ్మీర్ మంచులో 'చాహెకోయి ముఝె జంగ్లీ కహే' అని దొర్లుతూ పాడే రోజులు వస్తాయి' అన్నాడు.

'నేను ఆ పాట కాదు; కిసీ న కిసీ సే కభీ న కభీ కహీన కహీ దిల్ లగానా పడేగా పాట పాడతాను' అన్నాడు నవీద్ నవ్వుతూ.

'డిన్నర్ రెడీ' పిలిచాడు చౌహాన్.




ఆ రోజు క్యాంప్‌ఫైర్ సరదాగా గడిచింది. బహుశా పరిచయాలు పెరగటంతో చనువులు పెరిగాయి. దాంతో దాదాపుగా అందరూ క్యాంప్‌ఫైర్‌లో పాల్గొన్నారు. కిరణ్ వాళ్లలో కలవలేకపోయాడు.

ఆకాశంలో చంద్రుడు దేదీప్యమానంగా వెలుగుతున్నాడు. తెల్లగా మెరుస్తూ చల్లని వెన్నెలలు దశదిశల ప్రసరిస్తున్నాడు.

వెన్నెల కిరణ స్పర్శకు పులకరించినట్టు ఉండి ఉండి కొబ్బరి ఆకులు కదలాడుతున్నాయి సన్నగా. ఆ కదలిక వల్ల సన్నగా ఉద్భవించిన శబ్దం, వెన్నల స్పర్శ సుఖాన్ని అనుభవిస్తూ చెట్లు నిట్టూరుస్తున్నట్టుంది.

కొబ్బరి ఆకుల సందుల నుండి నేలకు జాలువారిన వెన్నెల కిరణాలను భూమి ఆప్యాయంగా తాగేస్తున్నట్టుంది.

వెన్నెల తాగటంతోటే తానూ వెన్నెలయినట్టు భూమి అంతా చల్లటి వెలుగుతో తళతళలాడుతోంది.

పైనుంచి వర్షిస్తున్న వెన్నెల వెలుగులో తడిసి తానూ పునీతమైన భావన కలుగుతోంది కిరణ్‌కు. ఈ ప్రశాంతమయిన రాత్రి ప్రకృతి తన అందాలను ఆరబోసి వెన్నెల కిరణాలతో ఆహ్వానిస్తూంటే, ఎవ్వరూ పట్టించుకోవటం లేదు. బాధతో మూల్గింది కిరణ్ హృదయం.

అందరూ చప్పట్లు కొట్టుకుంటూ పెద్దగా పాటలు పాడుకుంటున్నారు. ఆకాశంలో సౌందర్య ప్రదర్శన అప్రతిహతంగా సాగుతోంది.

ఇంతలో కిరణ్ మదిలో ఒక ఆలోచన మెదిలింది.

వీణ ప్రకృతిని చూసి పరవశించేది. ఇప్పుడు వీణ పంచభూతాలలో మిళితమై ఈ హాయిని, ఈ సౌందర్యాన్ని చూస్తూ పరవశిస్తోందా? ఈ జాలువారే వెన్నెలలో వీణ ఆత్మ మిళితమై ఉందా? లేక పైనుంచి దోసిళ్ళకొద్దీ వెన్నెలను భువిపైకి దొర్లిస్తున్న వారిలో వీణ దోసిళ్ళు కూడా ఉన్నాయా?

తెల్లని మృదువైన వీణ వెన్నెలలో దోసిళ్ళు ముంచి పోస్తున్న దృశ్యం కిరణ్ హృదయనేత్రం ముందు కదలాడింది.

అతడికి తాను చదివిన కృష్ణశాస్త్రి కవిత్వంలోని పంక్తులు గుర్తుకు వచ్చాయి.

ఈ నడికి రేయి వెన్నెల యెద చలించు
పిలుపేదో, 'నా సఖా' యని వేగిరించు
అనలమై కాల్చు, నిశ్శబ్దమునె కలంచి
పరువులెత్తించు కడల నా బ్రతుకు నిపుడు!

కిరణ్ కళ్లల్లో నీళ్లు నిలిచాయి.

అయ్యయో! ఊర్వశీ విషాదార్ద్రమూర్తి
ఈ నిశీథాన నా హృదయాన నిండె
పూర్ణిమా శుభ్రయామిని బొగ్గవోలె
ఈ యెడదవోలె కాలిపోయినది నేడు!

అవును... ఇంత అందమైన వెన్నెల కూడా తన యెద కాలినట్టే తన మీదపడి బొగ్గు అయిపోతున్నదేమో!

ఎన్నో వెన్నెల రాత్రులు తాను, వీణ ఒకరి కళ్లల్లోకొకళ్లు చూసుకుంటూ, ఒకరి బాహువుల్లో మరొకరు సాంత్వన పొందుతూ గడిపారు. ఇప్పుడు తానొక్కడే ఈ వెన్నెలలో ఆమె జ్ఞాపకాలతో కాలిపోతున్నాడు. మాడి మసైపోతున్నాడు.

అందరూ ఒక్కసారిగా పెద్దగా అరవటంతో ఈ లోకానికి వచ్చి పడ్డాడు కిరణ్. 'క్యాంప్ ఫైర్' అయిపోయింది. బోర్న్‌వీటా అందింది.

'రేపు ఆరున్నరకల్లా సిద్ధం కావాలి. ఏడు కల్లా టెంట్లు శుభ్రం చేయాలి. ఎనిమిది కల్లా వేరే క్యాంపుకు ప్రయాణం కావాలి. మీమీ వాటర్‌బాటిల్స్ నిండా నింపుకోండి. రేపంతా మండుటెండలో బీచి ఒడ్డున నడవాల్సి ఉంటుంది. సో రాత్రి హాయిగా నిద్ర పొండి. గుడ్‌నైట్' అన్నాడు చౌహాన్.

కిరణ్‌కు ఆ రాత్రిని, ఆ వెన్నెలను వదలి టెంట్‌లోకి వెళ్లాలనిపించటం లేదు. కానీ తప్పదు. బయట ఒక్కడే ఉండేందుకు ప్రత్యేక కారణం లేదు. మనిషి జీవితమంతా ఇంతే. తనకు కావలసింది వేరు. సమాజం అతడినుంచి ఆశించేది వేరు. మనిషి సమాజానికి ఒదగటమో, లేక విప్లవం లేవదీసి సమాజాన్ని వంగదీయటమో జరుగుతుంది.

మౌనంగా టెంట్‌లోకి వెళ్లాడు కిరణ్.

కిరణ్ వెళ్లేటప్పటికే 'టెంట్ ఫైర్' జోరుగా సాగుతోంది. నవ్వులతో, కేరింతలతో టెంట్

## తస్మాత్ జాగ్రత్త

ఈ ఊబకాయాన్ని మోయలేక చచ్చిపోతున్నాం బాబూ... ఎంత తిండి తగ్గించినా ఈ పొట్ట ఇలా పెరిగిపోతోందేమిటి? అని వాపోయే వారి సంఖ్య నానాటికీ పెరిగి పోతోంది. పాశ్చాత్య దేశాలలో వీరి సంఖ్య మరీ అధికంగా ఉంది. ఒక అధ్యయనం ప్రకారం మన దేశంలోని నగరాల్లో నివసించే మహిళల్లో మూడోవంతుకు పైగా బరువు పెరిగిపోతున్నారు. అనేక దేశాల్లో అధిక బరువు తూగే వారి సంఖ్య అక్కడి జనా భాలో 20 శాతం పైగానే ఉంటోంది. ఇంగ్లండ్ జనాభాలో సగం మంది, అమెరికాలో 60 శాతం మంది ఏదో ఒక స్థాయిలో స్థూలకాయులే అన్న సంగతి అందర్నీ నోరెళ్ళ బెట్టించేంత నిజం. ఇంకో ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే తల్లిదండ్రులకంటే వారి పిల్లలు బరువు పెరిగిపోతుండడం పలు దేశాల్లో ఆనవాయితీ అయిపోతోంది. ఫాస్ట్ ఫుడ్ మహత్యం, అసలు వ్యాయామం లేకపోవడం దీనికి కొంత కారణం. ఈ యువ భారీకాయులందరూ భవిష్యత్ రోగాల్ని నిలువెల్లా మూటగట్టుకుంటున్నారంటూ వైద్యులు హెచ్చరిస్తున్నారు. తల్లిదండ్రుల తరంతో పోలిస్తే మారిన పరిస్థితుల కార ణంగా స్థూలకాయులైన పిల్లలు దాదాపు తొమ్మిదేళ్ళ ఆయుష్షును పోగొట్టుకుంటారని చెప్పవచ్చు. మధుమేహం, గుండెపోటు, ఇతర గుండెజబ్బులు వారి జీవన కాల పరిమి తిని తగ్గించేస్తాయి. అధిక కేలరీలు ఉండే ఆహారాన్ని అమితంగా తినడమే లావు పెరి గిపోవడానికి కారణమని మొన్నమొన్నటిదాకా భావించిన వైద్యులు జన్యుపరమైన కార ణాలు కూడ దీనికి కారణం అని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నారు. లావు పెరగడం వల్ల మహిళల్లో కలిగే హార్మోన్ల మార్పులు మరీ ఎక్కువ. వారిలో ఈ హార్మోన్ల అస మతౌల్యం వల్ల మూత్రపిండాల కేన్సర్ వచ్చే ప్రమాదం కూడ ఉంది. పొట్ట తగ్గించు కోవడం కోసం అమెరికన్లు రెండు మూడేళ్ళుగా గ్యాస్ట్రిక్ బైపాస్ అనే శస్త్రచికిత్సను ఆశ్ర యించడం ఎక్కువైపోయింది. వీరి సంఖ్య ఏడాదికి దాదాపు లక్షదాకా ఉంటోంది.

అదురుతోంది.

టెంట్‌లో పడుకున్న కిరణ్ దృష్టి టెంట్‌పై వర్షిస్తున్న వెన్నెల కిరణాలపైనే ఉంది. 'వెన్నెల తన మృదువైన కిరణాల వేళ్లతో టెంట్లపై తడుతున్నదేమో! బయ టకు రండి! ప్రాకృతికంగా ప్రదర్శితమౌ తున్న ఆనందాన్ని అనుభవించండి. అంటు న్నదేమో!'

కిరణ్ మనస్సులో సన్నగా బాధ మొదల యింది. ఆవల ప్రకృతి సౌందర్య ప్రదర్శన ఇంత సున్నితంగా జరుగుతూంటే, ఇక్కడ టెంట్లో ముసుగులు తన్ని తామేం చేస్తు న్నారు?

టెంట్‌లో నవ్వుల ఉరుములు ఉరి మాయి.

టెంట్ తలుపు క్రింది సందులో నుండి లోపలకు జారి రావాలని ప్రయత్నిస్తున్న వెన్నెల కిరణాల కొసలను చూస్తూ ఉండిపో యాడు కిరణ్.

★ ★ ★

ఏదో శబ్దం అవటంతో మెలుకువ వచ్చింది కిరణ్‌కు.

సమయం చూశాడు. ఉదయం నాలుగవు తోంది.

'ఎవరు? ' అడిగాడు కిరణ్.

'తివారి'

'ఎక్కడికి? '

'పెద్ద పనికి'

# గీజర్ పర్వతాలు



ఇది ఏ పార్కులోనో ఏ ఆధునిక కళాకారుడో సృష్టించిన వింత కళాఖండం కాదు. ఏ చిత్రకారుడో గీసిన అబ్‌స్ట్రాక్ట్ చిత్రం అంతకంటే కాదు. ప్రకృతి వింతల్లో ఇదో ఘనమైన వింత. చిత్రంలో కనిపించేది మూడు కొండల సముదాయం. శిఖర భాగంలో కోన్ ఆకారంలో రూపుదిద్దుకున్న ఈ కొండలు మామూలు కొండలు కాదు సుమా. వేడినీటిని వెదజల్లే గీజర్ పర్వతాలవి. అమెరికాలోని నెవాడా రాష్ట్రంలో గల నల్లరాతి ఎడారిలో ఈ పర్వతాలొక భాగం. అవి వెదజల్లే నీటిలోని కాల్షియం క్రమంగా ఘనీభ



వించి కోన్ రూపంలో ఈ పర్వతాలు రూపుదిద్దుకున్నాయి. రోజుకు 24 గంటలు చొప్పున, ఏడాది పొడుగునా ఇవి వేడినీటిని ఫౌంటెన్‌లా విరజిమ్ముతూనే ఉంటాయి. వీటికి చేరువలో ఉన్న రాళ్ళు, చిన్న చిన్న జలాశయాలు సలసల కాగుతూ ఉంటాయి. దూరంగా ఉన్న జలాశయాలు మాత్రం చల్లగా ఉంటాయి. నల్లరాతి ఎడారి భూగర్భంలోని ప్రవాహాల నీరే ఈ పర్వతాల నుంచి విరజిమ్మబడుతోంది. 20లక్షల సంవత్సరాల క్రితం ఈ ప్రాంతంలో అతిపెద్ద సరస్సు ఉండేదట.

'నేనూ వస్తానుండు' కిరణ్ లేచి టార్చి తీసుకున్నాడు.

ఇద్దరూ అడవిలోకి దారి తీశారు.

అంతా నిశ్శబ్దంగా ఉంది.

చంద్రుడు వెన్నెల ప్రసరించటంలో కూడా ఏదో తేడా ఉంది. తెల్లారే సమయం దగ్గర పడుతోందని కాబోలు చంద్రుడి వెన్నెలలో తెలుపు తీవ్రత తగ్గింది. అడవిలో దట్టమైన చెట్ల నడుమ నుండి ఉండి ఉండి కనిపిస్తున్నాడు చంద్రుడు. మిగతా అంతా దట్టమైన చీకటి.

ఏవేవో చురచుర, సురసుర శబ్దాలు వినిపిస్తున్నాయి.

'పాములుంటాయేమో!' భయం భయంగా అన్నాడు తివారి

అంత వరకూ ధైర్యంగానే ఉన్న కిరణ్‌కు అప్పుడు భయంగా అనిపించింది.

'మరీ లోపలకు వెళ్లొద్దు' అన్నాడు కిరణ్.

ఇంతలో ఎవరో చెట్లను తొలుస్తున్న శబ్దం వినిపించింది.

కిరణ్, తివారి ఇద్దరూ ఊపిరి బిగబట్టి ఆవైపే చూడసాగారు.

ఆ వొచ్చేది పులో, సింహమో, ఎలుగుబంటో. అన్న ఆలోచనలో ఇద్దరూ స్థాణువులయిపోయారు.

వారికి పరుగెత్తి పారిపోవాలన్న ఆలోచన కూడా రాలేదు. గుండె దడదడ కొట్టుకోసాగింది. ఇంతలో ఏదో నల్లటి ఆకారం చీకట్లోంచి, కొమ్మలను చీల్చుకుంటూ వచ్చి వాళ్ళ ముందు నిలబడింది.

దాన్ని చూస్తూనే ఇద్దరూ పెద్దగా కేకలు వేశారు.

వాళ్లను చూస్తూ అది కూడా కేకలు వేసింది.

దాని కేకలు వింటూనే వాళ్లిద్దరూ ప్రాన్పడి ఆగిపోయారు.

'ఎవరు? ' అడిగాడు కిరణ్.

'నేను దినేష్‌ని. మహారాష్ట్ర నటుడిని' అన్నాడా అబ్బాయి.

'పనయిపోయిందా? ' అడిగాడు తివారి.

'సుఖప్రసవం' నవ్వుతూ చెప్పాడు దినేష్.

'ఇంకా ఎవరయినా ఉన్నారా? ' అడిగాడు కిరణ్.

'లేరు, మిమ్మల్ని ఎలుగుబంట్లు, పులులు తప్ప మరేమీ చూసేందుకు రావు' అన్నాడు దినేష్ నవ్వుతూ.




బ్రేక్‌ఫాస్టయిపోయింది.

'టెంట్లు శుభ్రం చేయండి' ఆజ్ఞాపించాడు చౌహాన్.

హర్యాణా వాళ్లు ఎక్కడా కనిపించలేదు. రాజు, చంద్రలు లేరు. సందీప్ ఒక్కడే కనిపించాడు.

'సందీప్... టెంటు శుభ్రం చేద్దాం. రా' పిలిచాడు కిరణ్.

'నువ్వు చెయ్యి' అంటూ అక్కడ నుంచి తుర్రుమన్నాడు సందీప్.

కిరణ్ ఒక్కడే టెంట్ శుభ్రం చేస్తుంటే, చూసి చేతన్, సెలిన్‌లు పరుగెత్తుకు వచ్చారు.

ముగ్గురూ కలిసి టెంటు శుభ్రం చేశారు.

'బయలు దేరే టైం అయింది' పిలిచాడు చౌహాన్.

'నిన్న తివారి ప్రీతిని పెళ్లి చేసుకోమని అడిగాడట తెలుసా? ' నడుస్తూంటే అడిగాడు సెలిన్.

'అదేమిటి? ' ఆశ్చర్యంగా అడిగాడు కిరణ్.

'నిన్న తివారి, ప్రీతిని ఒంటరిగా చూసి పెళ్లి చేసుకోమన్నాడు. ఆమె 'ఛీ పో' అంటే నాకేం తక్కువయింది? నీకేం ఎక్కువ

ఉంది? అని ఏదేదో పిచ్చిపిచ్చిగా వాగాడట'

'నీకెలా తెలుసు?'

'ఆరోహీ చెప్పింది.'

'మొన్న చూశాడు. నిన్న పెళ్లికి ప్రపోజ్ చేసేశాడు. బాగుంది.' అన్నాడు కిరణ్

'ఆ సందీప్ కూడా చాలా రూడ్‌గా ప్రవర్తిస్తున్నాడట. ఆరోహీతో వాళ్లమ్మ ముందే పిచ్చిగా ప్రవర్తించాడట. తనతో ఫొటోలు దిగమని ఒత్తిడి చేశాడట'

'ఆరోహీ అంటే ఎంబిబియస్ అమ్మాయి కదా?'

'అవును. వీడు ఇంటర్ కూడా పాస్ కాలేదు. ఈ జార్ఖండ్ వాళ్లిద్దరూ అనాగరికుల్లాగా వ్యవహరిస్తున్నారు.' అన్నాడు సెలిన్.

ఇంతలో ముందు నడుస్తున్న అనూరాధ ఆగి 'సెలిన్' అని పిలిచింది.

'యెస్. ఆంటీ' అంటూ గబగబా ఆమె దగ్గరకు వెళ్లాడు సెలిన్.

'బ్యాగు బరువుగా ఉంది. పట్టుకుంటావా?' అడిగింది.

'ఇయ్యండి ఆంటీ' అంటూ ఆమె బ్యాగు తీసుకున్నాడు సెలిన్.

'చూడు... కూతురి ఆశ చూపించి పిల్లల్తో పని చేయించుకుంటోంది' కిరణ్ దగ్గరకు వచ్చి అన్నాడు మురుమ్కర్.

కిరణ్ నవ్వి ఊరుకున్నాడు.

పైకి ఎక్కటం కష్టంగా ఉంది. కానీ ఈ కష్టం నడక ఆరంభించిన మొదట్లో ఉంటుంది తప్ప రానురాను ఉండదని కిరణ్‌కి తెలుసు. అందుకనే పళ్ల బిగువున నడవసాగాడు.

నడిచేటప్పుడు మాటిమాటికీ కూచోవటం మంచిది కాదు. ఎందుకంటే కూచుని లేవటం కాళ్లపై ఒత్తిడి పెంచుతుంది. కాబట్టి విశ్రాంతి తీసుకున్నా నుంచుని విశ్రాంతి తీసుకోవాలి.

అందుకే కిరణ్ అగి, ఆగి నడుస్తున్నాడు.

'ఏమిటి? అప్పుడే అలసిపోయావా?' బెంగాలీ నుండి వచ్చిన బిస్వజిత్ అడిగాడు.

నవ్వాడు కిరణ్.

'అఖ్లచలో... అఖ్లచలో' అని పాడుకుంటూ ముందుకు వెళ్లిపోయాడు బిస్వజిత్.

కిరణ్ మళ్ళీ నడక ఆరంభించాడు.



వెనుక నవ్వులు వినిపించటంతో ఆగి చూశాడు.

చేతన్, ఆరోహీలు నవ్వుతూ మాట్లాడుతూ వస్తున్నారు.

ఆరోహిని వదలి వాళ్లమ్మ ముందు ఎందుకు వెళ్తోంది? వీళ్లిద్దరికీ ఏకాంతం కల్పిస్తోందా?

ఆ ఆలోచనను అక్కడే ఆపేశాడు కిరణ్

వాళ్లు తనని దాటి వెళ్తుంటే, వెళ్లమని చెయ్యి ఊపాడు.

'ఏం కిరణ్... స్పీడ్ తగ్గిపోయిందే? ' తనని దాటి వెళ్తూ, ఆగకుండా అడిగాడు రాజు. అతని వెంటే స్వప్న ఉంది. చెయ్యి ఊపి వెళ్లిపోయింది.

ఇంకాస్సేపటికి చంద్ర, కాశ్మీరాలు ఎదురుపడ్డారు.

చంద్ర నవ్వాడు. కశ్మీరా కిరణ్‌ని పలకరించింది.

'చూడండి మీ ఫ్రెండు నాతో పోటీ పడుతున్నాడు. నేను పొద్దుటి నుంచీ ఏమీ తినలేదు. తను కూడా ఏమీ తినలేదు' మెరుస్తున్న కళ్లతో చెప్పింది కశ్మీరా. కిరణ్ నవ్వి ఊరుకున్నాడు. అందుకేనన్నమాట పొద్దున్న టెంటు వెనక నక్కి నక్కి తిన్నాడు. చంద్ర అనుకున్నాడు.

చివరికి నవీద్ ప్రీతి, కిరణ్‌ని దాటి వెళ్తుంటే, 'త్వరగా నడవాలి' అంటూ వెళ్లిపోయాడు నవీద్.

ఎత్తు ఎక్కడం అయిపోయింది. క్రిందకు దిగటమే. వేగంగా దిగ సాగాడు కిరణ్. మలుపు తిరుగుతూ ఆగిపోయాడు.

ఆరోహి, సందీప్ చెంపమీద ఒక్కటిచ్చింది. సందీప్ ఏదో అనబోయాడు. అంతలో కిరణ్‌పై పడింది అతడి దృష్టి. గబగబా వెళ్లిపోయాడు. కిరణ్ ఆరోహి దగ్గరకు వచ్చాడు. ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ మౌనంగా కలసి నడవసాగారు.

'నేను పొద్దుటి నుంచీ ఏమీ తినలేదు. తను కూడా ఏమీ తినలేదు' మెరుస్తున్న కళ్లతో చెప్పింది కశ్మీరా. కిరణ్ నవ్వి ఊరు కున్నాడు. అందుకేనన్న మాట పొద్దున టెంటు వెనక నక్కి నక్కి తిన్నాడు.

## 15

బెనావ్‌లిమ్ బీచ్ నిజంగానే చాలా పెద్దది. అందరూ బీచ్ మొదట్లో-చివరగా కిరణ్, ఆరోహిలు వచ్చే వరకూ ఎదురుచూశారు.

అందరిని నిలిపి లెక్కబెట్టిన తరువాత గ్రూప్ లీడర్ చెప్పాడు. 'ఇక్కడి నుంచి మనం బీచ్ వెంబడి నడవాలి కాబట్టి ముందూ వెనక అయినా పరవాలేదు. బీచ్ చివర్లో మన క్యాంపు ఉంటుంది. అక్కడ కలుద్దాం' అంటూ గబగబా నడవసాగాడు. అప్పుడు గమనించాడు కిరణ్, అతనితో పాటు ఇద్దరూ అమ్మాయిలు వచ్చారు. అతడి అన్న కూతుళ్లని తరువాత తెలిసింది.

మళ్లీ గుంపులు గుంపులుగా విడిపోయారు.

కిరణ్ ఒక్కడే నెమ్మదిగా నడవసాగాడు. ఒకవైపు విశాలమైన సముద్ర దిగంతాల వరకూ నీరే. మరోవైపు ఇసుక.

సముద్రాన్ని చూస్తుంటే ఏవేవో విచిత్రమైన ఆలోచనలు కలగసాగాయి కిరణ్ మనస్సులో.

ఒంటరిగా నడుస్తున్న కిరణ్, మురుమ్కర్ పిలవటంతో ఆగిపో

యాడు.

ఇసుకలో అలసిపోయి కూచుని ఉన్నాడు మురుమ్కర్.

'ముసలివాడినయిపోయాను' అన్నాడు మురుమ్కర్, పక్కనే కూచుంటున్న కిరణ్‌తో. కిరణ్ నవ్వాడు. 'నా పరిస్థితి కూడా అలాగే ఉంది' అన్నాడు.

'నేను ఒకప్పుడు కవితలు రాసేవాడిని. జీవితమంతా కవితలు రాస్తూ గడిపేయాలని అనుకున్నాను. కానీ ఒక్కసారి బాధ్యతలు మీద పడ్డాయి. కవిత్వం పోయింది. భావుకత పోయింది. ఇలా సముద్రంవైపు చూస్తుంటే నాకు మనిషి జీవితం గుర్తుకువస్తుంది. సముద్రంపై ఓడలు ప్రయాణిస్తాయి. ఒకప్పుడు రాజులు యుద్ధాలు చేశారు. సముద్రాలపై వంతెనలు నిర్మించారు. కానీ... సముద్రంలో ఎటువంటి మార్పు రాలేదు. అన్నీ సముద్ర గర్భంలో కలసిపోతాయి. అలాగే మనిషి జీవితం కూడా. ఎన్నెన్నో ఆలోచనలు వస్తాయి. ఎన్నో కోరికలు చెలరేగుతాయి. ఎన్నో కలలు కంటాం కానీ ఆఖరికి మిగిలేదేమిటి'?

అతని మాటలలో తాత్వికత కిరణ్‌కు అర్థమయింది. అంతలో సెలీన్ వచ్చి కూచున్నాడు. వాళ్ల పక్కన 'ఏమైంది, కూలీపని అయిపోయిందా?' నవ్వుతూ అడిగాడు మురుమ్కర్

సెలిన్ నవ్వాడు.

'అనురాధ బరువు ఎత్తలేకపోతోంది. అందుకని ఆమె బ్యాగు నేను పట్టుకున్నాను. ఇందాక నేను, చేతన్ ఆమె బ్యాగులో వస్తువులు సగం సగం పంచుకున్నాం' చెప్పాడు.

'ఆమె, ఆమె కూతురు కలసి రెండు వేర్వేరు బ్యాగులు కాదు, ఒక్క బ్యాగే తెచ్చుకోవాల్సింది' అన్నాడు మురుమ్కర్.

'ఈ సందీప్, తివారీలు ఇప్పుడు ఆరోహి వెంట పడ్డారు. ఆమెని సతాయిస్తున్నారు.' చెప్పాడు సెలిన్.

'బాల్యంలో జీవితం గురించి ఆలోచన ఉండదు. యవ్వనంలో సెక్స్ తప్పించి మరేమీ కనబడదు. వృద్ధాప్యం వచ్చేసరికి జీవితం ఏమిటో తెలుస్తుంది. కానీ తప్పు సరిదిద్దుకునే సమయం ఉండదు' దిగంతంలోకి చూస్తూ అన్నాడు మురుమ్కర్.

'నిజం చెప్పారు. మన బతుకు గుడ్డి బతుకు' అన్నాడు సెలీన్.



'మై పల్ దో పల్ కా షాయర్ హూ' చిన్నగా పాడేడు మురుమ్కార్.

'మీరు బాగా పాడుతున్నారు. క్యాంప్‌ఫైర్‌లో పాడలేదేమిటి ఇంతవరకూ? ' ఆశ్చర్యంగా అడిగాడు సెలిన్.

'నాకు అతి ఇష్టమైన పాట అది. ఎందుకో తెలుసా? ఆ పాటలో మొత్తం మన జీవిత తత్వాన్ని ఇమిడ్చాడు కవి సాహిర్' అన్నాడు మురుమ్కార్.

'దాన్లో జీవిత తత్వం ఏముంది? ఒక క్షణం కోసం మన జీవితం అని చెప్తాడు కవి' వాదనకు దిగాడు సెలిన్.

నవ్వాడు మురుమ్కార్ సినిమాలకొక పరమార్థం, సమాజంలో ఓ ప్రయోజనం ఉన్న కాలంనాటి పాట అది. యవ్వనంలో మనకు భవిష్యత్తుపై ఆలోచన ఉండదు. జీవితం క్షణికం అనుకుంటాం. ఈ క్షణమే జీవితం అనుకుంటాం. అందినదంతా అనుభవించేయాలని ఆత్రపడతాం. కానీ ఎదుగుతున్నకొద్దీ, జీవితాన్ని అనుభవిస్తున్నకొద్దీ మన జీవితం క్షణికం కాదని అర్థమౌతుంది. ఎందుకంటే మన శరీరం మనతో అదృశ్యం అవచ్చు కానీ మనం మన సంతానం ద్వారా జీవిస్తూనే ఉంటాం. ఇలా మన వంశం నిలచి ఉన్నన్ని తరాలు మనం సజీవంగా ఉంటాం. కాబట్టి మనం 'పల్ దో పల్ మేరీ కహానీ హై' అనలేం.

'నిజమే' అప్రయత్నంగా అన్నారు సెలిన్, కిరణ్ లిద్దరూ.

'అందుకే సినిమాలో ఆరంభంలో యవ్వనంలో ఉన్నప్పుడు ఈ పాట పాడతాడు హీరో. సినిమాలో చివర్లో తన సంతానం వివాహ సమయంలో ఇదే పాటను 'మై హర్ ఎక్ పల్‌కా షాయర్ హూ' అని పాడతాడు. అంటే అర్థమయిందా, జీవితం క్షణకాలం అని భావించే అపరిపక్వ స్థాయి నుంచి తనకు మరణం లేదు. తన సంతానం ద్వారా తాను చిరంజీవి అవుతాడు అన్న పరిణతి సాధించటం మనిషి జీవిత పరమార్థం. ఆ పరిణతి సాధించిన మనిషి అశాశ్వతాల వెంట పడడు. తాత్కాలికాల కోసం ఆశ పడడు. ఎందుకంటే ఈనాటి తన ప్రతి పని ప్రభావం భవిష్యత్తులో అనేక తరాలపై ఉంటుందన్న ఆలోచన ఉంటుందతనికి!



**తన సంతానం ద్వారా తాను చిరంజీవి అవుతాడు అన్న పరిణతి సాధించటం మనిషి జీవిత పరమార్థం. ఆ పరిణతి సాధించిన మనిషి అశాశ్వతాల వెంట పడడు. తాత్కాలికాల కోసం ఆశ పడడు.**



ఒక అల పెద్దగా తీరాన్ని తాకింది.

సెలిన్, కిరణ్ చాలాసేపు ఏమీ మాట్లాడలేకపోయారు.

మురుమ్కార్ మాటల వల్ల తనలో తనకే తెలియని ద్వారమేదో తెరచుకుంటున్న భావన కలిగింది కిరణ్‌కు.

'మనం సినిమా పాటలని తేలికగా తీసేస్తాం. కానీ ప్రతిభావంతులయిన కవులు తమ ప్రజ్ఞా పాటవాలతో సినీ పాటలకు సాహితీ గంధం పూశారు. జీవిత సత్యాలను, తాత్విక సత్యాలను నిక్షిప్తపరచారు. అందుకే ఈనాటికీ పాత పాటలు సజీవంగా నిలుస్తున్నాయి. కొత్త పాటలు వస్తున్నాయి పోతున్నాయి'

మళ్ళీ లేచి నడవటం ఆరంభించారు.

కాస్త దూరం మౌనంగా నడచిన తరువాత మురుమ్కర్ అడిగాడు చేతన్‌ని 'మీ ఫ్రెండు సచిన్ ఏమైనా సాధించేట్టున్నాడా? '

'వాడి మొహం.వాడు అమాయకుడు. మొన్ననే వాడు ఓ పెద్ద అఫైర్ నుంచి బయటపడ్డాడు. ఆఫీసులోనే ఓ కొలీగ్‌ని ప్రేమించాడు. వీడు ప్రేమ నిజమనుకున్నాడు. ఆమె నటించింది. వీడికన్నా పెద్ద పొజిషన్‌లో ఉన్నవాడు కనబడగానే వాడివైపుకు మళ్ళింది. మనవాడిని లెక్క చేయలేదు. కొన్నిరోజులు పిచ్చివాడిలా తయారయ్యాడు. మనుషుల్లో పడతాడేమోనని ఇలా ట్రెక్కింగ్‌కి పట్టుకొచ్చాను. అమ్మాయిలంటేనే భయపడుతున్నాడు. వ్యవహారం నడిపేంత తెలివి లేదు వాడికి' సిగరెట్ వెలిగించాడు సెలిన్.

మురుమ్కర్, సెలిన్ మాట్లాడుతూ నడవసాగారు.

కిరణ్ వెనకబడ్డాడు. అతడికి సముద్రాన్ని చూస్తుంటే కదలబుద్ధి కావటంలేదు. కాస్త ముందుకు వెళ్ళేసరికి జన సంచారం ఆరంభమయింది. బీచ్‌లో హోటళ్ళు రిసార్టులు కనబడసాగాయి. వాటితోపాటు వాటి ముందు రంగుల గొడుగుల క్రింద ఫోల్డింగ్ చైర్లలాంటి వాటిపై బికినీలతో మాత్రమే పడుకుని ఉన్న విదేశీ వనితలు వివిధ భంగిమల్లో కనబడసాగారు.

తమ ట్రెక్కింగ్‌లో వాళ్ళు అనేకులు వాళ్లని దగ్గరగా వెళ్ళి చూడటం గమనించాడు.

ఒకవైపు సముద్రం అనంతమైన కెరటాల బాహువులతో తనలోకి ఆహ్వానిస్తున్నట్టుగా ఉంది.

అంతులేని నీలిమను చూస్తుంటే కిరణ్‌కు సముద్రంలోకి నడుస్తూ వెళ్ళిపోవాలనిపిస్తోంది.

మరో వైపు ఎంత వద్దనుకున్నా విదేశీ వనితల నగ్న సౌందర్యం దృష్టిని ఆకర్షిస్తోంది. బహుశా మనిషి జీవితం మొత్తం అతనిలోని ఆధ్యాత్మికతకు, పశుత్వానికి నడుమ సంఘర్షణేనేమో అనుకున్నాడు. అతను కెరటాలలో నడవసాగాడు. సముద్రం ఉప్పొంగి వచ్చి తాకి, కాలికింద నుంచి ఇసుకను లాక్కు వెళ్తొంటే, ఇసుకతో పాటు తనకూ సముద్ర గర్భంలోకి వెళ్ళి అక్కడ దాగున్న అద్భుతాలనూ, వింతలనూ గ్రహించాలని ఉంది.

ఏదో శక్తి తనను సహస్ర బాహువులతో తనవైపు ఆకర్షిస్తున్నట్టు తోస్తోంది. సముద్రంలో నిరంతరం ఎగి



## శతాధిక జంట



వాళ్ళూ దంపతులే అనంటే అందులో ఆశ్చర్యకరమైంది ఏముంది అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఉంది అని టక్కున సమాధానమిస్తారు ఆ దంపతులు. మేం గిన్నెస్ రికార్డు సృషించామోయ్ అని కూడా ఆ సమాధానానికి జోడిస్తారు. ఇంతకీ విషయమేమిటంటే ఆ దంపతులు ఎనభయ్యో వివాహ వార్షికోత్సవం జరుపుకున్నారు. బ్రిటిన్‌కు చెందిన పెర్సీ, ఫ్లారెన్స్ ఆరోస్మిత్ అనే ఆ దంపతుల వయసు 105, 100 సంవత్సరాలు. ఎనభై సంవత్సరాల క్రితం, 1925లో వివాహబంధంతో ఒక్కటయ్యారు. ఇన్నేళ్ళుగా ఆ బంధాన్ని కాపాడుకుంటూ వస్తున్నారుగా మరి; అది రికార్డు కాదా అని గిన్నెస్ వాళ్ళు నమోదు చేసుకున్నారు. "మేం ఇప్పటికీ కలిసి ఉండడం మాకెంతో ఆనందదాయకంగా ఉంది. ఇప్పటికీ మాకొకరి మీద మరొకరికి ప్రేమ తరగలేదు అని ఫ్లారెన్స్ ఆరోస్మిత్ చెప్పింది. మీ వివాహ విజయ రహస్యమేమిటి అనడిగితే "మేం తరుచుగా పోట్లాడుకోం. పడగ్గదిలో ఎడమొగం పెడమొగంగా ఉండం. ఒకవేళ పోట్లాడుకున్నా సారీ చెప్పుకోవడానికి బిగదీసుకుపోం" అని కూడా చెప్పింది. ఈ శతాధిక వృద్ధజంటకు ముగ్గురు పిల్లలు, ఆరుగురు మనమలు, మరో తొమ్మిది మంది మునిమనమలు ఉన్నారు.

## ఒంటె పాలతో చాక్లెట్



చాక్లెట్ల తయారీకి ఆ పాలు కూడా చక్కటి ముడిసరుకేలెండి. పైపెచ్చు నాణ్యమైనవేనండి అనంటూ తెగ సంబరపడిపోతున్నారు ఆస్ట్రియాకు చెందిన చాక్లెట్ల కంపెనీ వారు. ఒంటె పాలతో రుచికరమైన కొత్తరకం చాక్లెట్లు తయారు చేయడానికి అల్ అయిన్ అనే అరబిక్ ఒంటెల ఫార్మ్‌తో ఆ కంపెనీ చేతులు కూడా కలిపింది. ఈ ఒంటెల ఫార్మ్ అందజేసిన పాలతో చాక్లెట్లు తయారు చేయడానికి ఆరు నెలలు పట్టింది. ఆవుపాలకు ఒంటెపాలు ప్రత్యామ్నాయమే కాకుండా, వాటిలో కొవ్వు తక్కువని, తియ్యగా ఉంటాయని చాక్లెట్ల కంపెనీ అధినేత జోహన్ జార్జ్ హాక్‌లీట్‌నర్ ఘంటాపథంగా చెబుతున్నాడు. యుఎఇలోని ఒంటెల డెయిరీఫార్మ్ అందజేసిన పాలను, యెమన్ నుంచి సేకరించిన తేనెను కలిపి ఎంతో రుచికరమైన చాక్లెట్లు తయారు చేసినట్లు ఆయన చెప్పారు. అరబ్ ఎమిరేట్స్‌లో ఈ చాక్లెట్ల ఫ్యాక్టరీని నెలకొల్పాలని ఆయనగారి కంపెనీ సన్నాహాలు చేస్తోంది. 2006 నుంచి ఆ ఫ్యాక్టరీ పనిచేస్తుందట.

## తెలివెక్కువైనా...




తెలివి ఎక్కువైనా కష్టమేనని వాపోతోంది ఆ బల్గేరియా మహిళ. ఆమె వాపోవడంలో న్యాయం ఉంది. ఎందుకంటే డానియెలా సిమిడ్చీవా అనే ఆ మహిళ ప్రపంచంలోనే అత్యంత తెలివిమంతురాలిగా గుర్తింపు పొందింది. అదీ ఆషామాషీగా కాదు. ఐదు మాస్టర్ డిగ్రీలు ఆమె సొంతం. ఆమె ఐక్యూ 200. ఇది, రెండుసార్లు నోబెల్ బహుమతిని గెలుచుకున్న మొట్టమొదటి మహిళ మేరీక్యూరీ ఐక్యూతో సమానం. ఇంత తెలివిమంతురాలైనా ఆమె నిరుద్యోగి. పాపం, ఎవరూ ఉద్యోగమివ్వక అల్లాడిపోతోంది. నలభై నాలుగేళ్ళు చదువులో గడిపాను. ఆర్థికశాస్త్రం, సామాజిక శాస్త్రం, విద్యారంగానికి సంబంధించి బ్రిటన్, బల్గేరియా యూనివర్సిటీల నుంచి మాస్టర్ డిగ్రీలు సంపాదించాను. ఇండస్ట్రియల్ ఇంజనీర్‌గా, ఎలక్ట్రికల్ ఇంజనీర్‌గా, ఇంగ్లీషు టీచర్‌గా క్వాలిఫై అయినా నాకీ గతేంటి అని వాపోతోంది. బల్గేరియాలో ఉద్యోగాలిచ్చే వారికి తెలివైన ఉద్యోగులు అవసరం లేదనుకుంటా. గతంలో నేను ఉద్యోగం చేసినప్పుడు కూడా నా నెల జీతం 190 డాలర్లు మాత్రమే అని చెప్పి గుడ్లనీరు కుక్కుకుంది.

## లాయర్‌గారి భారీ సంపాదన



ఆ జర్మన్ లాయర్ గారు గంటకు సంపాదించిన మొత్తం వింటే కళ్ళు తిరుగుతాయి. ఆయన గారికి గంటలోపు పనికి అక్షరాలా మూడు లక్షల పౌండ్ల ఫీజు ముట్టింది. దాంతో ఆయన గిన్నెస్ రికార్డుల కెక్కేశాడు. ఆ లాయరు గారికి ఓ వృద్ధ క్లయింట్ ఉన్నాడు. ఆయన టాక్స్ డిక్లరేషన్ సమర్పించే సమయంలో తన ఆదాయం 11వేల యూరోలని పేర్కొన్నాడు. దాన్ని తర్వాత 17వేల యూరోలుగా సవరించాడు. అయితే పన్నుల కార్యాలయపు కంప్యూటర్ సిబ్బంది ఆయనగారి ఆదాయాన్ని 110 కోట్ల 17వేల యూరోలుగా నమోదు చేశారు. దాంతో ఆయనగారు జార్గెన్ గ్రాఫ్ అనే తన లాయరు దగ్గరకెళ్ళి మొరపెట్టుకున్నాడు. 17వేల యూరోల ఆదాయంతో 28 కోట్లకు పైబడిన కంపెనీని తన క్లయింటు ఎలా నడుపుతాడంటూ పన్నుల కార్యాలయం సిబ్బందిని నిలదీస్తూ ఘాటుగా ఒక లేఖ రాశాడు ఆ లాయర్. దాంతో వాళ్ళు తమ తప్పు తెలుసుకుని ఒప్పుకుని సదరు లాయర్ గారి వృద్ధ క్లయింటు ఆదాయ వివరాలను సవరించారు. జర్మనీ చట్టాల ప్రకారం చేసిన తప్పుకు దండనగా తనకు ఫీజు భారీగా చెల్లించాలనే లాయర్ వాదనతో ఏకీభవించిన కోర్టు ఆయన గారికి నాలుగు లక్షల నలభైవేల యూరోలు చెల్లించాలని తీర్పు చెప్పేసింది. పన్నుల కార్యాలయం లబోదిబోమంటూ ఆ మొత్తాన్ని చెల్లించక తప్పింది కాదు పాపం!

సిపడే అలలు మనిషి కోరికల్లా అనిపించసాగాయి. ఒక అల ఎగసిపడి తీరాన్ని తాకుతోంది. అది వెనక్కు మళ్ళుతుంటేనే మరో అల దూసుకువస్తూ వెనక్కి వస్తున్న అలలోని నీళ్లను కలుపుకుని తీరాన్ని మరీ వేగంగా తాకుతోంది.

మనిషి కోరికలూ అంతే. ఒక కోరిక తీరకముందే మరో కోరిక పరుగిడుతూ వస్తుంది. నిరంతరం ఎగసిపడే ఈ కోరికలు తీరాన్ని కోసినట్టు మనిషినీ కోస్తాయి. ఇసుకను రాపిడితో సన్నగా చేసినట్టు, కోరికల రాపిడితో మనిషి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుతాయి.

కిరణ్ ఇసుకలో కూర్చుండిపోయాడు. అతడికి కదలాలని లేదు.

'ఇక్కడే కూర్చుండి పోయారు. కదలాలని లేదా? ' చనువుగా పక్కన కూర్చుంటూ అడిగింది ప్రీతి.

'ఇంత అందమైన ప్రకృతిని చూస్తే ఎవరికి కదలాలనిపిస్తుంది? ' ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

ఎదురుగా ఉన్న సముద్రంలోని నీలిమ ఆమె కళ్లల్లో ప్రతిఫలిస్తున్నట్లు తోచింది. ముఖంపై పడుతున్న వెంట్రుకలను వెనక్కు తోసుకుంది ప్రీతి.

'మీరెవ్వరితో ఎక్కువగా మాట్లాడరెందుకని? '

'మాట్లాడేందుకు ఏమీ లేనందుకు. ఏమీ లేనప్పుడు ఉట్టిగా ఏదో మాట్లాడి గొడవలు సృష్టించుకునే బదులు, మౌనంగా ఉండటం మేలు కదా? '

నవ్వింది ప్రీతి.

'అయినా అందరూ మీ వెంట పడుతున్నారు. నేను మాట్లాడితే ఎంత? మాట్లాడకపోతే ఎంత? ' అన్నాడు కిరణ్ మళ్ళీ.

'నాకు నా వెంట తిరిగే వాళ్ళంటే అసహ్యం' అంది ప్రీతి.

'అది సర్వ సాధారణం. అందమైన అమ్మాయి చుట్టూ మగవాళ్లు తిరుగుతారు. అటువంటి అమ్మాయికి మగవాళ్ళంటే అసహ్యం. అందవిహీనమైన అమ్మాయికి మగవాళ్లు తన చుట్టూ తిరగాలని కోరిక ఉంటుంది'

'నాకు మా నాన్న అంటే అసహ్యం' తీవ్రంగా అంది ప్రీతి.

కిరణ్ ఆమెవైపు పరిశీలనగా చూశాడు.

'అవును, నేను ఆడపిల్లనని మా నాన్నకు నచ్చను. ఒక్క రోజు కూడా నన్ను దగ్గర తీయలేదు. ఎప్పుడూ నన్ను తిడుతూంటాడు. డిగ్రీ ప్యాసయ్యే వరకూ కొట్టేవాడు. రీసెర్చి ఆరంభమైన తరువాత తగ్గించాడు. నేనెవ్వరితో మాట్లాడినా అనుమానంగా చూస్తాడు. కనబడ్డ ప్రతివారి వెంబడి పడిపోతాననుకుంటాడు. రాత్రి ఆలస్యం అయితే తిట్లు. ఇంట్లో ఉంటే తిట్లు. అందుకే కాస్త రిలీఫ్‌గా ఉంటుందని ట్రెక్కింగ్‌కు వచ్చాను. దీనికి కూడా నాన్న అభ్యంతరాలు పెట్టాడు. నేను వినలేదు. ఏం చేస్తావో చేసుకో అని వచ్చేశాను. అందుకే నాకు మా నాన్నంటే అసహ్యం. ఇక్కడకు వస్తే ప్రతివాడూ వెంట పడేవాడే. ఇప్పటికి ఇద్దరు ప్రపోజ్ చేశారు. ఆడపిల్లంటే చులకన. అడగగానే ఎగిరి గంతేస్తాననుకుంటారు. ఈడియట్స్. 'ఐ హేట్ ఆల్ ఆఫ్ దెమ్' అంది ఆవేశంగా.

మనం మనిషిని పైపైన చూసి ఒక నిర్ణయానికి వచ్చేస్తాం. కానీ పైన కనబడే అందమైన శరీరాన్ని దాటి, మెదడులోకి వెళ్లి చూస్తే పైన కనబడే మనిషికీ, లోపల ఉండే మనిషికీ పోలికే లేదని స్పష్టమౌతుంది.

మనిషి మనసులో ఏముందో గ్రహించగలిగితే ఎంత అద్భుతంగా ఉంటుంది! అందమైన అమ్మాయిని చూసిన ప్రతి మగవాడి మనసూ గిలిగింతలు పొందుతుంది. అందమైన ఆలోచనలు చేస్తుంది.

కానీ అమ్మాయి మనసులోని గాయాలను, ఆశలను, విషాదాలను గ్రహించగలిగితే! ఈ

ప్రపంచమే మరో రకంగా ఉంటుంది.

'వెళ్దామా?' అడిగింది ప్రీతి లేస్తూ.

'పదండి' ఇద్దరూ మౌనంగా తీరం అంచులో నడవసాగారు.

'ఏయ్ ప్రీతీ' పిలిచాడు నవీద్. అతడు అప్పుడే బార్ నుంచి బయటకు వస్తున్నాడు.

ప్రీతి ఆగింది.

కిరణ్ ముందుకు నడిచాడు.




సముద్రంవైపు చూస్తూ నడుస్తున్నాడు కిరణ్.

ఎండ వేడి పెరుగుతున్నకొద్దీ సముద్రంలో నీటి రంగు మారసాగింది.

విదేశీయులు హాయిగా బీచ్‌లో సేద తీరుతున్నారు. పడుకునేవాళ్లు పడుకున్నారు. పుస్తకాలు చదివేవారు చదువుకుంటున్నారు.

కొందరు స్థానికులు వాళ్ల చుట్టూ చేరి ఏవేవో వస్తువులు అమ్మాలని యత్నిస్తున్నారు.

సముద్రం ఒడ్డున కొందరు విదేశీ పిల్లలు ఆడుకుంటున్నారు. వారు కూడా నగ్నంగానే ఉన్నారు.

ఒక ఆలోచన కిరణ్‌ను బలంగా తాకింది.

తమ జీవన విధానంలో నగ్నత్వం అనేది ఒక రహస్యం. ఒక స్త్రీ కానీ పురుషుడు కానీ బహిరంగంగా బట్టలు లేకుండా ఉండరు. అది తమ నరనరాన జీర్ణించుకుపోయింది.

విదేశీయుల సంస్కృతిలో నగ్నత్వం అన్న దానికి పెద్ద ప్రాముఖ్యం లేదు. వారి జీవన విధానంలో అది స్వాభావికమైన అంశం. తల్లిదండ్రులు, పిల్లల ముందు కూడా దాదాపు అర్ధనగ్నంగానే ఉంటారు.

ఇసుకలో గూడు కట్టుకుంటూ ఆడుకుంటున్న పిల్లల ఒంటిపై దుస్తులు లేవు.

బీచ్‌లో రిలాక్సవుతున్న వాళ్లమ్మ బికినీలోనే ఉంది. తల్లి, తండ్రి, కొడుకులు కలసి ఈత కొడుతున్నారు.

ఎవరైనా అర్ధనగ్నంగానో, మూడొంతులు నగ్నంగానో ఉన్నా ఎవరూ అందుకే పట్టించుకోరు. ఎదుటివారి ముందు నగ్నంగా ఉండేందుకు కూడా వారు ఇబ్బందిపడరు. కానీ తమకు అది అలవాటు లేదు.

అందుకే నగ్న శరీరం కనబడగానే కళ్లప్పగించేస్తారు. తమ జీవితంలో రహస్యంగా ఉన్న విషయం ఇక్కడ బహిరంగంగా ప్రదర్శితమవుతుంటే వెర్రెక్కిపోతారు.

నడుస్తున్న కిరణ్‌కు మరో ఆలోచన వచ్చింది.

విదేశీయులు ఎక్కడికి వెళ్లినా వాళ్లు వాళ్లలాగే ఉంటారు. ఇలాగే రిలాక్సవుతారు. తక్కువ దుస్తులతో తిరుగుతారు.

అదే తాము, వేరే దేశం వెళ్తే వారి పద్ధతులను పాటించాలని తాపత్రయపడతారు. వారిలా దుస్తులు వేసుకోవాలని, వారిలా ప్రవర్తించాలని ఆత్రుతపడతారు. వారు మనదేశం వచ్చినప్పుడు కూడా వాళ్లకి తగ్గట్టు నడవాలని ప్రయత్నిస్తారు.

ఎందుకిలా?

ఇందుకు కిరణ్‌కి ఒకే కారణం కనిపిస్తోంది.

తాము బానిసత్వంలో ఉన్నవారు. భౌతికంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందినా, మానసికంగా ఇంకా బానిసత్వంలోనే ఉన్నారు. అందుకే ఎటువెళ్తే అక్కడి వారిని అనుసరించి తమ గొప్ప చాటుకోవాలని ప్రయత్నిస్తున్నారు. వాళ్లలా అవటం గొప్ప కార్యంలా భావిస్తున్నారు.

అదే ఈ విదేశీయులు బానిసలు కారు. వారు పాలకులు. వారికి అమితమైన ఆత్మ

విశ్వాసం ఉంది. అందుకే ఎక్కడికి వెళ్లినా తమ ప్రత్యేకతను నిలుపుకుంటారు. ఏ ప్రాంతానికి వెళ్లినా తమలాగే ఉంటారు తప్ప ఆ ప్రాంతపు పద్ధతులను పాటించరు, సంప్రదాయాలను గౌరవించరు.

ఆలోచిస్తూ నడుస్తున్న కిరణ్‌ను చేతన్ తట్టి ఆపాడు.

'నువ్వు మాతో నడువు' అభ్యర్థించాడు.

ప్రశ్నార్థకంగా చూశాడు కిరణ్ అతడివైపు.

'ఈ జార్ఖండ్ వాళ్లు చంపేస్తున్నారు. ఆరోహీని వదలటంలేదు. వాళ్లమ్మ పక్కన ఉండగానే వెంట పడుతున్నారు. నువ్వు నేను సెలిన్ అందుకే ఆరోహీతో కలసి నడుద్దాం' అన్నాడు చేతన్.

కిరణ్ తల ఊపాడు.

నిజమే, వీళ్లముందు తూలుతూ నడుస్తున్నారు సందీప్, తివారీలు... అప్పుడప్పుడు వెనక్కి తిరిగి కొరకొర చూస్తున్నారు.

కిరణ్ మనస్సు పాడయిపోయింది.

మానవ సంబంధాలలో అతి సున్నితమైనది, అత్యంత అద్భుతమైనది స్త్రీ, పురుష సంబంధం.

దాన్ని ఎంత జుగుప్సాకరంగా చేసేశారు! ఒక అమ్మాయికి వాళ్ల అమ్మతో పాటు, మరో ముగ్గురు తోడు నడవాల్సి వస్తోంది!

అనంతమైన నీటివైపు చూశాడు కిరణ్.

అది తనని చూసి తళతళ నవ్వినట్టు అనిపించింది.

'ఎందుకని? '

దేవుడు ఎంత ఔన్నత్యం సృష్టించాడో, అంత నైచ్యాన్నీ సృజించాడు. మానవుడిని భూమిపై పడేసి అన్ని జీవులలోకి తెలివైన వాడివి. మంచి చెడ్డ తెలిసినవాడివి. ఇష్టాయిష్టాలున్నవాడివి నువ్వే అన్నాడు.

అప్పుడు మనిషి తన తెలివిని ఉపయోగించి మంచిని గ్రహించాడు. దానితోపాటు నైచ్యాన్నీ ఎన్నుకున్నాడు.

ఒకవైపు అనంత సాగరం, మరోవైపు అంతులేని ఆకర్షణలు ఉంటే, అందరూ ఆకర్షణల వైపు పోతున్నారు తప్ప, సాగర లోతుల వైపు దృష్టి కూడా సారించటం లేదు.

ఇదేనా మనిషి విచక్షణ?

ఇదేనా మనిషి ఆలోచన?

ఆలోచనల్లేని జీవులు ఇన్‌స్టింక్ట్‌పై ఆధారపడి బతుకుతాయి.

ఆలోచనలున్న మానవుడు, తప్పు ఒప్పులను గ్రహించగలిగిన మానవుడు తప్పు చేస్తాడు.

అందుకే నవ్వుతోంది సముద్రం. మనిషి తెలివిని వెక్కిరిస్తూ నవ్వుతోంది.




బెనవ్‌లిమ్ క్యాంపు సముద్రం ఒడ్డునే ఉంది. అంతా ఇసుక ఇసుకగా ఉంది.

సాయంత్రం అంతా సముద్రంలో దిగి ఆడుకున్నారు.

చేతన్, సెలిన్‌లు కిరణ్‌ని నీళ్లలో దింపారు. వీలయినంత లోతుకు తీసుకువెళ్లారు. అలను ఎలా ఎదుర్కోవాలో నేర్పారు.

కానీ కిరణ్‌కు అది బోధపడలేదు.

ఓ పెద్ద అలను ఎదుర్కోవాలని ఎగిరాడు. కానీ దాని తాకిడికి పట్టు తప్పింది. నీళ్లలో మునిగాడు. కొట్టుకుపోతున్న భావన కలిగింది. తన శరీరం తేలికైపోయిన భావన కలిగింది. ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

సెలిన్ పట్టుకుని నీటిపైకి తెచ్చాడు.

ఆ అనుభవం చాలు అనిపించింది కిరణ్‌కు.

అంతలోనే ఆశ్చర్యం అనిపించింది.

సముద్రం తనని లోనికి ఆహ్వానిస్తున్నట్టు

అనిపించింది పొద్దున్న.

ఇప్పుడు నీళ్లల్లో దిగేసరికి ఊపిరి అందక ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. తట్టుకోలేక భయపడి ఒడ్డుకు పరుగెత్తుకు వచ్చాడు.

మరి ప్రకృతిలోని అందం ఏమైంది?

సౌందర్యాన్ని చూస్తూ మైమరచిపోవటం ఏమైంది?

ప్రకృతిలో ఎంత అందం ఉందో, అంత బీభత్సం కూడా ఉంది.

ఎంత సౌందర్యం ఉందో, అంత భయంకరం కూడా పక్కనే ఉంది.

ఆలోచిస్తూ కూచున్నాడు.

సాయంత్రం ఔతూనే బీచ్‌లో ఉన్న రెస్టారెంట్లు నృత్య సంగీతం ఆరంభించాయి. చెట్టాపట్టాలేసుకున్న విదేశీయులు వాటిలోకి వెళ్తూ కనిపించారు.

బార్‌లలోంచి వినిపిస్తున్న సంగీతానికి అనుగుణంగా ఒడ్డున తమ జట్టులోని అమ్మాయిలు నృత్యాలు ఆరంభించారు. అబ్బాయిలు వారికి తోడయ్యారు.

అది చూస్తున్న కిరణ్ మనస్సు వికలమైపోయింది.

బార్‌లలో వినిపిస్తున్నది విదేశీ సంగీతం. దానికి నృత్యం చేసేది విదేశీయులు. కానీ ఆ సంగీతానికి బయట నృత్యం చేస్తున్నది తమ వారే.

అతడికి మధ్యాహ్నం తనకు వచ్చిన ఆలోచన సరైనదే అనిపిస్తోంది.

'డిన్నర్ రడీ' విజిల్ వినిపించింది.

★ ★ ★

డిన్నర్ అయింది.

'ఇవ్వాళ క్యాంప్ ఫైర్ కేన్సిల్' చెప్పాడు క్యాంప్ లీడర్.

ఎక్కడి వాళ్లక్కడ నిద్రకు ఉపక్రమించసాగారు.

కిరణ్‌కు నిద్ర పోవాలని లేదు. సముద్రపు ఒడ్డున కూచోవాలని ఉంది.

పౌర్ణమి దగ్గరపడుతున్న రోజులు కావటంతో ఆకాశంలో చంద్రుడు నిండుగా ఉన్నాడు.



ఆకాశమే కాదు నేల కూడా పాల వెలుతురులో స్నానమాడుతోంది.

ఆకాశం నుండి కురుస్తున్న వెన్నెల గ్రోలుతూ తన్మయమైనట్టు ప్రకృతి సర్వం నిశ్శబ్దంగా ఉంది.

'మేం డిస్కోకు వెళ్తాం' నవీద్ క్యాంప్ లీడర్‌ని అడిగాడు.

'సరే' అనుమతి ఇచ్చాడు క్యాంప్ లీడర్.

వెంటనే వాళ్లంతా క్యాంపు వదలి రివ్వుమని డాన్స్ బార్‌లవైపు పరుగెత్తారు.

'మేమూ వెళ్తాం' బెంగాలీ వాళ్లెవరో అడి

గారు. ముద్దముద్దగా వస్తోంది అతని మాట.

క్యాంపులో సగం మంది తాగి ఉన్నారు.

వాళ్లు ట్రెక్కింగ్ దారిలో కనబడ్డ ప్రతి బార్‌లో తాగారు.

'మీకు అనుమతి లేదు' అన్నాడు క్యాంప్ లీడర్.

వెంటనే వాదన ఆరంభమయింది.

'వాళ్లకి ఎలా పర్మిషన్ ఇచ్చావు? మాకెందుకు ఇవ్వవు?' అరవసాగారు బెంగాలీ వాళ్లు. హర్యానా వాళ్లు, బొంబాయి వాళ్లు వాళ్లకు తోడయ్యారు.

'వాళ్ల గొప్ప ఏముంది? కాశ్మీరీవాళ్లయినంత మాత్రాన వాళ్లని ప్రత్యేకంగా చూడాల్సిన అవసరం ఏముంది? వాళ్లకన్నా మేం ఏ రకంగా తక్కువ?' అందరూ కలసి క్యాంప్ లీడర్‌పై ఎగబడ్డారు.

గొడవకు క్యాంప్‌లోని ఆడవాళ్లు బయటకు వచ్చారు. అరుపులు కేకలకు బెదిరారు. ఎవరూ వెనక్కు తగ్గటం లేదు.

కిరణ్‌కు ఎందుకో చాలా బాధగా అనిపించింది.

పైనుండి వర్షిస్తున్న వెన్నెలకు బండలు కూడా పులకరిస్తున్నట్టు తోస్తోంది.

ఈ మనుషులకు మాత్రం ఏమీ పట్ట లేదు.

కిరణ్ నెమ్మదిగా వారికి దూరంగా నడవసాగాడు. క్యాంపు వదలి బీచ్ ఒడ్డుకి చేరుకున్నాడు.

ప్రొద్దుటి నుంచీ అందంగా కనిపించి మురిపించిన నీలి సముద్రం అదృశ్యమయింది. దాని స్థానే చిక్కటి నల్లటి గోడ ఆక్రమించింది.

ఆ నల్లటి గోడలోంచే అలలు హఠాత్తుగా వస్తున్నాయి. వెన్నెల ఆ అలల ఉపరితలంపై పడకపోతే అలలు వస్తున్నట్టు కేవలం శబ్దం వల్లనే గ్రహించటం వీలయ్యేది.

నల్లటి శూన్యం నుంచి తెల్లటి అలలు ఎగసిఎగసి పడటం ఎంతో అద్భుతంగా అనిపిస్తోంది. ఓ రకంగా తెలియని భయం కలుగుతోంది.

ఇసుకలో కూచుని ఆ చీకటివైపు చూస్తున్న కిరణ్ మది విచిత్రంగా స్పందించ సాగింది.

శూన్యంలోంచి వస్తాం. కాస్సేపు అల వచ్చినట్టు ఎగసిపడతాం. ఆ తరువాత చీకటిలో కలసిపోతాం.

వెలుతురు పడితే శూన్యంలో నీలి సముద్రం ఉందని తెలుస్తుంది. లేకపోతే అంతా శూన్యం. ఇంద్రియాలు మనల్ని ఎంతగా మోసం చేస్తాయి!

వాటి పరిమిత పరిధిని గ్రహించక ఇంద్రియాల ద్వారా గ్రహించే జ్ఞానమే సర్వం అనుకోవటం పొరపాటు కాదా!

కిరణ్ మనసు వీణ మీదకు మళ్లింది.

'ఈ సమయంలో వీణ తన సరసన ఉంటే ఎంత బాగుండేది'.

పక్కన అలికిడి అయితే చూశాడు.

వెన్నెల ఆకృతి దాల్చి వచ్చినట్టనిపించింది.

ప్రీతి!

కిరణ్ నోట మాట రాలేదు.

'దేవకన్య' అన్న మాటకు ఆమెని చూస్తే అర్థం తెలుస్తుంది అనుకున్నాడు.

నోట మాట రావటం లేదు.

అతికష్టం మీద అడిగాడు. 'గొడవ తేలిందా?'

'తేలింది. కాశ్మీరీ వాళ్లని పిలిపించేశారు. దాంతో గొడవ సద్దుమణిగింది. అందరూ పడుకున్నారు' కిరణ్ ఆమెవైపు చూశాడు.

ఆమె కళ్లు ఎంత ఉత్సాహంతో వెలిగిపోతున్నాయి. ఆమె ముఖంపై వెన్నెల ఆనంద తాండవం చేస్తున్నట్టుంది.

కిరణ్ తనవైపే చూస్తుండటం గ్రహించి నవ్వింది ప్రీతి.

'నేను అందంగా ఉంటానా?' మృదువుగా, దాదాపుగా గుసగుసలాడుతున్నట్టు అడి

గింది.

'చాలా...' కిరణ్ గొంతు తడారిపో యింది.

అతని పక్కన కూచుని రెండు చేతుల ఆధారంతో వెనక్కు వాలింది.

అలా వాలటం వల్ల ఆమె వేసుకున్న టీషర్టు ఆమె ఒంటికి మరింత దగ్గరగా హత్తుకుంది.

కిరణ్ కళ్ళు తిప్పుకుని సముద్రంవైపు చూశాడు.

కిరణాల దివ్యాంగన తన ఎదురుగా సముద్రంలో ఉందా, తన పక్కన ఉందా అన్న భావన కలిగింది కిరణ్‌కు.

ఎదురుగా సముద్రాన్ని చూస్తూ ఉన్నా, అతడి మనస్సు తన పక్కన ఉన్న ప్రీతిపైనే ఉంది. ఆమె వైపు చూడాలని ఉంది.

వెన్నెల పరుచుకుని ఉన్న ఆమెని పదే పదే చూడాలని ఉంది. ఆ అందాన్ని కళ్లల్లో నిలుపుకోవాలని ఉంది.

'నేను స్నానం చేస్తాను' అంది ప్రీతి.

కిరణ్ మాట్లాడలేదు.

బీచ్‌లో తామిద్దరే ఉన్నారు. పన్నెండు దాటటంతో బార్‌లు కూడా మూసేశారు.

అంతా నిశ్శబ్దంగా ఉంది. ఉండి ఉండి తీరాన్ని తాకే అలల శబ్దం తప్ప మరో శబ్దం లేదు.

పక్కన ప్రీతి దుస్తులు విప్పుతున్న శబ్దం వినిపించింది.

అటు తిరిగి చూడాలని ఉంది కిరణ్‌కు. కానీ బలవంతంగా ఆ కోరికను అణచుకు న్నాడు.

కోరికలకు అంతే లేదు. ఒకటి తీరితే మరొకటి వస్తుంది. కోరికల రాపిడికి మనిషి ఇసుక అయిపోతాడు. కాబట్టి కోరి కల్లేని స్థితికి చేరాలి.

నగ్నంగా, కిరణ్ ముందు నుంచి మెల్లగా నడుస్తూ సముద్రంలోకి వెళ్లింది ప్రీతి. పొద్దుటి నుంచీ ప్రకృతి అందాన్ని చూసి పరవశించాడు. ఆలోచించాడు. ఇప్పుడు ప్రకృతి తనకు ప్రతిగా సృజించిన ఈ అస మాన సౌందర్యాన్ని చూసి నోట మాట రాక కూచుండిపోయాడు. అత్యద్భుతమైన అందం ఉద్రేకాన్ని కలిగించదు. శాంతిని స్తుంది. మెదడులోంచి ఆలోచనలన్నీ అదృ శ్యమైపోయాయి.

సర్వేంద్రియాలు అలలపై కలల రాణిలా తేలుతున్న తెల్లని ప్రీతి శరీరంపై కేంద్రీ కృతమయ్యాయి.

పొద్దున్న అలలతో ఆడుకున్న డాల్ఫిన్‌లు గుర్తుకు వచ్చాయి.

ఇపుడు అలల్లో అల అయి ఆడుకుం టున్న ప్రీతిని చూస్తున్నాడు.

కిరణ్‌లో ఆనందం తప్ప ఆవేశం లేదు.

ఒక వెన్నెల కిరణం సముద్రంలో స్నానం చేస్తున్నట్టుంది.

అక్కడ కాలం స్తంభించిపోయింది.

## మారుపల్కవేర? మంతిరన్న!



తెల్లదొరలు పోయి నల్లదొరలు పీఠ మెక్కినా తాడితులు, పీడితుల కష్టాలుతీరనేలేదు.. దాంతో కడుపు మండిన జాషువా తాను కవి గనుక దాన్ని ఎంత స్వారస్యంగా చెప్పాడో చూడండి..

రాజ్య పీఠమెక్కి రాజదండము పట్టి
మూడువత్సరములు మునిగిపోయె
దొరల రాచరికమే మెరుగయ్యెనని
పించె
మారుపల్కవేర? మంతిరన్న!



కిరణ్ తనను తాను మరచిపోయాడు. తాను ఒక మనిషినన్న భావన అతనిలోంచి అదృశ్యం అయింది. తనకొక శరీరం ఉందన్న స్పృహ లేదతనికి.

తాను ఒక అనుభూతి. ఒక అందమైన అనిర్వచనీయమైన అలౌకిక అనుభూతి.

అలసిపోయేంత వరకూ ఆలలతో ఆడుకుని కిరణ్ పక్కకు వచ్చి కూచుంది ప్రీతి.

ఈసారి కిరణ్ ఆమె వైపు తప్ప మరో వైపు చూడలేకపోయాడు.

అందం ఆకృతి దాలిస్తే ఇలాగే ఉంటుందనిపించింది.

కాస్సేపు అలాగే నగ్నంగా కిరణ్ పక్కన కూర్చుంది. నెమ్మదిగా అతని భుజంపై తల పెట్టింది. కిరణ్ ఒళ్లు ఝల్లుమంది.

ఎదురుగా అనంతమైన సముద్రం నిశ్చేష్ట అయి తమవైపే చూస్తున్నట్టు అనిపిస్తోంది. దాని ఆనందం అలల రూపంలో వ్యక్తమౌతున్నట్టుంది.

చలికి వణుకు రావడంతో దుస్తులు వేసుకుంది ప్రీతి. కానీ ఈసారి తల అతని భుజంపై ఆనించి, ఒక చేయి అతని నడుం మీద నుంచి పోనిచ్చి పొదివి పట్టుకుంది.

కిరణ్‌కు వెన్నెలలో తానూ, వీణ కలిసి పాడుకునే పాట గుర్తుకు వచ్చింది.

అంతలో మరో ఆలోచన.

ప్రీతి ఎవరో తనకు పరిచయం లేదు.

ఆమెతో పట్టుమని పది మాటలు మాట్లాడలేదు.

కానీ ఆమె స్త్రీ. తాను పురుషుడు. ఆమె తన సరసన వచ్చి కూచుంటే తన

ప్రమేయం లేకుండా తాను స్పందిస్తాడు.

అతని మనస్సులో వేదన పొరలు కరిగిపోసాగాయి.

ప్రపంచం సర్వం అనుభూతుల మయం.

ఒక అనుభూతి ఎంత బలంగా ఉంటుందంటే, దాని ముందు మిగతా అనుభూతులన్నీ దిగుదుడుపు అనిపిస్తాయి.

దాంతో, మళ్లీ అటువంటి అనుభూతి పొందలేననుకుంటాడు.

కానీ తరచి చూస్తే ఏ అనుభూతికి ఆ అనుభూతి ప్రత్యేకం.

మనిషి ఒక్కడే అయినా అతని అనుభూతులు అనేకం. అతని స్పందనలు అనంతం.

వీణ తన జీవితంలో మరపురాని అనుభూతి.

కానీ, వీణతోటే తన జీవితం సమాప్తం కాదు.

వీణతోటే తనలోని స్పందనలు అంతం కావు.

వీణ కాక తన జీవితం ఇంకా ఉంది.

అలాగని వీణని అంత తేలికగా మరచిపోవటం కుదరదు.

తన ఊపిరిలో ఊపిరి అయి రక్తంలో రక్తమయింది వీణ.

కానీ ఇప్పుడు ఆమె లేకుండా తను జీవించక తప్పదు.

ఒక కలల పరదా చిరిగిపోయింది.

అది చిరిగిపోయిందని ఏడుస్తూ కూచోవటం మూర్ఖత్వం.

ఆ కలల పరదాను తొలగించి కొత్త కలల పరదాను ఏర్పాటు చేసుకోవాలి.

ఇదే జీవితం!

ప్రీతి స్పర్శ సుఖంగా ఉంది.

కానీ కిరణ్ ఆమెని దగ్గరకి తీసుకోలేదు. దగ్గరకు తీసుకోవాలని కూడా అనిపించలేదు. ఆమె వెంట్రుకల నుండి వస్తున్న సువాసన తాలూకు మత్తును, తనపై వాలిన ఆమె స్పర్శలోని మాధుర్యాన్ని అనుభవిస్తూ, వెన్నెల వెదజల్లే అమృతాన్ని గోలుతూండిపోయాడు.

తెల్లవారుతూంటే కదిలింది ప్రీతి.

కిరణ్‌వైపు మత్తు నిండిన కళ్లతో చూసి నవ్వింది.

మెల్లిగా, వంగి అతని పెదవులను మృదువుగా చుంబించింది.

చందమామ ఆకాశం నుండి తన కోసం వంగి తనను స్పృశించినట్టయింది కిరణ్‌కు.

ఉప్పగా, మెత్తగా, మధురంగా తాకాయి ఆమె పెదవులు.

వాటి స్పర్శకు ఎవరో తనలోంచి ఊపిరిని బయటకు లాగేసినట్టయిపోయింది. తల తిరిగినట్టయి, తాను పడిపోతాడేమోననిపించింది.

కిరణ్‌ను అక్కడే వదిలి వెళ్ళిపోయింది ప్రీతి.

ఆకాశంలో జాబిల్లి వైపు చూస్తూ

కూచుండిపోయాడు కిరణ్.

నెమ్మదిగా తూర్పు వైపు నుండి తన వెలుతురు కిరణాల బాహువులు చాస్తూ సూర్యుడు వెలికి రాసాగాడు.

అయిష్టంగా సముద్రం ఒడ్డు నుంచి లేచి క్యాంపు వైపు నడిచాడు కిరణ్.

★ ★ ★

రాత్రంతా నిద్ర లేకపోయినా కిరణ్‌కు అలసటగా లేదు.

అమృతం తాగిన వాడిలా ఉన్నాడు కిరణ్. శరీరం తేలికగా ఉంది. మనసంతా ఉత్సాహంతో నిండి ఉంది.

తెల్లారి లేస్తూనే తావూజీ కిరణ్‌ని పక్కకు పిలిచాడు.

'నీకు తెలుసా, మన గ్రూప్‌లో ఒక అమ్మాయి, కాశ్మీర్‌వాడితో బార్‌కి వెళ్లింది.'

తెలియదన్నట్లు తల అడ్డంగా ఊపాడు కిరణ్.

'ఇవ్వాళ వీళ్ల పని చెప్తాం. మనోహర్‌కు ఫోను చేశాను' అన్నాడు సుదర్శన్.

బయలుదేరేందుకు సిద్ధం కమ్మని విజిల్ ఊదాడు క్యాంపు లీడర్.

అందరూ వరుసగా నుంచున్నారు.

'రాత్రి జరిగినదాన్ని మరచిపొండి. రాత్రి మీరంతా తాగి ఉన్నారు. ట్రెక్‌లో తాగటం నిషిద్ధం. కానీ ఈ ఒక్కసారికి వదిలేస్తున్నాం. వెళ్లండి. బస్సు సిద్ధంగా ఉంది' అన్నాడు క్యాంపు లీడర్.

బస్సెక్కుతున్న కిరణ్ కళ్లు, మొదటి వరుసలో కూచున్న ప్రీతిపై పడ్డాయి.

ఆమె కిరణ్‌వైపు చూసి క్షణంలో కళ్లు తిప్పేసుకుంది. ఆమె పక్కన కాశ్మీర్ యువకుడు గాజీ ఉన్నాడు. నవ్వుతూ అతనితో మాట్లాడటం ఆరంభించింది.

కిరణ్‌కు నవ్వు వచ్చింది. అతని మనసు ప్రశాంతంగా ఉంది.

క్రితం రాత్రి అతను అలౌకికమైన ఆనందం పొందాడు. ఆ ఆనందం ముందు ఈ ప్రపంచంలోని మిగతా భావనలన్నీ దిగదుడుపుగా అనిపిస్తున్నాయి.

ఆ భావనలకు మనుషులతో సంబంధం లేదు.

ఆ తరువాత ప్రీతి మళ్లీ అతనితో మాట్లాడలేదు. అతను ప్రీతివైపు చూడలేదు.

ఆమెతో మాట్లాడాలని ప్రయత్నించలేదు.

వారిద్దరూ ఎంతో సన్నిహితంగా వచ్చి అపరిచితుల్లా మిగిలిపోయారు.




బస్సు మర్మగోవా రైల్వేస్టేషన్ చేరేసరికి రజిత వాళ్ల నాన్నగారు అక్కడికి వచ్చి ఉన్నారు.

బస్సు దిగగానే రజితను తీసుకుని వెళ్లిపోయారు. ఆమె కూడా ఎవ్వరివైపు చూడకుండా వెళ్లిపోయింది.

అందరి దృష్టి గాజీపై ఉంది. గాజీ ముఖం మాడిపోయింది. వాడొక మూలకు వెళ్లి నుంచున్నాడు.

ఇంతలో హర్యానా పుల్విందర్ కాశ్మీర్ వాళ్లని ఉద్దేశించి అరవటం మొదలుపెట్టాడు.

'వాళ్లేమనుకుంటున్నారు. మన తల్లులు చెల్లెళ్లు చులకన అనుకుంటున్నారా? పైగా మమ్మల్ని హర్యానా ఎద్దులు అంటారా? ఏమనుకుంటున్నారు వాళ్లు. చంపి పోగులు పెట్టేస్తాను. వాళ్ల ఆటలు ఇక్కడ సాగవు'

పూనకం వచ్చిన వాడిలా అరుస్తున్న పుల్విందర్‌ను పట్టడం ఎవ్వరి తరం కావటం లేదు. చివరికి తావూ వచ్చి అతడిని పక్కకు తీసుకెళ్లాడు. సముదాయించాడు. ఇంతలో రైలు రావడంతో అందరూ

పొలోమని రైలెక్కేశారు.

కిరణ్ ఎవ్వరూ లేని ఓ మూల కిటికీ దగ్గర కూచున్నాడు.

వెనుక 'బే' నుంచి తమ జట్టువారు అంత్యాక్షరి ఆడటం వినిపిస్తోంది.

కిరణ్ అవన్నీ పట్టించుకునే స్థితిలో లేడు.

అతని మదిలో తాను చదివిన రవీంద్ర నాథ్ ఠాగూర్ కవిత మెదిలింది. ఈ కవి తను ఎప్పుడూ వీణకు వివరిస్తూ ఉండే వాడు. ఇప్పుడు ఆ కవితతో వీణ జ్ఞాపకా లను కడిగేసుకుంటున్నాడు.

'ఓ యువతీ, నువ్వు కేవలం భగవంతుడి కళానైపుణ్యానికే కాదు; మనిషి ఊహాశక్తికి కూడా ప్రతీకవు; అనుక్షణం నీ అందాన్ని తన హృదయాల అర్పణతో వీరు ఇనుమ డింపచేస్తున్నారు.

కవులు బంగారు ఊహాల తాళ్లతో నీ రూపానికి మెరుగులు దిద్దుతున్నారు.

చిత్రకారులు నీ రూపానికి అమరత్వాన్ని ఆపాదిస్తున్నారు.

సముద్రం ముత్యాలందిస్తోంది. గనులు బంగారాన్నిస్తున్నాయి.

పూతోటలు నీ అలంకారానికి పూవులంది స్తున్నాయి.

మగవారి హృదయాల కోరిక నిన్ను అమూల్యమైన దాన్ని చేస్తున్నాయి.

నీవు సగం మహిళవు. సగం కలవు'

ఎంత నిజం!

మహిళ ఎప్పటికీ సగమే. మిగతా సగం పురుషుడి ఊహ.

ఇప్పుడు వీణ భౌతికంగా అదృశ్యం అయింది. రాత్రితో ఆ కల కూడా చెది రింది.

'కొల్లెమ్ వచ్చింది దిగండి' అరిచారెవరో.

అందరూ దిగారు. స్టేషన్ దాటి బయ టకు వచ్చి నడవసాగారు.

'రాత్రి నువ్వు టెంట్‌లో కనబడలేదు. డాన్స్ చూడటానికి వెళ్లావా?' అడిగాడు మురుమ్కర్.

సమాధానంగా

నవ్వాడు కిరణ్. మాట్లాడలేదు. అతనికి ఎవ్వరితోనూ మాట్లాడాలని లేదు. కలలో నడిచినట్టు నడుస్తున్నాడు.

మత్తులో ఉన్నవాడు నడచినట్టు నడుస్తు న్నాడు.

అతని చుట్టూ దట్టమైన అడవి. అతని అడుగులు ఇతరుల బాటలో యాంత్రికంగా పడుతున్నాయి.

అతని ఇంద్రియాలు గతంలో కన్నా చురుకుగా పనిచేస్తున్నాయి.

ఆకుల చిరు గలగలలు అతనికి వినిపిస్తు న్నాయి. ఎక్కడో కూస్తున్న పక్షి కూతలు

## సూపర్ స్టార్ ఖనిజం

మన శరీరాలకు ఖనిజాలు అవసరమని మనకు తెలుసు. కానీ మనకు అవసరమైన ఖనిజాల్లో సూపర్‌స్టార్ ఎవరో తెలుసా? కాల్షియమ్! కాల్షియం లోపం ఉంటే పళ్లు పాడవుతాయి. ఎముకలు శక్తిహీనమవు తాయి. మన శరీరంలో కాల్షియంకు ఎము కలు స్టోరేజ్ ట్యాంక్ లాంటివి. కాల్షియం అవసరమైనప్పుడల్లా ఎముకలలోని కాల్షి యంను శరీరం వాడుకుంటుంటుంది. అలా గని మనం కాల్షియం శరీరానికి 'ఆహారం' ద్వారా అందిస్తుండటం మానేస్తే, ఎముకల్లో కాల్షియం తరిగిపోయి అవి బలహీనం అయిపోతాయి. కాల్షియం తగినంత శరీరా నికి అందించకపోతే రక్తపోటు పెరుగుతుం దని, కోలోన్ కేన్సర్ వచ్చే అవకాశం ఉందని కనుగొన్నారు. కాల్షియం అధికంగా పాలల్లో, పాల నుండి తయారయ్యే మజ్జిగ, కుల్ఫీ వంటి వాటిలో, ఎండుకొబ్బరిలో అధికంగా లభిస్తుంది. అందుకేనేమో పొద్దున్న లేవగానే పాలు తాగండి, గుడికెళ్ళి కొబ్బరి ప్రసాదం తినండి అంటారు పెద్దలు.

అతనికి ఆనందం కలగచేస్తున్నాయి.

కొందరు పాటలు పాడుకుంటూ నడుస్తున్నారు. మరి కొందరు చర్చిస్తూ నడుస్తున్నారు.

కిరణ్ అనుభవిస్తూ నడుస్తున్నాడు.

ప్రకృతి తనకేదో చెప్పాలని తహతహలాడుతున్నదనిపిస్తోంది.

ఏవేవో గుసగుసలుగా చెప్తోంది. శరీరంలోని అణువణువూ పులకిస్తోంది. కానీ కారణం బోధపడటం లేదు.

దారికి ఓ చిన్ననది అడ్డంగా వచ్చింది. ఎక్కువ లోతు లేదు. నీళ్లు జలజల పారుతున్నాయి.

ఆ నీళ్లలో చిన్న చిన్న చేపలు ఈదుతున్నాయి.

నీళ్లు ఎంత స్వచ్ఛంగా ఉన్నాయంటే, అడుగున ఉన్న రాళ్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కిరణ్‌కు ఎంతో హాయిగా అనిపించింది- ఆ నీళ్లలోకి చూస్తూంటే.

ప్రపంచంలో అద్భుతమైన దేదైనా ఉంటే అది నీళ్లే అనిపించింది.

హైడ్రోజన్, ఆక్సిజన్, కలిస్తే ఏర్పడే ఈ ద్రవం లేని ప్రపంచాన్ని ఊహించలేం. మన శరీరంలో నీరు... తాగేందుకు నీరు... ఏదైనా కడిగేందుకు నీరు... నీరు లేకపోతే జీవం లేదు.

నీళ్లని దోసిళ్లలోకి తీసుకున్నాడు. ఒక్కొక్క చుక్క చేతిలోంచి కారిపోతూంటే చిన్న పిల్లవాడిలా, సంభ్రమంగా వాటివైపే చూడసాగాడు.

'మీకు మీ ఫ్రెండ్ సంగతి పట్టదా? '

పక్కనే మాటలు వినబడటంతో ఉలిక్కిపడ్డాడు. పక్కన కశ్మీరా.

'ఏమైంది? ' అతి కష్టం మీద అతని గొంతు పెగిలింది.

'చూడండి. నేను తినకపోతే ఆయన కూడా తినటంలేదు' చిరుకోపం ప్రదర్శిస్తూ అంది.

'మీరు తినండి' తేలికగా అన్నాడు కిరణ్.

'చూడండి, నీరసంతో ఎలా నడవలేకపోతున్నాడో' చంద్రవైపు చూపించింది.

నిజంగానే నీరసపడి పోయినట్టున్నాడు చంద్ర.

'తినకపోతే చంద్రకే కాదు మీకూ నీరసం వస్తుంది. కాబట్టి ఇద్దరూ తినండి' సలహా ఇస్తున్నట్టు అన్నాడు కిరణ్.

'బాగుంది సలహా' అంటూ చంద్ర దగ్గరకు వెళ్లి చేయి అందించి లేపింది. చంద్ర ఆమెమీద దాదాపుగా వాలిపోయాడు.

ఆమె అతి జాగ్రత్తగా చంద్రని నడిపించసాగింది.

రాజుకోసం చుట్టూ చూశాడు కిరణ్. రాజు, స్వప్న చేతులు పట్టుకుని నడుస్తూ కనిపించారు.

అనురాధ, ఆరోహి, చేతన్, సెలిన్ ఒకచోట కనిపించారు.

ఇంతలో సందీప్, తివారీ కిరణ్ పక్కకు వచ్చి కూచున్నారు.

'నువ్వు చేతన్, సెలిన్‌లకు ఒక మెసేజ్ ఇవ్వాలి' అన్నాడు సందీప్.

కిరణ్ అతడి మాటలు పట్టించుకోలేదు.



'తినకపోతే చంద్రకే కాదు మీకూ నీరసం వస్తుంది. కాబట్టి ఇద్దరూ తినండి' సలహా ఇస్తున్నట్టు అన్నాడు కిరణ్. 'బాగుంది సలహా' అంటూ చంద్ర దగ్గరకు వెళ్లి చేయి అందించి లేపింది.



'ఏం తివారీ, మళ్లీ కవితలు రాసినట్టు లేవు? ' అడిగాడు.

'ఛీ... దానిమీద కవితలు రాయటం కూడానా! చాలా అహంకారం దానికి. అటువంటి వాళ్లు మా జార్ఖండ్‌లో బోలెడంత మంది ఉన్నారు. ఆరోహీ వాళ్లమ్మ ముందే నాతో బాగా మాట్లాడింది. నేను లేకపోతే సందీప్ ఆరోహిని పెళ్లి చేసుకోవాలని అనుకున్నాం. ఈలోగా ఈ సెలిన్, చేతన్‌లు దాపురించారు. వాళ్లని జాగ్రత్తగా ఉండమని చెప్పు. లేకపోతే ఏ కొండమీద నుంచో దొర్లించేస్తాం. ఏ రాయితోనో తల పగలగొట్టేస్తాం' కోపంగా చెప్పాడు తివారి.

నవ్వాడు కిరణ్. 'మన జట్టులో వీళ్లిద్దరే కాదు, ఇంకా బోలెడంత మంది అమ్మాయిలున్నారు కదా!'

'వాళ్లంతా ఆ కాశ్మీరీ వాళ్ల మోజులో పడ్డారు. ఇప్పుడు బెంగాలీ వాళ్లు, కాశ్మీరీ వాళ్లు మాట్లాడుకోవటం లేదు తెలుసా!' అడిగాడు తివారి.

'అదేం? '

'రాత్రి గొడవ అయింది కదా! డాన్సులు చూసేందుకు కాశ్మీర్ వాళ్లకి పర్మిషన్ ఇచ్చి తమకు ఇవ్వలేదని బెంగాలీ వాళ్లు వాదించారు కదా. అది విని కాశ్మీర్ వాళ్లు నవ్వారట. అందుకని బెంగాల్ వాళ్లు, కాశ్మీర్ వాళ్లు మాట్లాడుకోవటం లేదు. అది సరే... కానీ మా హెచ్చరిక వాళ్లిద్దరికీ చెప్పు' మళ్లీ గుర్తుచేసి గబగబా వెళ్లిపోయారు. కిరణ్ నీళ్ల ప్రవాహం వైపు చూశాడు. ఇంత క్రితం కనిపించినట్టు అద్భుతంగా కనిపించటంలేదు.

'అరే భాయ్, ఎప్పుడూ ఒంటరిగా అందరికీ దూరం దూరంగా ఉంటావెందుకు? ' పక్కన కూర్చుంటూ అడిగాడు నవీద్.

కిరణ్ నవ్వి ఊరుకున్నాడు.

'రాత్రి ఏం చేశావు? ' రహస్యంగా అడిగాడు నవీద్.

అతడివైపు నిర్జీవంగా చూశాడు కిరణ్. 'నిద్రపోయాను' చెప్పాడు.

పెద్దగా నవ్వాడు నవీద్. 'మేం డాన్స్ చూశాం తెలుసా. ఫారినర్స్ ఏం డాన్సు చేశారో... అబ్బ... ఎంజాయ్‌మెంట్ అంటే వాళ్లది. రబ్బరులా ఎటుపడితే అటు వంగుతుంది వాళ్ల ఒళ్లు!, అన్నాడు.

'నువ్వు డాన్స్ చెయ్యలేదా? ' అడిగాడు కిరణ్.

'చెయ్యనివ్వలేదు. అక్కడ మనం డాన్స్ చేస్తే ఫారినర్స్ వెళ్లిపోతారు. ఫారినర్స్‌ని ఏమీ అనం అని వాగ్దానం చేస్తేనే మమ్మల్ని డాన్స్ చూడనిచ్చారు'

కిరణ్ ఏమీ మాట్లాడలేదు.

'మేము వెళ్లిన తరువాత అందరూ మామీద పడ్డారట కదా! మేం క్యాంపు లీడర్ అనుమతి తీసుకుని వెళ్లాం. దాన్లో మా తప్పు ఏముంది? '

'కానీ మీరు వచ్చింది ట్రెక్కింగ్‌కి. డాన్సులు చూడాలని ఉంటే ప్రైవేటుగా వచ్చి హోటల్‌లో గది తీసుకుని చూడండి. అంతేకానీ ట్రెక్కిం



**'మేం డాన్స్ చూశాం తెలుసా. ఫారినర్స్ ఏం డాన్సు చేశారో... అబ్బ... ఎంజాయ్ మెంట్ అంటే వాళ్లది. రబ్బరులా ఎటుపడితే అటు వంగుతుంది వాళ్ల ఒళ్లు!**



గ్‌కని వచ్చి ప్రకృతి వీక్షణకని వచ్చి ఇటువంటి పనులు చేయటం మొత్తం ట్రెక్‌ని పాడుచేస్తుంది' అన్నాడు కిరణ్.

నవీద్ ఒక్కసారి కిరణ్ వైపు దెబ్బతిన్నవాడిలా చూశాడు. మౌనంగా లేచి వెళ్లిపోయాడు. మనుషులు, నిజమైనా, తమకు అప్రియమైన దాన్ని చెప్తే నమ్మరు.

ఇంతలో 'కెవ్వు కెవ్వు'మని పెద్దగా కేకలు వినిపించాయి.

హడావుడిగా ఆవైపు పరుగెత్తి వెళ్లిన కిరణ్ బ్రమ్మన్నడిపోయాడు.

మురుమ్కర్ కాలు పాము మెడపై ఉంది. పాము పడగ ఎత్తి ఉంది. అందరూ చుట్టూ మూగి కేకలు పెడుతున్నారు. కానీ ఎవరూ ధైర్యంగా మురుమ్కర్ దగ్గరకు వెళ్లలేకపోతున్నారు.



**మురుమ్కర్ కాలు పాము మెడపై ఉంది. పాము పడగ ఎత్తి ఉంది. అందరూ చుట్టూ మూగి కేకలు పెడుతున్నారు. కానీ ఎవరూ ధైర్యంగా మురుమ్కర్ దగ్గరకు వెళ్లలేకపోతున్నారు.**



'అందరం మాట్లాడుతూ నడుస్తున్నాం. పాము దారిలో పడుకుని ఉంది. ఎవ్వరం గమనించలేదు. మేమంతా దాన్ని దాటాం. మురుమ్కర్ అంకుల్ దాని మీద కాలు వేశాడు. బుస్సుమనేసరికి కదలకుండా అలానే నుంచునిపోయాడు. దానిమీద నుంచి కాలు తీస్తే అది కాటేస్తుంది' వణికిపోతూ గబగబా అందరికీ వివరిస్తోంది ఆరోహి.

పాము నెమ్మదిగా దాని తోకని పైకి లేపింది. గబగబా మురుక్కర్ తొడను చుట్టేయసాగింది.

అతను భయంతో ఏడుస్తున్నాడు.

చుట్టూ మూగిన వారు హాహాకారాలు చేస్తున్నారు.

ఎవరికేం చేయాలో తోచటంలేదు. ఎవరికి తోచిన సలహాలు వాళ్లు ఇచ్చేస్తున్నారు.

సలహాలిచ్చేవారే అందరూ; కానీ కార్యరూపంలో పెట్టేవారెవరూ లేరు.

'ఎవరైనా వెళ్లి క్యాంపు లీడర్‌ని పిలిస్తే? '

'ఎవరు వెళ్లాలి? '

'గ్రూప్ లీడర్'

'నేను వెళ్లలేను' నిక్కచ్చిగా చెప్పేశాడు గ్రూపు లీడర్.

'మరేం చేద్దాం? '

ఇంతలో హర్యానా వాళ్లు అక్కడికి వచ్చారు. వస్తూనే వాళ్లు రంగంలోకి దూకారు. 'మా హర్యానాలో ఈ చేతుల్తో బోలెడన్ని పాముల్ని చంపాను' గర్వంగా చెప్పాడు తావు.

'నేను రోజుకి అయిదారు పాముల్ని చంపుతాను' చెప్పాడు పుల్వీందర్. వాళ్లిద్దరూ పామును దగ్గర నుంచి పరిశీలించారు. అడవిలో వెతికి రెండు పొడవాటి కర్రలు పట్టుకొచ్చారు.

ఒక కర్రతో పాము ముందున్న భూమిని కొట్టాడు.

దాంతో పాము బెదిరింది. రెండు మూడు సార్లు భూమిపై కాటేసింది.

'ఒకసారి కాటేస్తే దాని కోరల్లో విషం అంతా పోతుంది. మళ్లీ విషం నిండటానికి సమయం పడుతుంది' వివరించాడు తావు.

తావు ఆ రకంగా పాముని బెదరగొట్టటంతో, అది మురుమ్కర్ తొడని చుట్టి ఉన్న తోక పట్టు సడలించింది.

వెంటనే పుల్విందర్ గట్టిగా 'బోలే సోనిహాల్' అని అరుస్తూ, ఒడుపుగా కర్ర ఎత్తి పాము తలపై కొట్టాడు.

ఒక్క దెబ్బకి గిలగిల కొట్టుకుంటూ పాము ప్రాణాలు విడిచింది.

అందరూ చప్పట్లు కొట్టారు.

మురుమ్కర్ దూరంగా ఒక్క గెంతు గెంతి నేలపై పడిపోయాడు.

అతని ముఖంపై నీళ్లు చిలకరించారు.

అందరూ తావూజీని, పుల్విందర్‌ని అభినందిస్తున్నారు.

కిరణ్ ముక్కలై, నిర్జీవంగా పడి ఉన్న పాము శవం వైపు చూశాడు.

ఒక్క క్షణం క్రితందాకా అందరినీ బెదిరించి, ప్రాణాలు తోడేసిన ఆ పాము ఇపుడు జీవం లేని కట్టె!

పాముని చంపటం బాధ కలిగించినా, అది తప్పనిసరి.

మురుమ్కర్ తేరుకున్నాడు. కానీ కాలు కదపలేకపోతున్నాడు.

'ఇప్పుడేం చేద్దాం? '

'అందరూ దూరం జరగండి' అరిచాడు పుల్విందర్.

అందరూ దూరం జరిగారు.

వెంటనే 'బోలే సోనిహాల్' అని అరుస్తూ మురుమ్కర్‌ను ఉప్పుమూటలా భుజానికి ఎత్తుకున్నాడు పుల్విందర్. అతని బ్యాగును తావు తీసుకున్నాడు.

మళ్లీ అందరూ నడవటం ఆరంభించారు.

'వీళ్లు నీచులు' నవీద్, హర్యానా వాళ్ల గురించి అనటం కిరణ్ చెవుల్లో ప్రతిధ్వనించింది-

'ఈ పరిస్థితిలో వీళ్లే కనక లేకపోయి ఉంటే? ' అందరూ చూస్తూ నిలబడేవాళ్లు. సలహాలిచ్చేవాళ్లు. కానీ ఒక్కరూ ఒక్క అడుగు ముందుకు వేసే వాళ్లు కాదు.

అపుడొక సత్యం కిరణ్‌కు అర్థమైంది.

'సిద్ధాంతాలు చెప్పేవారు కార్యశూరులు కారు. కార్యశూరులకు సిద్ధాంతాలు చెప్పే తీరిక ఉండదు'.

★ ★ ★

కాసేపటి తరువాత మురుమ్కర్ తేరుకుని నడవసాగాడు. అప్పటికే హర్యానావాళ్లు 'హీరో' లయిపోయారు.

అంతవరకూ వాళ్లని ఈసడించుకున్నవారు, వాళ్లని అసహ్యంగా చూసినవాళ్లు ఇప్పుడు వాళ్ల చుట్టూ మూగుతున్నారు. వాళ్లతో మాటలు కలుపుతున్నారు. వాళ్లీ కొత్తగా లభించిన పాపులారిటీని పూర్తిగా ఆనందంగా అనుభవించేస్తున్నారు.

క్యాంపు చేరి కాస్సేపు కూచున్న తరువాత దూధ్‌సాగర్ జలపాతం చూసేందుకు బయలుదేరారు కిరణ్, రాజు, చంద్ర, చేతన్, సెలిన్‌లు. కాస్త దూరం వెళ్లగానే వీళ్లకోసం ఎదురుచూస్తూ కనిపించారు స్వప్న, కశ్మీరా, అరోహి, అనురాధ.



**అంతవరకూ వాళ్లని ఈసడించుకున్నవారు, వాళ్లని అసహ్యంగా చూసినవాళ్లు ఇప్పుడు వాళ్ల చుట్టూ మూగుతున్నారు. వాళ్లీ కొత్తగా లభించిన పాపులారిటీని పూర్తిగా ఆనందంగా అనుభవించేస్తున్నారు.**





ముందు వాళ్లు మాట్లాడుకుంటూ నడుస్తుంటే వెనుక నెమ్మదిగా నడుస్తూ పక్షి కూతలు వింటున్నాడు కిరణ్.

ఒక పక్షి అరుస్తూ ఓ చెట్టు మీదనుంచి మరో చెట్టుమీదకు ఎగురుతోంది. ఇంకో పక్షి చూసేందుకు చిన్నగా ఉంది కానీ కొమ్మపైనుంచి అరుస్తోంటే, మొత్తం అడవి దద్దరిల్లుతోంది.

వాటిని చూస్తుంటే ఎంతో హాయిగా, ఆనందంగా అనిపిస్తోంది.

అంతలోనే ఎందుకీ సృష్టి? ఏమిటీ సృష్టి? అన్న ఆలోచనలు వస్తున్నాయి.

ఇన్ని రకాల జీవాలు, ఇన్ని రకాల ప్రాణులు... ఎందుకోసం? వీటిలో మనిషి స్థానం ఏమిటి?

మిగతా జీవులన్నీ తిండి, సంతానోత్పత్తి మాత్రమే లక్ష్యంగా బతుకుతాయి. కానీ మనిషికి వీటితోపాటు ఆనందం, వినోదం, ఆలోచన వంటి వైనాలనేకం ఉన్నాయి.

కాలికింద పాకే చీమదీ ప్రాణమే, ఎగిరే పక్షిదీ ప్రాణమే, మనిషిదీ ప్రాణమే. ఇన్ని ప్రాణుల్లో ఒకే ప్రాణం ఇన్ని విభిన్న రూపాల్లో ప్రసరించటంలో అర్థం ఏమిటి?

ఆలోచనలతోనే జలపాతం చేరారు.

జలపాతానికి హోరు లేదు. నిశ్శబ్దంగా కొండపైనుండి జాలువారుతోంది. పాయలు పాయలుగా చీలి నిశ్శబ్దంగా జాలువారుతున్న ఆ జలపాత దృశ్యం ఎవరో చేయి తిరిగిన చిత్రకారుడు చిత్రించిన దృశ్యంలా ఉంది.

కిరణ్ మౌనంగా ఆ దృశ్యాన్నే చూస్తూ కళ్లద్వారా హృదయంలోకి ప్రతిష్ఠించుకునే ప్రయత్నాలు చేస్తున్నాడు.

సెలిన్, చేతన్‌లు నీళ్లలో దిగి స్నానం చేస్తున్నారు.

ఆరోహి వచ్చి కిరణ్ పక్కన నుంచుంది. ఆమె వైపు తిరిగి చూసి నవ్వాడు కిరణ్. ప్రతిగా నవ్వింది ఆరోహి.

'మిమ్మల్ని చూస్తే ఎంబిబియస్ చదివిన

అమ్మాయిలా అనిపించటంలేదు. ఏ ఎనిమిదో, తొమ్మిదో తరగతి అంటే నమ్మబుద్ధేస్తుంది' అన్నాడు కిరణ్ నవ్వుతూ.

వెంటనే ఆరోహి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

'మొదటినుంచీ నాకిదే సమస్య. నేను పొట్టిగా ఉండటంవల్ల అందరూ నన్ను ఏడ్పిస్తారు. మా క్లాస్‌మేట్స్ నన్ను స్టూల్ డాక్టర్ అంటారు' అంది.

'స్టూల్ డాక్టరా? ' నవ్వాడు కిరణ్.

'నా హాస్పిటల్‌కి పేషెంట్లు స్టూళ్లు తెచ్చుకోవాలట. నేను ఆ బల్లమీద ఎక్కి వాళ్లను పరీక్షించాలట' కళ్లనుంచి నీళ్లు కారసాగాయి.

'మీరు పొట్టి అవటంవల్ల మీకు బాయ్ ఫ్రెండ్ కూడా లేడనుకుంటాను' సూటిగా అడిగాడు కిరణ్.

'అవును. పొట్టిగా ఉన్నంత మాత్రాన నాకు కోరికలుండవా? నేను మనిషిని కానా? ప్రతివాడూ నన్ను చిన్నపిల్లలా చూస్తాడు. మా అమ్మ కూడా నన్ను ఇంకా చిన్నపిల్ల అనుకుంటుంది. చెప్పండి నేను అందంగా లేనా? ఆకర్షణీయంగా లేనా? '

ఇరవైనాలుగు గంటల క్రితం ఓ అమ్మాయి ఇదే ప్రశ్న అడిగింది. నవ్వాడు కిరణ్.

'ఆరోహి... నువ్వు నీలాగా ఉంటేనే అందంగా ఉంటావు. ఇంకెవరి అభిప్రాయం ప్రకారమో మారాలని ప్రయత్నించకు. నువ్వు చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉన్నావు. నీ అందం దూరం నుంచి తెలియదు. నీ దగ్గరకు వచ్చినవాడు నిన్ను వదలిపోడు' మనస్ఫూర్తిగా అన్నాడు కిరణ్.

ఎంత అందమైన అమ్మాయికయినా, మనస్సులో ఏదో మూల తాను అందగత్తెని కాదన్న అభద్రతా భావం ఉంటుంది. అందులో అందమంటే కాస్మటిక్ బ్యూటీలు మాత్రమే అన్న ప్రచారం విస్తృతంగా జరుగుతున్న సమాజంలో ఆ అభద్రతాభావం ఇంకా ఎక్కువగా ఉండటం సహజం. పైగా అమ్మాయి ఆరోహిలా పొట్టిగా ఉందంటే అది మరీ ఎక్కువగా ఉంటుంది.

'ఏదీ నీకు ఇష్టమైన పాట ఒకటి పాడు. ఈ అందమైన ప్రకృతి దృశ్యంతో పాటు నీ పాటనూ గుర్తుంచుకుంటాను' అడిగాడు కిరణ్.

మళ్లీ అడిగించుకోకుండా హిందీ సినిమా పాట ఆరంభించింది. 'జరాజరా బహక్ తాహై యె తన్ బదన్, మై ప్యాసీ హూ, ముఝే లేలో అప్నీ బాహోం మే' అంటూ పాడింది. (నా తనువు మత్తుగా తూగుతోంది. నేను దప్పిక గొని ఉన్నాను. నీ బాహువుల్లో బంధించు నన్ను) కిరణ్ మనస్సు బాధతో మూల్గింది.

ఈ అమ్మాయే కాదు, ఈ వయసులోని యువతీయువకులంతా ప్రేమ రాహిత్యంతో బాధపడుతున్నారు. దీనికి సగం కారణం విచ్ఛిన్నమైన ఉమ్మడి కుటుంబాలు, తీరిక లేని తల్లిదండ్రులయితే, మిగతా సగం కారణం సినిమాలు!

పాట పాడి కళ్లు తుడుచుకుంది ఆరోహి.

'ఆరోహీ' అంటూ నీళ్లలో కోసిన పూలను పట్టుకొచ్చాడు చేతన్. మెరుస్తున్న కళ్లతో వాటిని అందుకొంది ఆరోహి.

దూరం నుంచి ఇదంతా చూస్తూ సిగరెట్ వెలిగించాడు సెలిన్.




క్యాంపు చేరుతుంటే ఓ జీపు విసురుగా మలుపు తిరిగి క్యాంపు ఆవరణలో ఆగింది. దాన్లోంచి మనోహర్ జోషి దిగాడు. అతడి ముఖం చూడగానే అతను కోపంగా ఉన్నాడని తెలుస్తోంది. అతనితో పాటు రజిత ఉంది.

'అందరినీ పిలు' క్యాంప్ లీడర్‌తో చెప్పాడు మనోహర్.

క్యాంప్ లీడర్ విజిల్ వేశాడు.

అందరూ సమావేశం కాగానే అరవటం ఆరంభించాడు మనోహర్.

'మీరు ట్రెక్కింగ్‌కి వచ్చారు. తాగి ఎంజాయ్ చేయటానికి రాలేదు. నిన్న రాత్రి మీ క్యాంపులో జరిగింది నాకు తెలిసింది. అసహ్యకరమైన సంఘటన అది. నిన్న తాగిన వాళ్లు మర్యాదగా పక్కకు రండి. లేకపోతే నా దగ్గిర లిస్టుంది. నేను పిలుస్తాను. తాగటం కన్నా ఘోరమైన నేరం అమ్మాయిలతో అసభ్యంగా ప్రవర్తించటం. మీకు అక్క చెల్లెళ్లు లేరా? మీ అక్క చెల్లెళ్లతో ఎవరైనా ఇలా ప్రవర్తిస్తే మీరు ఊరుకుంటారా?'

ఎవ్వరూ మాట్లాడలేదు.

మనోహర్ తన జేబులోంచి కాగితం ముక్క తీశాడు.

'సందీప్... తివారి, ఆశుతోష్, బిస్వజిత్' మీ నలుగురు సామాన్లు సర్దుకోండి.

'మీరింక ఈ ట్రెక్కింగ్ చేసేందుకు అర్హులు కారు. కమాన్' అరిచాడు మనోహర్.

'సార్... జరిగిందేమిటో సరిగ్గా విచారించకుండా' ఏదో చెప్పబోయాడు బిస్వజిత్.



## టేబుల్ మీల్సోపాఖ్యానం

జాషువా చెన్నైలో కొంతకాలం వార్ ఆఫీసర్‌గా ఉండేవారు. ఆఫీసర్ కనుక సూటు, బూటు వేసుకోమని మిత్రులు సలహా ఇచ్చారు. సాధారణంగా పంచె, చొక్కా ధరించే ఆయన వాళ్లమాట విని సూటు కుట్టించారు. బూటు కొన్నారు. ఆ రెండూ ధరించి భోజనం చేసేటప్పుడు కింద కూర్చోవడం బాగోదని ఎవరో చెబితే టేబుల్ మీల్స్‌కు ఏర్పాట్లు చేసుకున్నారు. సూటు, బూటుతో టేబుల్‌మీల్స్ చేస్తూ చేత్తో కలుపుకోవడం ఏమిటి? స్పూన్, స్పోర్క్ వాడండని మరొకరు సలహా ఇవ్వడంతో అవీ తెప్పించారు.

అయితే అలవాటులేని కారణంగా స్పోర్క్ నోట్లో గుచ్చుకుంది. అంతే.. ఆయన స్పూన్, స్పోర్క్ పక్కన పడేశారు.. ఆ రెండూ లేనప్పుడు బల్ల, కుర్చీ ఎందుకని వాటినీ పక్కన పెట్టేశారు. చాపమీద కూర్చుని తినేటప్పుడు సూటు బూటు అసౌకర్యంగా ఉందని విప్పేసి, తన సాధారణ చొక్కా, పంచెలోకి వచ్చేశారు.. ఈ విషయం ఆయన స్నేహితులతో చెప్పేతీరు కడుపు చెక్కలయ్యేలా నవ్విస్తుంది.

'జరిగింది నాకు అనవసరం. మీరు తాగి అనవసరంగా, అసభ్యంగా ప్రవర్తించారు. పదండి' ఆజ్ఞాపించాడు.

'మీరు మా బిస్వజిత్‌ని తీసుకెళ్తే మేమంతా ఇప్పుడే ట్రెక్కింగ్ వదలి వెళ్తాం' ముక్తకంఠంతో చెప్పారు బెంగాలీవాళ్లు.

'ఇంకా ఎవరెవరు వెళ్తారో చెప్పండి. ఇష్టం లేనివారు వెళ్లిపోవచ్చు. ఇక్కడ ట్రెక్కింగ్ చేయాలంటే మా నియమాలను పాటించి తీరాల్సిందే' ఖచ్చితంగా చెప్పాడు మనోహర్.

'సార్. ఇది అన్యాయం. తాగటమే నేరమైతే సగం మంది తాగారు' బొంబాయి నటుడు దినేష్ ముందుకు వచ్చాడు.

'తాగి గ్రూప్ లీడర్‌తో వాదించటం నేరం'

అన్నాడు మనోహర్.

దాంతో అందరికీ అర్థమయింది. ఇది గ్రూప్ లీడర్ నిర్వాకం అని. రాత్రి బెంగాలీలు అతనితో వాగ్యుద్ధానికి దిగారు. ప్రొద్దునే అతడు కంప్లయింట్ ఇచ్చి ఉంటాడు.

కిరణ్‌కు అసహ్యమనిపించింది.

నాయకుడు అన్నవాడు తన వారి తప్పులను కప్పెట్టుకుంటూ రావాలి. అలాగని నేరాలను చూసీచూడనట్టు వదిలేయకూడదు. అలాకాక ప్రతి చిన్న విషయానికీ పై అధికారులపై ఆధారపడేవాడు తన క్రింది వారి గౌరవం ఎలా పొందుతాడు?

దేశమంతా జరిగేది ఇదే. నాయకత్వ లక్షణాలున్న వాడికి అధికారంపై వ్యామోహం ఉండదు. అధికారంపై వ్యామోహం ఉన్న వాడు నాయకుడు కాలేడు.

'మీకు చివరిసారిగా చెప్తున్నాను. మీరు ఆడపిల్లలను కష్టపెట్టొద్దు. వారితో అసభ్యంగా ప్రవర్తించవద్దు. అలాగే ఎవరినీ మతం పేరిట దూషించవద్దు. ఎవరో మతం పేరెత్తి దూషించారని తెలిసింది. అటువంటివి మళ్లీ జరగకూడదు.' హెచ్చరించి వెళ్లిపోయాడు.

అందరి మనసులు పాడయిపోయాయి.

'ఇది అన్యాయం. అసలీ గొడవకంతా కారణం కాశ్మీరీవాళ్లు. వాళ్ల డాన్సు చూసేందుకు వెళ్లకపోతే అసలు సమస్య వచ్చేది కాదు. డాన్సులు చూడటానికి వెళ్లిన వాళ్లని వదిలేసి వేరేవాళ్లని శిక్షించటం అన్యాయం. అమ్మాయిల్ని బారుకు తీసుకెళ్లి బీరు తాగించిన వాడిని వదిలేసి వేరేవాళ్లని దూషించటం అన్యాయం. వాళ్లని ఎందుకు వదిలేశారంటే, వాళ్లు కాశ్మీరీవాళ్లు కాబట్టి. అయితే ఏం గొప్ప?' బొంబాయివాళ్లు రంగంలోకి దూకారు.

'ఇవ్వాళ క్యాంప్‌ఫైర్‌ని మనం బాయ్‌కాట్ చేద్దాం' అందరూ నిర్ణయించుకున్నారు.

డిన్నర్ కాగానే ఎవరి టెంట్లలోకి వాళ్లు వెళ్లిపోయారు.

క్యాంప్‌ఫైర్‌లో అమ్మాయిలు, కాశ్మీరీలు, గ్రూప్‌లీడర్ మాత్రమే పాల్గొన్నారు.

టెంట్‌లో పడుకున్న కిరణ్‌కి నిద్ర రావటం లేదు. అటూ ఇటూ పొర్లసాగాడు. ఇంతలో క్యాంప్‌ఫైర్‌లో ఎవరో అమ్మాయి 'ఆc ఆc' అంటూ అలాపన తీసింది. ఆ నిశ్శబ్దంలో ఆ ఆలాపన ఎంతో మధురంగా, తేనెలొలుకుతున్నట్టు తోచింది. పాట అందుకుంది.

జో తుమ్ తోడో పియా మై నహీ తోడూరే
తేరె ప్రీత్ తోడ్ కృష్ణ, కౌన్ సంగ్ జోడూరే.

మీరా భజన అది. ఎప్పుడయినా వాదించుకుని తాను అలిగితే, వీణ ఈ పాట పాడేది.

'నువ్వు అలిగి నాతో బంధం తెంచుకున్నా నేను నీతో బంధం తెంచుకోను. ఎందుకంటే నీతో తెంపుకున్న ప్రేమను ఇంకెవరితో కలుపుకోగలను' అని ఆ మీరా భజనకు అర్థం.

ఆ పాడుతున్న అమ్మాయి కూడా రాగయుక్తంగా, భావాన్ని అనుభవిస్తూ పాడుతున్నట్టు పాడుతోంది.

ఆ పాట వల్ల చెలరేగిన తరంగాలు చెవుల ద్వారా హృదయాన్ని చేరి, హృదయపు లోతులలో ప్రకంపనలు కలిగిస్తున్నాయి.

కిరణ్ తన్మయుడయిపోయాడు.

ఆమె పాట పూర్తి చేయగానే చప్పట్లు చరిచి మళ్లీ పాడమని బతిమిలాడాలనిపించింది. ఇంతలో వేరే ఎవరో పాటనందుకున్నారు.




తెల్లారి లేచి నడక ప్రారంభించారు. ఆ రోజు కొండ ఎక్కాలి.

దూధ్‌సాగర్ జలపాతం పైకి ఎక్కి, ఆవైపుకి దిగాలి. కొండకు ఈ వైపు గోవా రాష్ట్రం. కొండ దిగితే కర్ణాటక రాష్ట్రం.

కొండ ఎక్కటం కఠినంగా అనిపించింది. అడుగు తీసి అడుగు వేయటం కష్టంగా ఉంది.

'హిమాలయాల ఎత్తులతో పోలిస్తే ఈ ఎత్తు ఒక లెక్క కాదు. కొన్ని అడుగులేయగానే మనం కొన్ని వేల అడుగుల ఎత్తుకు వెళ్తాం. పైకి వెళ్లిన కొద్దీ ఆక్సిజన్ తక్కువ అవుతుంది. దాంతో త్వరగా అలసిపోతాం. అడుగు తీసి అడుగు వేయటం గగనంగా ఉంటుంది. నిజంగా అదొక కఠినమైన అద్భుతమైన అనుభవం.

'ఇంత కష్టపడుతూ ఇంత ఎత్తులు ఎక్కాలా? ఎందుకు వచ్చానో అర్థం కావటం లేదు. హాయిగా ఇంట్లో కడుపులో చల్ల కదలకుండా ఉండేదాన్ని' ఆయాసపడుతూ కూర్చుండి పోయింది అనూరాధ.

ఆరోహి ఆమెకి చేయి ఊపి చేతన్‌తో చకచకా నవ్వుతూ వెళ్లిపోయింది. వెనకాలే సెలిన్ వెళ్లాడు.

అనూరాధ కాస్త లావుగా ఉండటంతో ఎత్తు ఎక్కటం ఆమెకి మరింత కష్టంగా ఉంది. అమె మాటలకి మురుమ్కర్ నవ్వాడు. అతనికి కూడా చెమటలు కారిపోతున్నాయి.

'నువ్వన్న మాటలు నిజమే అనూరాధా. కానీ ఒకటి ఆలోచించు. మనిషి ఉట్టిగా కూర్చోలేడు. అతడికి జీవితంలో ఉద్వేగం కావాలి. ఉద్విగ్నత కావాలి. సాహసం కావాలి. అదీగాక మనిషి అనంతం నుండి వచ్చి పరిమితం అయ్యాడు. అతనిలో మళ్లీ అనంతంలో చేరిపోవాలన్న తపన ఉంటుంది. తనని తాను అన్వేషించే జిజ్ఞాస ఉంటుంది. దాని ఫలితాలే కొండ లెక్కటం, లోయల్లో దూకటం, రకరకాల సాహసకృత్యాలు చేయటం, కొండలెక్కటం అంటే యాంత్రికంగా అడుగు తీసి అడుగులేయటం కాదు. అడుగడుగుకీ నీలో నువ్వు చూసుకుంటూ నిన్ను నువ్వు తెలుసుకోవటం' ఆయాసంతో ఆగాడు మురుమ్కర్.

ఇంతలో ఒక మనోహరమైన దృశ్యం కనబడింది.

దాదాపుగా శిఖరం చేరుకున్నారు వారు. కింద దూధ్‌సాగర్ జలపాతం కొండపై భగవంతుడు గీసిన సన్నని రేఖలా కనిపిస్తోంది.

ఓ రైలు కొండను తొలుచుకునిపోవటం కనిపించింది. పైన పచ్చటి చెట్లతో అలరారే శిఖరం.

కింద జలపాతం.. నడుమన కొండలో మెలికలు తిరుగుతూ ప్రయాణిస్తున్న రైలు.. అది చూస్తూ, రైలు వెళ్లిపోయిన తరువాత కూడా చాలా సేపు నిలబడిపోయారు.

'ఇంత అందం ఎందుకుందో ప్రకృతిలో?' అప్రయత్నంగా అన్నాడు కిరణ్.

'బహుశా తన శక్తిపై, ఇంద్రియాలపై సంపూర్ణ విశ్వాసముంచి, ఇంద్రియాతీతమైన వాటన్నిటినీ కాదని, విర్రవీగే మానవుడికి సృష్టిలో తన స్థానాన్ని తెలిపేందుకు అనుకుంటా. ఇక్కడ కాదు కానీ, హిమాలయాలకు వెళ్తే నీకు భగవంతుడి విరాట్ సృజనాత్మకత అర్థమౌతుంది. ఆ మంచుకొండలు ప్రదర్శించే అనన్య సామాన్యమైన సౌందర్యం మదిలో ఆనందం కలిగిస్తుంది. భీతి కలిగిస్తుంది. పవిత్రభావన కలిగిస్తుంది. నిజంగా ఆ హిమాలయ శిఖరానికి ఆవల భగవంతుడు నర్తనం ఆడుతున్నాడేమో అనిపిస్తుంది. ఆ నర్తన పదఘట్టనల స్వరూపమే ఈ ప్రపంచం అనిపిస్తుంది.' కళ్లు మూసుకున్నాడు మురుమ్కర్.

చాలాసేపు మౌనంగా ఉండిపోయారు. చివరికి నెమ్మదిగా నడవటం ఆరంభించారు.

★ ★ ★

అందరూ శిఖరం చేరుకున్నారు. గ్రూప్‌లీ

## గురకరాయుళ్లూ బహుపరాక్

**చే**సిన పని ఏమీలేకపోయినా ఉసూరుమంటూ ఉండే అలసటరాయుళ్ళను చూస్తే మహాచిరాకేస్తుంది ఎవర్కైనా. మన చిరాకుతో నిమిత్తం లేకుండా ఆ ఉసూరురా యుళ్ళు మాత్రం అలాగే ఉంటారు. ఉదయం నిద్రలేచినప్పటి నుంచి రాత్రి పడుకునే వరకూ ఒకటే అలసట అంటూనే ఉంటారు. రాత్రి ఎంత త్వరగా పడుకున్నా, నిద్ర ఎంత గాఢంగా పట్టినా ప్రొద్దున్నే లేవాలంటే అతిబద్ధ కంగా ఉంటుంది. అది సోమరి తనం కాదు. అందరూ అనుకు నేట్టు 'డిప్రెషన్' కూడా కాకపో వచ్చు. కొందరు నిద్రపోయినట్టే ఉంటారు కానీ గురక పెడు తూంటారు. 'గురక' పెట్టటం అంటే శ్వాసక్రియకు ఏదో అడ్డంకి కలుగుతోందన్నమాట.




దాంతో ఊపిరితిత్తులకు చేరాల్సిన గాలి సరిగ్గా చేరదు. మెదడుకు అందాల్సిన ఆక్సిజన్ అందదు. అందువల్ల నిద్రపట్టినట్లు ఉన్నా మెదడుకు విశ్రాంతి ఉండదు. కాబట్టి నిద్ర లేచినా అలసిపోతున్నట్టే ఉంటుంది. సాధారణంగా మగవాళ్లే గురకపెడతారన్న అపోహ ఉంది. అందుకని అలసిపోతున్నామనే ఆడవాళ్ల అలసటకు డాక్టర్లు వేరే కార ణాలు వెతుకుతూంటారు. కానీ నిజానికి ఆడవాళ్లూ గురకలు పెడతారు. కాబట్టి గుర కపెట్టటం దీర్ఘనిద్రకు చిహ్నంగా భావించటం మాని రాబోయే ప్రమాదానికి సంకే తంలా భావించి జాగ్రత్తపడాల్సి ఉంటుంది.

డర్ మొత్తం అందరినీ లెక్కించాడు.

'ఇదిగో ఈ దారిలో రావాలి' దారి చూపించి, తన అన్న కూతుళ్లతో ముందు నడవసాగాడు. అప్పుడే చేరుకున్న కిరణ్, అనూరాధ, మురుమ్కర్‌లు కాసేపు కూచో వాలని నిశ్చయించుకున్నారు.

సురభి, ప్రాజక్త, అసావేరి, మంజు కూర్చుని ఏవో మాట్లాడుకుంటున్నారు. మంజు ముఖం దిగాలుగా ఉంది.

కిరణ్‌కు గుర్తుకు వచ్చింది- మంజు జార్ఖండ్ నుంచి వచ్చిందని. ఆమెతో వచ్చిన ఇద్దరిని అవమానించి ట్రెక్కింగ్ నుంచి పంపేశారు. ఆమె ఎంత అవమానంగా భావిస్తోందో!

వాళ్లతో ఉన్నా ఎవ్వరితో కలవనట్టు దూరంగా ఉండి, విషాదంగా తల వంచు కున్న ఆమెని చూడగానే ఆమె మనస్థితి అర్థమౌతోంది.

ముందే వెనకబడిన జాతివారి రాష్ట్రం నుండి వచ్చింది. ఒక రకమైన న్యూనతా భావం ఈ పట్నం నుండి వచ్చిన ఆధునిక దుస్తుల, వ్యవహారాల అమ్మాయిలను చూడ



పైన పక్షుల కిలకిలలు తప్ప మరో శబ్దం లేదు. పచ్చటి దట్టమైన చెట్లు, సర్వ ప్రకృతి ఊపిరి బిగబట్టి ఏదో సంఘటన కోసం ఉద్విగ్నంగా ఎదురుచూస్తున్నదనిపిస్తోంది.



గానే కలుగుతుంది. దానికితోడు తన వారికి అవమానం జరిగింది. దాంతో న్యూనతాభావంలోనే కొట్టుమిట్టాడుతూ అందులోనే మునిగి తేలుతూంటుంది.

'నిన్న మీరా భజన పాడిందెవరు?' అడిగాడు కిరణ్ వాళ్లని.

'ఈమె' అసావేరి వైపు చూపించారు. తెల్లగా, బొద్దుగా, సోడాబుడ్డి కళ్లద్దాలతో ఉన్న ఈ అమ్మాయి మీరా భజన పాడిందంటే విని ఆశ్చ ర్యపోయాడు కిరణ్. క్యాంప్‌ఫైర్‌లో ఈ అమ్మాయి ఎప్పుడూ ఇంగ్లీషు పాటలు పాడేది. అదే అడిగాడు కిరణ్.

'అందరికీ అవే నచ్చుతాయికదా. మీరా భజనలు ఎవరు వింటారు?' అందా అమ్మాయి.

'నేను వింటాను. వెయ్యిమంది అర్థం చేసుకోలేని శ్రోతల కన్నా ఒక అర్థం చేసుకునే శ్రోత ముందు చేసే కళా ప్రదర్శనకు సార్థకత ఉంటుంది. శాస్త్రీయ సంగీతం నేర్చుకుంటున్నావా?' అడిగాడు కిరణ్.

తల ఊపిందా అమ్మాయి.

'కిశోరి అమోన్కర్ పేరు విన్నారా, అమె శిష్యురాలి దగ్గర నేర్చుకుం టున్నాను'

'నా కోసం ఒక్క మీరా భజన పాడతావా?'

ఇబ్బందిగా నవ్వింది 'ఇప్పుడు అలసిపోయాను. మళ్లీ ఎప్పుడయినా' అంది.

కిరణ్ తల ఊపాడు. 'మీ దయ మా ప్రాప్తం' అన్నాడు.

'మేం నడుస్తూంటాం' లేచారు మురుమ్కర్, అనూరాధ.

వాళ్లు వెళ్లిన తరువాత కిరణ్‌ని అడిగింది అసావేరి 'మీరూ ఎప్పుడూ ఆలోచిస్తుంటారు. ఏ విషయం గురించి అంత ఆలోచన?'

నవ్వాడు కిరణ్. 'ఇదీ అని లేదు. ప్రతి విషయం నాలో ఏదో స్పందన కలిగిస్తుంటుంది. దాని గురించి ఆలోచిస్తుంటాను'

బాగుంది సమాధానం అని నవ్వింది.

'మనమూ వెళ్దామా?' లేస్తూ అడిగింది సురభి.

'మీరు వెళ్లండి. నేను కాస్సేపు కూచుంటాను' కిరణ్ వైపు చూస్తూ చెప్పింది అసావేరి.

'నేనూ కూర్చుంటాను' తనని రమ్మని అడిగిన వాళ్లతో చెప్పాడు కిరణ్.

అందరూ వెళ్లిపోయారు.

ఆ అడవిలో ఇద్దరే ఉన్నారు.

పైన పక్షుల కిలకిలలు తప్ప మరో శబ్దం లేదు. పచ్చటి దట్టమైన చెట్లు, సర్వ ప్రకృతి ఊపిరి బిగబట్టి ఏదో సంఘటన కోసం ఉద్వి గ్నంగా ఎదురుచూస్తున్నదనిపిస్తోంది.

తాను ఓ అందమైన అమ్మాయితో అర్ధరాత్రి ఒంటరిగా ఉన్నప్పుడు కూడా కలగని ఉద్విగ్నత ఇప్పుడెందుకు కలుగుతోందో అర్థం కాలేదు కిరణ్‌కు. పైగా ఈ అమ్మాయి ఎంతో చిన్నపిల్ల.

హఠాత్తుగా రాగాలాపన చేసింది అసావేరి.

కిరణ్ మనస్సు లోతుల్లోంచి 'ఆహా' అన్న శబ్దం వెలువడింది.

'మాయ మాయ... మాయ మాయ...' మీరా భజనను పాడసాగింది అసావేరి.

ఆమె పాటలోని రాగాలు, స్వరం, శబ్దాలు సర్వం కిరణ్ మనస్సుకు రెక్కలిచ్చాయి.

అతడి ఆత్మను మృదువైన, మధురమైన సంగీత లోకపు లోతుల్లోకి తీసుకుపోయాయి.

ఆ భజన అవుతూనే మరో భజన అందుకుంది. 'హేరీ మై ప్రేమ్ దివానీ, మేరా దర్ద్ న జానే కోయీ'

ప్రేమ అనే మధుర భావన భగవంతుని అర్థం చేసుకునే ఒక సాధన అన్న పవిత్రభావాన్ని ప్రదర్శించే అక్షరాలు, ఆ పవిత్రభావనను ప్రతిఫలించే రాగంలో మిళితమై, ఆ పవిత్రభావనను అనుభవిస్తున్న స్వరంలో ఒదిగి, శ్రోత శరీరం అణువణువునా పవిత్రభావనాతరంగాలను నింపసాగాయి.

'సాంవ్‌రా మారి ప్రీత్ నిభావోజీ'

కిరణ్ కళ్ల నుంచి నీళ్లు ధారాపాతంగా కారిపోతున్నాయి. ప్రకృతి సర్వం పులకరించినట్టు కేరింతలు కొట్టసాగింది.

'కర్నా ఫకిరి ఫిర్ క్యా దిల్గిరి, సదా మగన్ మై రహనారే' ఊగిపోయాడు కిరణ్. ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. ఒక శక్తివంతమైన అల తనను నీటి గర్భానికి లాక్కుపోయిన భావన కలిగింది. ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. కానీ సుఖంగా సంతోషంగా ఉంది.

ఎందుకంటే తాను మునిగింది మహాద్భుతానంద మహాసాగరంలో.

బసో మేరి నయన్‌మే నందలాల్'

ఆ అక్షరాలు, ఆ రాగం, ఆ స్వరం ప్రేమ భావానికి ఆకారాన్నిచ్చాయి. అలా సృజించిన ఆకారం మనోహరుడయిన గిరిధారిది.

'మేరె తొ గిరిధర్ గోపాల్, దూసరా న కోయీ'

అప్రయత్నంగా కిరణ్ కళ్లు మూతపడ్డాయి. అతని చేతులు తాళం వేయసాగాయి. లయబద్ధంగా ఊగసాగాడు.

ఇక అలసిపోయి ఆగింది అసావేరి.

తపస్సు భంగం అయినట్టుంది కిరణ్‌కి. ఆమె అలా పాడుతూంటే తాను సంతోషంగా అక్కడే ఊపిరి విడిచి, ఆత్మను పరమేశ్వరుడి పాదాల చెంత చేరవేయాలన్న భావన తీవ్రంగా కలిగింది.

అంతవరకూ ఊపిరి బిగబట్టి పాటలు విన్న ప్రకృతి ఒక్కసారిగా నిట్టూర్చినట్టు పెద్దగా గాలి వీచింది.

ఎప్పుడొచ్చాయో, బహుశా ఆమె పాట వినేందుకు ఘనశ్యాముడు నల్లటి మేఘాల రూపు ధరించి వచ్చినట్టు, ఆకాశం నల్లగా, దట్టంగా మేఘాలతో నిండిపోయింది.

'వర్షం వచ్చేట్టుంది.' కిరణ్ మాట పూర్తి కాలేదు. ఆకాశం హర్షాతి



**ఆమె అలా పాడుతూంటే తాను సంతోషంగా అక్కడే ఊపిరి విడిచి, ఆత్మను పరమేశ్వరుడి పాదాల చెంత చేరవేయాలన్న భావన తీవ్రంగా కలిగింది.**





ఏ కోట ద్వారంనుంచో చూస్తే కనిపించే దృశ్యం కాదిది. ఔరా అనిపించే ఈ చిత్రంలో కనిపించేది రాతి ఆర్చ్ ఈ అర్ధగోళాకారపు రాతి ఆర్చ్‌ను ఎవరూ పనికట్టుకుని తొలచలేదు, కట్టనూలేదు. అనంత వింతలను, అద్భుతాలను ఆవిష్కరించే ప్రకృతే దీనిని కూడా ఆవిష్కరించింది. చైనాలోని గుయిలిన్ ప్రాంతం కొండలు, గుహలతో నిండిన అందమైన ప్రాంతం. వీటిలో అధికం సున్నపురాయితో రూపుదిద్దుకున్నవే. వీటిలో కొన్ని ఫ్యాక్టరీ గొట్టాలు, గుర్రం, ఒంటెలు, పైకెగబాకుతున్న తాబేళ్ళ రూపంలో ఉంటాయి. రూపాన్ని బట్టే వాటికి ఆ పేర్లు వచ్చాయి. జాగ్రత్తగా గమనించండి. ఈ రాతివంతెన గుర్రం ఆకారంలో లేదూ... ఫొటోలో కనిపిస్తున్న ప్రాంతాన్ని సిల్క్ హిల్ అంటారు. అక్కడ ఒకదాని పక్కన ఒకటిగా అనేక పర్వతాలు ఏర్పడ్డాయి. ఈ ప్రాంతం ఒకప్పుడు అతి ప్రాచీనమైన సముద్రపు అంతర్భాగంగా ఉండేది. ఆ సముద్రం పూర్తిగా ఇంకిపోయి పేరుకుపోయిన సున్నపురాయి గట్టిపడి ఈ కొండలుగా రూపుదిద్దుకుంది.

రేకంతో పూలజల్లు కురిపిస్తున్నట్టు వర్షం కురవసాగింది.

అంతవరకూ ఎండిపోయి దారులుగా ఉన్న బాట అంతా నీళ్లతో నిండి పోయింది. కొండ పైన పడిన నీళ్లు గబగబా క్రిందకు పారిపోసాగాయి.

దివినుంచి భువికి దిగిన గంగామాతలా నీరు ఉరుకులు పరుగులతో కిందకు దూకుతోంది, ఆకాశం నుంచి.

ఆకులపై టపటప పడుతున్న చినుకులు, ఆలస్యంగానైనా, మీరా భజన మాధుర్యానికి మేల్కొని తాళం వేస్తున్నట్టుంది... కాదు... ప్రకృతి సర్వం కరిగి నీరై, తమ అభినందనను కరతాళ ధ్వనులతో తెలుపుతున్నట్టుంది.

కిరణ్ హృదయం ఆనందంతో ఉప్పొంగింది.

పిడికెడంత మనిషిలో ఆకాశమంత ఆనందాన్ని సృజింపగల శక్తి ఉంది. అనంతమైన ఆనందాన్ని అనుభవించగల హృదయముంది.

తనలో అంత ఆనందం ఉందని, తనకే తెలియబరచిన ఆ పిడికెడంత అమ్మాయికి శిరస్సు వంచి నమస్కరించాడు కిరణ్.

అసావేరి నవ్వింది.

ఆమె అందం ఆమె అసమాన ప్రతిభ అనుకున్నాడు కిరణ్.

నిజం... ఎప్పుడయితే మనిషి తన శక్తి తాను గుర్తించలేకపోతాడో, తనలో దాగున్న ప్రతిభను అర్థం చేసుకోలేకపోతాడో, అప్పుడు ఎదుటి వారి ప్రతిభను చూసి న్యూన్యతాభావానికి గురవుతాడు. తాను అందంగా లేడనో, పొట్టివాడననో ఇలా రకరకాల కారణాలతో తన నిరాశను సమర్థించుకుంటాడు.

కానీ తన ప్రతిభను, తన ప్రత్యేకతను గుర్తించిన వ్యక్తి పొట్టివాడయినా, నల్లవాడయినా ఆత్మవిశ్వాసంతో ఆనందంగా ఉంటాడు. అతడి ప్రతిభ అతనికి వింత అందాన్నిస్తుంది. ఆత్మగౌరవాన్నిస్తుంది.

వర్షం తగ్గింది. ఇద్దరూ మౌనంగా కొండ దిగి వెళ్లారు.

క్రింద వాగు ఆవలివైపు అందరూ ఆతృతగా వీరికోసం ఎదురు చూస్తూ కనిపించారు.

నడుమ వాగు ఉధృతంగా ప్రవహిస్తోంది.

'ఏం చేస్తున్నారు మీరిద్దరూ ఇంతసేపు పైన? ఇక్కడ మేం భయంతో ఛస్తున్నాం. ఇప్పుడెలా దాటుతారు నదిని?' అరిచాడు గ్రూప్‌లీడర్.

రాజు, చంద్ర వెక్కిరింతగా, హేళనగా వీరిద్దరి వైపు చూసి నవ్వుతున్నారు.



'ఏం చేస్తున్నారు మీరిద్దరూ ఇంత సేపు పైన? ఇక్కడ మేం భయంతో ఛస్తున్నాం. ఇప్పుడెలా దాటుతారు నదిని?' అరిచాడు గ్రూప్‌లీడర్. రాజు, చంద్ర వెక్కిరింతగా, హేళనగా వీరిద్దరి వైపు చూసి నవ్వుతున్నారు.



'ఏం భయం లేదు' అన్నారు హర్యానావాళ్లు.

వాళ్లు నలుగురు ఒకరి చేయి ఒకరు పట్టుకుని నదిలో దిగారు. ఉధృతంగా తోసేస్తున్న ప్రవాహాన్ని ఎదిరిస్తూ నిలబడ్డారు.

'చేయి పట్టుకుని రండి' అన్నారు.

ముందు అసావేరిని వెళ్లమన్నాడు. ఆమె వెళ్లిన తరువాత తానూ నీళ్లలో దిగాడు. నీళ్లు చల్లగా ఉన్నాయి. ప్రవాహం ఉధృతంగా ఉంది. బలవంతంగా తనతో పాటు లాక్కెళ్లిపోవాలని ప్రయత్నిస్తోంది.

దానికి ఎదురు నిలవాలని మనిషి ప్రయత్ని స్తున్నాడు.

ప్రకృతికీ, మనిషికీ మధ్య జరిగే పోరు విచిత్రంగా అనిపించింది కిరణ్‌కు. ఎందు కంటే ప్రకృతి శక్తి ముందు మనిషి ఎందుకూ పనికిరాడు. అయినా ప్రకృతిని నిర్దేశించాలని, జయించి నిలవాలని మని షికి ఎందుకంత పట్టుదల?

మళ్లీ మౌనంగా నడక ప్రారంభించారు.

'నువ్వు ముందు నడువు' ఆజ్ఞాపించాడు రాజు. కిరణ్ ఏమీ అనలేదు. మౌనంగా నడవసాగాడు.

మనిషి స్వభావానికి నవ్వు వచ్చింది.

మౌనంగా నడుస్తున్న కిరణ్ దగ్గరకు నవీద్ వచ్చాడు

'భాయ్... నా జీవితం ఆనందమయం అయిపోయింది. ప్రీతి నన్ను ప్రేమిస్తున్నా నని చెప్పింది' సంతోషంగా చెప్పాడు నవీద్.

'కంగ్రాట్స్' నవ్వుతూ అన్నాడు కిరణ్. ప్రపంచంలో మగవాడిని మించిన మూర్ఖ మైన జీవి మరొకటి లేదనిపించింది.

స్త్రీ శారీరకంగా బలహీనురాలు కావచ్చు కానీ మానసికంగా శక్తిమంతురాలు. తలచు కుంటే మొత్తం ప్రపంచాన్ని తన కొనగోట తిప్పగలదు. ఆ శక్తికి భయపడే కాబోలు మగవాళ్లు పశుబలంతో స్త్రీని అణగదొక్కాలని ప్రయత్నిస్తారు. మరింతగా పశువులవుతారు.




కువేశీ క్యాంపు పక్కనే వాగు ప్రవహి స్తోంది. చీకటి పడుతూనే పున్నమి చంద్రుడు సగర్వంగా ఆకాశంలోకి వచ్చాడు.

వాగులో నీళ్లన్నీ వెన్నెలను తమలో కలు పుకుని తెల్లనై ప్రవహించటం చూసి ఆశ్చర్య పోయాడు కిరణ్. నీళ్లన్నీ ప్రవహించే వెన్నెల అయినట్లనిపించింది.

చాలాసేపు ఆ నీళ్లనూ, వెన్నెలనూ మార్చి మార్చి చూస్తూ కూచున్నాడు. జీవితంలో ఎన్నడూ కలగనంత శాంతి భావన అతని మదిలో కలుగుతోంది.

ప్రకృతిని ఇలా చూస్తుంటే తన గురించి తనకే ఏదో గొప్ప సత్యం అర్థమయిన భావన కలుగుతోంది.

మనిషి జన్మించింది పుట్టటం, కనటం, చావటం కోసం కాదు. అతని జీవితానికి యంత్రంలో యంత్రం అవటం కాదు పర మార్థం.

ప్రకృతిలో తన పాత్రను గ్రహించాలి మనిషి. భగవంతుడి అపరిమితమైన సృజ నాత్మకత తునక తనలోనూ ఉందని గ్రహిం చాలి.

తనలోని సున్నిత భావనలకు రెక్కలని వ్వాలి. మానవత్వాన్ని నిలుపుకోవాలి.

అంతర, బాహ్య ప్రకృతితో సమన్వయం సాధించాలి.

ఎంతో శాంతిగా అనిపిస్తోంది.

క్యాంప్‌ఫైర్ విజిల్ వినిపించింది.

ఆ వెన్నెలను, ఆ వెన్నెల ప్రవాహాన్ని, ఆ ప్రశాంత ప్రకృతిని వదలి క్యాంప్‌కు వెళ్లాడు కిరణ్.

'ఇవాళ మనం కొత్తరకం క్యాంప్‌ఫైర్ చేస్తున్నాం. మిమ్మల్ని నాలుగు జట్లుగా విభజిస్తాను. మీరు నలుగురు డ్రామాలు వేయాలి. ప్రాక్టీసుకు కేవలం పదిహేను నిమిషాల టైం మాత్రమే ఉంటుంది. మీలో ఉత్తమ డ్రామాను మన నటుడు దినేష్ నిర్ణ యిస్తాడు' చెప్పాడు క్యాంప్ లీడర్.

చకచకా నాలుగు జట్లుగా విభజించారు. మురుమ్కర్, కిరణ్, ప్రాజక్తలు ఒక జట్టు లోకి వచ్చారు.

'మీరు సాంఘిక దురన్యాయం, లేకపోతే పర్యావరణ పరిరక్షణ అంశాలుగా నాటిక

తయారు చేయాలి.' నేను విజిల్ వేయగానే మీరు ఇక్కడికి వచ్చేయాలి' చెప్పాడు క్యాంప్ లీడర్.

'మీ కెవరికయినా నాటకానుభవం ఉందా? ' అడిగాడు మురుమ్కర్.

'లేద'న్నారు అందరూ.

'వెరీగుడ్. నేను కమ్యూనిస్టు ఉద్యమంలో తిరిగిన రోజుల్లో బోలెడన్ని వీధినాటకాలు వేశాను. ఇప్పుడు సంభాషణలు చెప్పటం కష్టం. కాబట్టి సంభాషణలు లేని నాటిక చేద్దాం'

తన ఆలోచన వివరించాడు మురుమ్కర్.

'నాకు నటించాలంటే సిగ్గు' చెప్పింది ప్రాజక్త.

'డోన్ట్‌వర్రీ. ప్రాజక్త అంటే పూవు అని అర్థం. పూలు ప్రకృతిలో భాగం. నువ్వు మా ప్రకృతి దేవతవు' అని ఆమె పాత్రను వివరించాడు.

రిహార్సల్ ఆరంభించారు.

★ ★ ★

విజిల్ వేయగానే అందరికన్నా ముందు చేరుకున్నది మురుమ్కర్ జట్టే. చిట్టీలు వేశారు. తొలి నాటకం కూడా వారిదే. నాటకం ఆరంభించారు.

నలుగురు చేతులు పైకెత్తి పట్టుకుని కొండల్లా నిలిచారు. ఒక టవల్‌ను టార్చికి చుట్టి దాన్ని క్రింద నుంచి, రెండు చేతుల నడుమ నుంచి పైకెత్తాడు మురుమ్కర్. సూర్యోదయం అయిందన్నమాట. ప్రకృతి ఒళ్లు విరుచుకుని నిద్రలేచింది. వయ్యారంగా నిలబడింది ప్రాజక్త. వెంటనే మరో నలుగురు పిట్టల్లా గాల్లో తేలుతున్నట్టు చేతులూపుతూ కిచకిచ శబ్దాలు చేస్తూ అటు ఇటూ తిరగసాగారు.

ఇంతలో రైతులు దున్నసాగారు.

'మెరె దేశ్ కి ధర్తీ' పల్లవి పాడాడు మురుమ్కర్.

ఓ బాటసారి నడుస్తూ వచ్చి చెట్ల నీడన కూర్చున్నాడు. చెట్టు నుండి పళ్లు కోసుకుని తిన్నాడు. నీళ్లు తాగాడు.

ఇంతలో పట్నం నుండి వ్యాపారి వచ్చాడు. రైతు అతడిని బ్రతిమిలాడుతు



న్నాడు. వాడు రైతును తోసేశాడు. కొన్ని డబ్బులు విసిరేశాడు.

ఓ మనిషి రోడ్డు రోలర్‌లా వచ్చాడు. చెట్లను కొట్టేశాడు. పెద్ద భవంతులు కట్టసాగాడు. వయ్యారంగా నిలబడ్డ ప్రకృతి, భవంతులు ఎంత పైకిలేస్తే అంత కుంగిపోసాగింది. ఎగిరివచ్చిన పక్షులు చెట్లు కనబడక తిరిగి తిరిగి పడిపోయాయి. బాటసారి నీరు, నీడ లేక అలమటించిపోయాడు. మేఘాలు వచ్చి వర్షించకుండా వెళ్లిపోయాయి. ఓ పిల్లవాడు వచ్చి చిన్నచెట్టు నాటాడు. అలా చెట్లు భవంతులు దాటి ఎదిగాయి. వర్షం వచ్చింది. మళ్లీ ప్రకృతి ఒళ్లు విరుచుకుంది. పక్షులు ఆనందంగా ఎగరసాగాయి.

మధ్యలో ప్రాజక్త వయ్యారంగా నిలబడితే అందరూ ఆమె చుట్టూ పక్షుల్లా ఎగుర్తున్నట్టు తిరగసాగారు.

వెనుక నుంచి మురుమ్కర్ పాట అందుకున్నాడు

హరీహరీ వసుంధరాపె నీలనీల యే గగన్

యే కిస్కీ బాదలోంకి పాల్కీ ఉడారహా పవన్

దిశాయె దేఖో రంగ్ భరీ, చమక్‌రహీ ఉమంగ్ భరీ

యె కిస్నె ఫూల్ ఫూల్‌పె కియా సింగార్ హై

యె కౌన్ చిత్రకార్ హై, యె కౌన్ చిత్ర కార్ హై

చూస్తున్న వాళ్లంతా లేచి చప్పట్లు చరిచారు. జట్టంతా మురమ్కర్‌ని కౌగలించుకుని అభినందనలు తెలిపింది.

దినేష్ వైపు చూస్తే అతని కళ్లల్లో, తన



కన్నా ఉత్తమ కళాప్రదర్శన చేసిన కళాకారు డిని మరో కళాకారుడు చూసే చూపులో కనిపించే ఈర్ష్య, ద్వేషాలు కనిపించాయి.

పది నిమిషాల్లో పర్యావరణ సమస్యను ఎంతో అద్భుతంగా, ఒక్క సంభాషణ లేకుండా ప్రదర్శించాడు మురుమ్కర్.

తరువాత మరో జట్టు నాటకం మొదల యింది.

ఏం చేస్తున్నారో వాళ్లకే తెలియదు. నోటి కొచ్చింది మాట్లాడేస్తున్నారు.

'వీళ్లకి బహుమతి వస్తుంది' కిరణ్ చెవిలో చెప్పాడు మురుమ్కర్.

'ఏమీ రాదు. మన నాటకం ముందు అన్నీ బలాదూర్' విశ్వాసంగా అన్నాడు కిరణ్. నవ్వాడు మురుమ్కర్.

'నీకన్నా ఎక్కువ ప్రపంచాన్ని చూశాను నేను. న్యాయ నిర్ణేత ఎప్పుడయితే తనకన్నా ప్రతిభావంతమయిన కళాప్రదర్శన చూస్తాడో, అప్పుడు అభద్రతా భావానికి గురవుతాడు. ఎదుటివాడి ప్రతిభను గుర్తిం చినా, ఆధిక్యతను ఒప్పుకునేందుకు ఇష్టప డడు. సో... అణచిపెడతాడు'

'ఛ... ప్రతిభను, సూర్యకిరణాన్ని ఎవ్వరూ అడ్డుకోలేరు'

సగటు మనుషులు, అవగాహన, ఆలోచ నలు లేనివారు నిర్ణయాత్మకమయిన స్థానాల్లో ఉన్నప్పుడు సగటు స్థాయి కళలు, అవగాహన, ఆలోచన లేని కళాప్రదర్శనలు మాత్రమే ఉత్తమ కళలుగా ప్రచారం పొందుతాయి. ఎందుకంటే, తమపై స్థాయి కళాప్రదర్శనలు అర్థం కావు. అర్థమైనా మెచ్చేందుకు ఇష్టపడరు. అనేక సందర్భా లలో తిరస్కారానికి గురయిన కళాకారుడు నిరాశతో కళకు దూరమౌతాడు. వీళ్లకు కావలసిందీ అదే. అరుదైన సందర్భాలలో కళాకారుడు తన కళను వదలడు. ప్రతిబం ధకాలను ప్రయోగాత్మకంగా వాడుకుం టాడు. సగటు మనుషుల ప్రతిభారాహి త్యాన్ని వెక్కిరిస్తూ విజయం సాధిస్తాడు. అటువంటి వాళ్లు మార్గదర్శకులౌతారు. కళను నూతన పుంతలు తొక్కిస్తారు' ఆయాసం వచ్చి ఆగాడు మురుమ్కర్.

ఫలితాలు ప్రకటించారు.

మురుమ్కర్ చెప్పినట్టే జరిగింది. మురు మ్కర్ నాటకం ప్రసక్తే రాలేదు.

'ఇప్పుడు దినేష్ ఓ నాటకం వేస్తాడు' ప్రకటించారు.

'చూశావా... తను నాటకం వేసి ప్రతిభ నిరూపించుకోకపోతే దినేష్ అహం దెబ్బతిం టుంది. ఇదీ మన ప్రపంచం' హాయిగా నవ్వాడు మురుమ్కర్.

దినేష్ అటూ ఇటూ తిరిగాడు. వాళ్లతో వీళ్లతో చర్చించాడు. కానీ నాటకం వేయలే కపోయాడు.

మురుమ్కర్, కిరణ్ ఒకరినొకరు చూసుకుని నవ్వుకున్నారు.




మళ్లీ అడవిలోంచి ప్రయాణం.

దట్టమైన అడవి. ఎంత దట్టమైనదంటే తెల్లవారి కూడా టార్చి వేసుకుని నడవాల్సి వస్తోంది. నడుస్తుంటే దారికిరువైపులా ఉన్న చెట్లు గీసుకుపోతున్నాయి. పైన ప్రచండంగా సూర్యుడు వెలుగుతున్నా ఒక్క కిరణం భూమిని చేరటం లేదు.

'చీమలు దూరని చిట్టడవి. కాకులు దూరని కారడవి' అంటే ఇదేనేమో అనుకు న్నాడు కిరణ్.

ఇంతలో హఠాత్తుగా విశాలమైన స్థలం లోకి వచ్చారు. దూరంగా మళ్లీ అడవి ఆరం భమౌతోంది. ఒక్కసారిగా వెలుతురులోకి

## 'ఏకాంతుల'కు ఎన్నో ఇక్కట్లు

ఏకాంతంలో ఉన్న ఆనందం ఏ కాంతలోనూ లేదన్నాడో మహాకవి. కానీ జంటగా ఉన్న వాళ్లల్లో కన్నా ఒంటరిగా ఉండేవాళ్లకి గుండెపోటు వచ్చే అవకాశం రెండింతలు ఉందని అమెరికాలో 1200 మందిని పరిశోధించిన డాక్టర్లు కనుగొన్నారు. ఓ ప్రయోగంలో గుండెపోటు వచ్చిన వారిలో ఒంటరిగా ఉండేవారిని, జంటగా ఉండేవారిని పరిశీలించారు. వయసు పైబడటం, ఆర్థికంగా వెనకబడి ఉండటం వంటి విషయాలతో సంబంధం లేకుండా ఒంటరిగా ఉండేవారిలో 16 శాతం రోగులకు ఆరు నెలల్లోగా రెండోసారి గుండెపోటు వచ్చింది. అదే జంటగా ఉండేవారిలో 9 శాతం మందికే ఆరు నెలల్లో రెండోసారి గుండెపోటు వచ్చింది. ఎన్ని పరిశోధనలు చేసినా ఇందుకు కారణం బోధపడలేదు. చివరికి అన్ని విషయాలు పరిశీలించి డాక్టర్లు ఓ నిర్ణయానికి వచ్చారు. ఒంటరిగా ఉండేవారికి వేరే వ్యాపకం లేక మనస్సు ఎప్పుడూ జబ్బు గురించే ఆలోచిస్తూ దిగులుగా ఉంటుంది. వారిలో జీవితేచ్ఛ తగ్గుతుంది. అదే ఇతరులతో కలిసి ఉండేవారి దృష్టి జబ్బు నుంచి మళ్లుతుంది. అదీగాక హఠాత్తుగా సమస్య వచ్చినా వెంటనే డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళేవారు పక్కనే ఉంటారు. దాంతో ప్రమాదం తప్పుతుంది. అందుకే తన జీవన సహచరి మరణించినా, కొడుకు కూతుళ్లతో కలిసి ఉండేవారు ఎక్కువకాలం హాయిగా బతికే వీలుంటుంది అని అమెరికన్ డాక్టర్లు స్కెతస్తెతస్కోపులు ఊపి మరీ చెప్తున్నారు. ఇప్పుడనమనండి. 'ఏకాంతంలో ఉన్న ఆనందం ఏ కాంతలోనూ లేద'ని ఆ మహాకవిని!




వచ్చేసరికి కళ్లు వెలుతురుకు అలవాటు పడేందుకు సమయం పట్టింది.

కళ్లు చూడటం ఆరంభమయ్యేసరికి ఎదురుగా ఉన్న దృశ్యం చూసి ఆగిపోయాడు కిరణ్.

మైదానం మొత్తం బంగారు రంగు గడ్డి గర్వంగా గాలికి తల ఊపుతోంది. సూర్యకిరణాలను ఒక్కొక్క గడ్డిపోచ పీల్చుకుంటూ శక్తి పొందుతున్నట్టుంది. ఈ బంగారు గడ్డిని తినే జంతువుల అదృష్టమే అదృష్టం అనుకున్నాడు కిరణ్. నడుస్తూంటే కాళ్ల క్రింద బంగారు తివాచీ పరచినట్టుంది.

ఈ బంగారు మైదానాన్ని వెన్నెలలో చూస్తే!

వెన్నెలలో చూడలేని తన దురదృష్టాన్ని నిందించుకుంటూ, ఇంతయినా చూడగలుగు

తున్న తన అదృష్టాన్ని అభినందించు కుంటూ ముందుకుసాగాడు కిరణ్.

మళ్లీ అడవిలో ప్రవేశించారు. మళ్లీ చీకటి.

ఆలోచిస్తూ నడుస్తున్న కిరణ్ అందరూ ఆగిపోయి కనబడటంతో తానూ ఆగిపోయాడు.

'ఏమైంది?' అని అడగబోతూంటే 'ష్...' అని నిశ్శబ్దం సూచించారు.

దారివైపు చూసిన కిరణ్ గుండె ఆగినంత పని అయింది.

దారికి అడ్డంగా కూచుని వీళ్లవైపే చూస్తున్న ఎలుగుబంటి కనిపించింది. అందరూ స్థాణువులై నిలబడ్డారు. వణికిపోసాగాడు.

అరవాలని ప్రయత్నించినా నోరు పెగలటం లేదు. నోట్లోంచి గాలి బయటకు వస్తోంది కానీ శబ్దం రావటం లేదు.

సాధారణంగా అవి మానవుల బాటలోకి రావు. ఇది దారి తప్పి వచ్చినట్టుంది.

ఎలుగు వీళ్లవైపు తీక్షణంగా చూస్తూ, ఎర్రటి నోరు ప్రదర్శిస్తూ ఆవులించింది.

అక్కడున్న





వారి ప్రైప్రాణాలు పైనే పోయాయి. ఏడ్చే ధైర్యం కూడా లేదు. ఏడుపు శబ్దానికి అది మీద పడవచ్చు.

వెనక్కు తిరిగి పారిపోయేందుకూ లేదు. కదలికకు అది బెదరవచ్చు.

ఇంతలో హర్యానా పుల్వీందర్ ఒక్కసారిగా ఎలుగు ముందు దూకాడు. దాని ముఖంలో ముఖం పెట్టి 'బోలే సోని హాల్' అని పెద్దగా, దీర్ఘం తీస్తూ అడవి దద్దరిల్లేలా అరిచాడు.

దాంతో స్పృహలోకి వచ్చిన అందరూ గొంతు చించుకుని సత్యశ్రీ అకాల్' అని అరిచారు కళ్లు మూసుకుని.

కళ్లు తెరిచేసరికి ఎదురుగా ఎలుగు లేదు. వీళ్ల అరుపులకి అది పారిపోయింది.

అందరూ రిలీఫ్‌తో పెద్దగా నవ్వారు. కొందరి కళ్లల్లోంచి నీళ్లు కారసాగాయి.

అందరూ పుల్వీందర్‌ని అభినందించారు.

'అంత సమయస్ఫూర్తి ఎలా ప్రదర్శించావు? ' అడిగారంతా.

'నాకు భయం వేస్తే బోలేసోనిహాల్ అని అరవటం అలవాటు. అరిచానంతే. అంతా వాహెగురు దయ' అన్నాడు పుల్వీందర్.

అందరూ కలిసికట్టుగా నవ్వుతూ, నడవసాగారు. ఆ సంఘటన అందరి మధ్య

తేడాలు చెరిపేసింది. అందరినీ ఒక్కటి చేసింది. అందరూ పెద్ద గొంతుకతో కలసి పాటలు పాడుతూ నడవసాగారు.

ఈసారి దారిలో భూతం కాదు మృత్యువు ఉన్నా బెదిరిపోతుంది.

'కాజిల్ రాక్' క్యాంపులో క్యాంప్ ఫైర్ ధూంధాంగా జరిగింది.

ఎలుగుబంటి అనుభవంతో అందరిమధ్య అడ్డుగోడలు చెరిగిపోయాయి. అంతా ఒకటై పాటలు పాడారు. మంజు కూడా పాడింది.

ఆ రాత్రి క్యాంప్ ఫైర్ అయిపోతుంటే అనురాధ లేచి 'నేనొక ప్రకటన చేస్తున్నాను' అంది. అందరూ ఆమెవైపు చూశారు.

'నా కూతురు ఆరోహి, చేతన్ పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నారు. ముహూర్తం నిర్ణయం కాగానే అందరికీ చెప్తా' అంది.

అందరూ హర్షధ్వానాలు చేశారు. అభినందనలు తెలియచేశారు.

'నాకు ఇది అంత మంచిపని అనిపించటం లేదు' కిరణ్‌తో అన్నాడు సెలిన్.

'తొందరపాటు అనిపిస్తోంది. కానీ ఏం చేస్తాం? ' అన్నాడు కిరణ్.

ఆరోజే ట్రెక్కింగ్‌లో ఆఖరిరోజు కావటంతో అర్ధరాత్రి వరకూ క్యాంప్ ఫైర్ జరిగింది. చేతన్, ఆరోహి కలిసి 'చురాలియా హై తుమ్‌నే జో దిల్కో' పాడారు.




ఆరోజు బేస్ క్యాంప్ చేరాల్సిన రోజు. నడక కొంచెమే. ఆపై బస్సు ప్రయాణం. అందరూ ఉల్లాసంగా, ఆనందంగా ఉన్నారు. అడుగులు వేగంగా పడుతున్నాయి. దూరాలు కరిగిపోతున్నాయి. అందరూ అడ్రసులు మార్చుకుంటున్నారు.

దారిలో 'వ్యూ పాయింట్' వచ్చింది. అక్కడ నుంచి చూస్తే సగం గోవా కనిపిస్తుంది. అందరూ పైకి ఎక్కారు.

మంజు వచ్చింది కిరణ్ దగ్గరకు. తన అడ్రసు ఇచ్చింది.

'అన్నయ్యా... మేము వెనుకబడిన వాళ్లం అని, స్టయిలుగా లేం అని, ఇంగ్లీషు మాట్లాడలేం అని కదా మా వాళ్లని అవమానించారు. ఈ బొంబాయి, ఢిల్లీ అమ్మాయిలు చూడు ఎలా ప్రవర్తిస్తున్నారో? వాళ్ల డ్రస్సులు చూడు. వీళ్లనేమీ అనకుండా మమ్మల్నే అన్నారు. మేం వెనుకబడిన వాళ్లం అని కదా చిన్నచూపు' అంటూ గుడ్లనీరు కుక్కుకుంది.

'లేదమ్మా. అటువంటిదేమీ లేదు. మనోహర్ అహం దెబ్బతింది. రజితను వాళ్ల నాన్న వెనక్కి తీసుకువెళ్లాడు కదా. దాంతో ఏదో ఒకటి చేయకపోతే అతని మీద నమ్మకం పోతుంది. మళ్లీ ఎవరూ ట్రెక్కింగ్‌కి అమ్మాయిల్ని పంపరు. అందుకని, ఎవరినో ఒకరిని శిక్షించకపోతే లాభం లేదు. బలవంతుడు, బలహీనుడు ఇద్దరూ తప్పుచేసినా శిక్ష బలహీనుడికే పడుతుంది. అది లోకం రీతి. కాబట్టి మనం బలహీనులం కాకూడదు. నీకు తెలుసా మంజు, ఓ గొప్ప కవి ఏమన్నాడో...

జిందగీ భీక్‌మే నహీ మిల్తీ, జిందగీ బఢ్‌కె ఛీని జాతీహై

అప్నా హక్, సంగెదిల్ జమానేసే, ఛీన్ పావో తో కోయి బాత్ బనే

సర్ ఝుకానేసె కుఛ్‌నహీ హోతా, సర్ ఉఠావో కోయి బాత్ బనే.

నవ్వింది మంజు.

నిజం... జీవితం మనకు భిక్షగా లభించదు. జీవితాన్ని మనం మన హక్కుగా అనుభవించాలి. సమాజం నుంచి మన హక్కుల్ని మనం పోరాడి సాధించుకోవాలి. అంతేకానీ ఏడుస్తూ తల వంచితే ఏదీ సాధ్యంకాదు. తల ఎత్తి పోరాడితేనే ఏదైనా సాధించగలం.

ఇవి మంజుకే కాదు... తనకీ... అందరికీ

వర్తిస్తాయి.

అందరూ అడ్రసులు మార్చు కుంటున్నారు.

కిరణ్ దగ్గరకు ఎవ్వరూ రాలేదు. కిరణ్ ఎవ్వరినీ అడగ లేదు.

బస్సు బేస్ క్యాంపు చేరింది.

రాత్రి క్యాంప్‌ఫైర్‌లో అందరికీ సర్టిఫికెట్లిచ్చారు.

ఆ రాత్రి టెంటులో చెప్పారు రాజు, చంద్ర- 'కిరణ్, రేపు నువ్వొక్కడివే హైదరాబాద్ వెళ్లిపో. మా రిజర్వేషన్ కేన్సిల్ చేసెయ్యి'

'అదేం?'

ఇబ్బందిగా నవ్వాడు రాజు.

'స్వప్న, కశ్మీరాలు ఇంకో రెండు రోజులుండి గోవా చూస్తా రట. మేమూ ఓ రెండు రోజులు ఉండాలని అనుకుంటున్నాం'

కిరణ్ ఏమీ అనలేదు. 'మీ ఇష్టం' అన్నట్టు తల ఊపాడు.

మరుసటి రోజు తెల్లారి, క్యాంపులో పాత పేపర్లు తిరగే స్తుంటే కనబడిందో వార్త.

'దక్షిణ తీర ప్రాంతాలలో సునామీ తాకిడి'

వార్త చదువుతూంటేనే కిరణ్ ఒళ్లు కంపించింది. సముద్ర తరంగాల శక్తి జ్ఞప్తికి వచ్చింది. అల తాకిడికి తాను ఉక్కిరిబిక్కిరి అయిన సంఘటన గుర్తుకు వచ్చింది.

మామూలు సమయంలో అలకే ఇంత శక్తి ఉంటే, ఇక తుఫాను సమయంలో అలకు ఎంత శక్తి ఉంటుంది!

ఊహించాలంటేనే భయంగా ఉంది. పత్రిక తారీఖు చూశాడు.

సరిగ్గా తాము బీచ్ ఒడ్డున గడిపిన రోజు. ఆరోజు రాత్రంతా బీచ్‌లో ప్రీతితో గడిపాడు.

ఆ రోజు తన అంతరంగంలో కూడా తుఫాను చెలరేగింది.

అంతలో కిరణ్ మనసులో మెరుపు మెరి సింది.

మనిషి మనసు కూడా సముద్రం లాంటిదే.

సముద్రంలో అలలు నిరంతరం తీరం దాటాలని ప్రయత్నించినట్టే మనిషి మనసు లోని కోరికలు కూడా తీరందాటి, కట్టు తెంచుకుని పరిగెత్తాలని తహతహలాడ తాయి. కానీ సముద్రుడు తనపై తాను నియంత్రణ విధించుకుని చెలియలికట్టలో ఒదిగి ఉంటాడు.

మనిషి కూడా తన కోరికలను నియం



## మనసు తెల్లనివాడు..

'నల్లగా ఉన్నా గేదె ఎంచక్కా తెల్లని, కమ్మని పాలు ఇస్తుంది.. మన జాషువా కూడా అంతే.. మనిషి నల్లగా ఉన్నా కమ్మని కవిత్వం చెబుతారు..' ఇదీ ఒకానొక సభలో ఒక వక్త జాషువాను పొగిడిన తీరు.. ఆయన రూపాన్ని వ్యంగ్యంగా ఎత్తిపొడు స్తూనే ఆయన కవిత్వం కమ్మగా చెబుతారని అనడం సభలో చాలా మందిని బాధించింది.. జాషువా మాత్రం పట్టించుకోలేదు..

తన కవితాధోరణిలో 'నల్లని వాడు.. పద్మ నయ నమ్ముల వాడు.. మనసు తెల్లని వాడు..'అంటూ పోతన కృష్ణుడిలా తనను తానే అభివర్ణించుకుని మీసం దువ్వాడు. ఆయన రసస్ఫూర్తికి అంతా చప్పట్లు కొట్టారు.

త్రించుకుని, సమాజం విధించిన నియమాలలో తన మనసును అదుపులో ఉంచుకుని, చెలియలికట్ట దాటనివ్వకూడదు.

సముద్రం అదుపు తప్పితే ప్రళయం వస్తుంది.

మనిషి మనసు చెలియలికట్ట దాటితే జీవితాలు అల్లకల్లోలం అవుతాయి. కుటుంబాలు విచ్ఛిన్నం అవుతాయి. సమాజం అతలాకుతలు అవుతుంది.

అందుకే నియమం నాగరికత అన్నారు. బంధనంలోనే సుఖి ఉందన్నారు.

కానీ మనిషి మనసు తీరం దాటాలని ఉవ్విళ్లూరుతుంటుంది.

'వస్తాం' రాజు, చంద్ర స్వప్న, కశ్మీరాలతో వెళ్లిపోయారు.

'మనసు గుర్రములోరి మనిషీ... మనసు కళ్లెము లాగు మనిషీ..'

విశ్వనాథవారి గేయం గుర్తుకు వచ్చింది.

★ ★ ★

కాశ్మీరీ వాళ్లొచ్చి చెప్పి వెళ్లారు.

మురుమ్కర్ వెళ్తూ చేయి కలిపి వెళ్లాడు.

హర్యానా వాళ్లు చేయి ఊపి నవ్వుతూ వెళ్లిపోయారు.

అసావేరి తన అడ్రస్ ఇచ్చింది.

'బొంబాయి వచ్చినప్పుడు తప్పకుండా రండి. మీలాంటి శ్రోత కోసమైనా నేనింకా సాధన చేస్తాను' చెప్పింది.

తనూ వెళ్లాల్సిన సమయం అవటంతో కిరణ్ లేచాడు.

ఒంటరిగా వచ్చాడు...

వీణ జ్ఞాపకాలతో వచ్చాడు.

ఒంటరిగా వెళ్తున్నాడు.

కానీ అనేక మరపురాని మధురానుభూతులతో, అంతులేని ఆలోచనలతో, అలవికాని ఆనంద భావనలన్నీ మూట కట్టుకుని వెళ్తున్నాడు.



**వీణ జ్ఞాపకాలతో వచ్చాడు. ఒంటరిగా వెళ్తున్నాడు. కానీ అనేక మరపురాని మధురానుభూతులతో, అంతులేని ఆలోచనలతో, అలవికాని ఆనంద భావనలన్నీ మూట కట్టుకుని వెళ్తున్నాడు.**



తనకెప్పుడు, బాధ కలిగినా, ఎప్పుడు విషాదంగా అనిపించినా ఈ వారం రోజులను గుర్తుకు తెచ్చుకుంటాడు. తన మదిలో ప్రశాంతత నిండుతుంది.

జీవితం వ్యర్థం అనుకుంటూ వచ్చాడు.

జీవిత పరమార్థం గ్రహించి వెళ్తున్నాడు.

వీణ లేకపోతే జీవితం లేదనుకున్నాడు.

అనంతం నుంచి వచ్చిన మానవుడు ఒక వ్యక్తికో, ఒక ఆదర్శానికో, ఒకే అంశానికో తనని తాను పరిమితం చేసుకుని సంకుచితం కాకూడదని గ్రహించాడు.

విశాల విశ్వంలో, వినీలాకాశంలో విహరించే విహంగం లాంటివాడు మనిషి. అతడీ అనంత విశ్వానికి చెందిన వాడు. సంకుచితాలకు తావులేదు అనుకున్నాడు.

★ ★ ★

చీకటిని చీల్చుకుంటూ పరుగులెత్తుతోంది రైలు.

కళ్లు మూసుకున్న కిరణ్ కళ్ల ముందు అలలు కదలాడుతున్నాయి. సముద్రాలు పొంగిపోర్లుతున్నాయి. వెన్నెల విరగబూస్తోంది. మధురమైన స్వరం గానం ఆలపిస్తోంది. కిరణ్ మదిలో చిన్నప్పటి నుంచీ తనకు ఇష్టమైన వర్డ్స్ వర్త్ కవిత మెదిలింది.

'I wandered lovely as a cloud...'

'నేను మేఘమై ఒంటరిగా తిరుగుతూ నా జీవితానికి అర్థమేమిటన్న విషాదానికి లోనయ్యాను. ఇంతలో, క్రింద అద్భుతమైన పూలతోట కనిపించింది. ఆ అందాన్ని చూస్తూనే నా మనసు ఆనందమయమైంది. మనిషి ఆనంద స్వరూపం అని అర్థమైంది. అప్పటినుంచీ మనసు విషాదమయమయినప్పుడు ఆ దృశ్యాన్ని గుర్తు తెచ్చుకుంటాను. ఆవేదన పటాపంచలవుతుంది'

ఇదీ ఆ కవిత అర్థం.

కిరణ్ పెదవులపై చిరునవ్వు విరిసింది. ప్రపంచంలో ప్రతి మనిషీ ఓ ఒంటరి మేఘం లాంటివాడు.

ఆకాశంలో చంద్రుడు వెలుగులు పంచుతున్నాడు. దూరంగా తెల్లటి మేఘాలు మల్లెల్లా కనిపించాయి.

'అవును ఇన్నాళ్లు తాను ఒంటరి మేఘంలా సంచరించాడు. తనని తాను తెలుసుకున్నాడు' అనుకున్నాడు కిరణ్.

అతని మనసు ఆనందభరితమైపోయింది. నిద్ర పట్టే ముందు అతని పెదవులపై చిరునవ్వు ఉంది. 'నేను ఒంటరి మేఘంలా ప్రయాణించాను' అన్న కవిత ఇంకా మనసులో మెదులుతోంది.



ప్రేమగానం

కొత్త శీర్షిక

# ప్రేమ ఉత్సవం కావాలి

ఇందిర కాలమ్



ఆమె స్వచ్ఛంద వేశ్య.

అతడామెను ప్రేమించాడు.

మళ్ళీ ఆమె వేశ్య కాలేదు.

ప్రేమ మనిషిలోని అరాచకత్వాన్ని కడిగి పారేస్తుంది.

మేరీ మగ్దలీన యూదు రాజ్యంలో పేరెన్నికగన్న వేశ్య. సమాజం ఆమెను తృణీకరించింది. అయితే జీసస్ ప్రేమ ఆమెను కరిగించింది. ఆమె తన దగ్గరున్న ఖరీదయిన అత్తరుతో జీసస్ పాదాలను కడిగినప్పుడు, ఆ అత్తరులో ఆమె కన్నీరు కూడా కలిసి ఆయన పాదాలను పావనం చేసింది.

శిష్యులు "ఆమె వేశ్య. ఆమెకు దూరంగా వుండాలి. తాకరాదు" అని జీసస్‌కు గుర్తుచేశారు.

అప్పుడు జీసస్ "హృదయాన్ని కదిలించే ఆమె ప్రేమ, ఆమె పాపాలన్నింటినీ కడిగేసింది" అన్నాడు.

ప్రేమ వ్యక్తికి సమగ్రతనిస్తుంది.

★ ★ ★

జీవరాసులన్నింటిలో కామశక్తి పునరుత్పత్తికి మాత్రమే పరిమితమై వుంటే, మనిషిలో మాత్రం అది రసానుభూతిని, ఒక విధంగా అత్యున్నత ఆనందానుభూతిని ప్రేరేపిస్తుంది. అందుకే కామం కేవలం పునరుత్పత్తి సాధనంగా ఉండిపోకుండా, వ్యక్తి ఆనందమయ జీవితంలో ప్రధాన పాత్ర వహిస్తుంది.

యుక్తవయస్సు రాగానే మనిషిలో అనుభూతి ప్రపంచం సాక్షాత్కరిస్తుంది. ఉద్వేగాలు పరిపక్వమవడం మొదలవుతుంది. అందులో భాగంగానే ప్రేమానుభూతి చిగురిస్తుంది. యుక్తవయస్సు వచ్చిన స్త్రీపురుషులలో ప్రేమ ముప్పిరిగొంటుంది. వారు అసంకల్పితంగా ప్రేమ జీవితం వైపు ఆకర్షితులవుతారు. కామం ప్రేమకు వ్యక్తీకరణగానే మొదలవుతుంది. ప్రేమ హృదయాన్ని కరిగిస్తే అది శరీరం గుండా ప్రవహిస్తుంది. మనిషిలో మాత్రమే కామం, ప్రేమ అనుసంధానమై వుంటాయి. పరస్పరం ప్రేరేపించుకుంటూ ఉంటాయి. ఒక విధంగా కామం మనిషి భౌతిక, శరీర వ్యక్తీకరణ అయితే ప్రేమ అతడి ఆత్మిక అనుభూతి.

సమాజం, నైతికత, జీవితంలో ప్రాధాన్యతలు ప్రేమకు వ్యతిరేకం కాకపోతే, అవి ప్రేమను పెంచేవయితే మనిషి ప్రేమలో ఎదిగి, తన జీవితాన్ని ఆనందమయం చేసుకునే అవకాశం ఎంతో ఉంది. వ్యక్తి ఆనందంగా, నిశ్చింతగా, తృప్తిగా బతకడానికి కావలసినవన్నీ ప్రకృతి ముందే ఇచ్చింది. నిజానికి సమస్య అది కాదు.

మన ప్రకృతికి వ్యతిరేకంగా మనమే తయారు చేసుకున్న సవాలక్ష వ్యవహారాలు మనకు ప్రేమానుభూతిని పంచేవి కావు సరి కదా ప్రేమకు వ్యతిరేకం కావడం విశేషం. ఈ విషయంలో మనం తొందరగా కళ్లు తెరవకపోతే జీవితం మరింత యాంత్రికంగా, సృజనలేని, ఆనందం లేని, ఆశ్చర్యం లేని , ఉత్సాహం లేని, నిర్జీవ జీవితం ఇలాగే కొనసాగుతుంది. మనిషిలోని దుఃఖం, అసంతృప్తి, అభద్రత, అసహనం, విశృంఖలతగా, హింసగా అరాచకంగా వ్యక్తమై సమాజాన్ని అల్లకల్లోలం చేస్తుంది. అంతవరకు సైన్స్ ఎడ్యుకేషన్ పేరుతో ఏం బోధించినా, లైంగిక స్వేచ్ఛను ఎంత సంపాదించినా, స్త్రీ పురుష సంబంధాల గురించి ఎన్ని మాటలాడినా, ఆ విస్తృత లైంగిక సంబంధాలను కొనసాగించినా మనిషిలోని అతృప్తి, అభద్రత, నిరాశ అలాగే ఉంటాయి. స్త్రీ పురుష సంబంధాలు కూడా యాంత్రికమై పోతాయి.

కారణం, కామం కేవలం ఉపరితల వ్యవహారం. అది శారీరకం. దానికి అతీతంగా మనిషి ఆత్మ స్వరూపుడు. మనిషి అంతరాలను ప్రేమ మాత్రమే తాకగలదు. అందుకే ఏదయినా ఆత్మ లోతులను స్పృశించేందుకు మనిషి అనుమతించకపోతే అతడు అసంతృప్తిగానే మిగిలిపోతాడు. తన హృదయాన్ని తెరిచి ఉంచకపోతే ఆనందించే అవకాశాన్ని కోల్పోతాడు. అంతరంగ ఆర్తిని నిర్లక్ష్యం చేస్తే భౌతికంగా ఎంత సాధించినా అనుభూతి చెందే హృదయం నిర్జీవమై సాధించిన దానికే విలువా లేనట్టు, అంతా అనవసర శ్రమ అయినట్టు అనిపిస్తుంది.

ప్రాచీన కాలంలో కామ శాస్త్రాన్ని అవసరమైన శాస్త్రంగా పరిగణించారు. ఆ దిశగా ఎన్నో పరిశోధనలు చేశారు. గ్రంథాలు రాశారు. కామోద్దీపన కోసం ప్రత్యేక వాజీకరణాలు, సుగంధ ద్రవ్యాల అవసరాన్ని చెప్పారు. కామం మోక్షానికి అవసరమైన అనుభవంగా నొక్కి చెప్పారు. మధ్యయుగాల నాటి ప్రాచీన సమాజం లైంగిక అనుభవానికి అత్యున్నత స్థానాన్ని ఇచ్చింది. అతి పవిత్రమైన పూజా మందిరాలను, దేవాలయాలను అనేక రతిక్రీడ భంగిమలతో శోభాయమానంగా అలంకరించారు. అనాటి భక్తి వాఙ్మయం, సాహిత్యం, పాటలు అన్నీ శృంగార రసభరితమై ఉంటాయి.

సచ్చిదానందాన్ని, భగవంతుని అనుభవాన్ని రతి ఆనందంతో పోల్చి చెప్పారు. సచ్చిదానందాన్ని వ్యక్తపరిచేందుకు మీరా, జయదేవుడు, అన్నమయ్య వంటివారెందరో శృంగార ప్రతీకలను వాడుతూ, రతికేళీ విలాసంగానే అభివ్యక్తీకరించారు. శృంగారం, భక్తి, కామం, ప్రేమ అన్నీ ఒక దానికొకటి సహకార సంబంధాలతో ఉంటాయని వాటికి అత్యున్నత గౌరవాన్ని ప్రాధాన్యతను ఇచ్చారు.

ఈమధ్య కాలంలో మన దేశంలో కూడా లైంగిక విషయాలకు ప్రాధాన్యం పెరిగింది. ఆ విషయాలు మాట్లాడుతున్నారు. స్త్రీ పురుషులకు లైంగిక స్వేచ్ఛ కావాలని పోట్లాడుతున్నారు. ఇక సాహిత్యంలో, టివి, సినిమా పాటలలో మాటలలో కాముకత పొంగిపొరలుతోంది. మనుషులు విస్తృత లైంగిక సంబంధాల పట్ల ఆకర్షితులవుతున్నారు. స్త్రీ పురుషుల శారీరక ప్రదర్శనలు సామాన్యమయిపోయాయి.

ప్రేమ, కామం, శృంగారం అత్యున్నత వ్యక్తీకరణగా, గొప్ప గౌరవాన్ని పొందిన ఆ కాలానికి; అవి అమ్మకపు సరుకుగా వరదలై పారే ఈ కాలానికీ తేడా ఒకటుంది. అప్పటి మనుషుల కామ వ్యక్తీకరణలో ప్రేమ భక్తి పునాదిగా వుండేది. కామం కామంగానే మిగిలిపోకుండా అది ప్రేమకు, భక్తికి, పరమ ఆనందానికి అనుసంధానకర్తగా కూడా వుండేది. అందుకే ఆ కాలంలో స్త్రీని

సెక్స్ సింబల్‌గా చూడలేదు. ఆమె గౌరవం ఆమెకు దక్కింది.

ఈ రోజు స్త్రీ ఎంత చదివినా భౌతిక ప్రపంచంలో ఎంత సాధించినా, ఎన్ని పదవులను చేపట్టినా ఆమె శరీరం కన్నా ఇంకా ఎక్కువని, లోతయినదన్న సత్యాన్ని చూసేందుకు సమాజం అంగీకరించక పోవడాన్ని గమనిస్తున్నాను.

ప్రేమ, హృదయానుభూతి ప్రధానంగాగల సమాజం నుండి, భౌతిక అవసరాలు డబ్బు అధికారం పేరు ప్రతిష్ట ప్రధానం అయిన ఈ పరిస్థితికి సమాజం పరిణామం చెందింది. మానవ చైతన్య పరిణామ క్రమంలో భౌతిక ప్రపంచాన్ని ప్రకృతిని జయించాలన్న మానవ అహంకారం తన అనుభూతి కేంద్రమయిన హృదయాన్ని మర్చిపోయింది. ప్రకృతిని జయించే పనిలో మునిగి, తన ప్రకృతినీ మర్చిపోయే ప్రమాదంలో పడ్డాడు మనిషి.



ఇప్పుడు కావలసింది ప్రేమోత్సవం. అప్పుడే మనిషిలో తృప్తి, ఆనందం కలుగుతాయి. ఆనందం శాంతికి చిహ్నం. ఆనందం అహింసకు గీటురాయి. ఆనందం తృప్తికి మారుపేరు.



జీవితంలో ప్రేమ అవసరాన్ని గుర్తించకపోతే, మనిషి తిరిగి ప్రేమలో ప్రతిష్ఠితం కాకపోతే మనిషి జీవితం విశృంఖలంగా, హింసాత్మకంగా మారుతుంది. శాంతి సమాధానం దూరం, కనీస జీవితమే దుర్భరమవుతుంది.



అందుకే ఈ రోజు ప్రేమను గురించి మాట్లాడుకోవాల్సిన అవసరం ఉంది. సెక్స్ పాఠాలు కాదు; ప్రేమ పాఠాలు అసలైన అవసరం. స్త్రీ పురుష సంబంధాల గురించి మాట్లాడడమే తప్పు అన్న ఛాందస పరిస్థితి నుండి బయటపడ్డాం. సంతోషమే. లైంగిక స్వేచ్ఛ కావాలని కోరుకోవడం అంగీకారమే. ఒకవేళ మనం ఇంకా సంప్రదాయ, ఛాందస భావాల మధ్య స్త్రీ పురుష సంబంధాల గురించి లైంగిక విషయాల గురించి మాట్లాడుకోలేకపోతూ ఉంటే, ఆ పరిస్థితి నుండి బయటపడాల్సిందే. కాదనను. అయితే కామోత్సాహం మాత్రమే దీనికి పరిష్కారం కాదు. దానికి మాత్రమే పరిమితమైన జీవితం మనిషిని మరింత నిర్వీర్యం చేస్తుంది. ఆత్మికంగా మనిషి కుంగిపోతాడు. ఆనందంతో గంతులేసే హృదయం లేకపోతే వ్యక్తి నడిచే మరబొమ్మ అవుతాడు తప్ప సజీవుడు కాలేడు.

ఇప్పుడు కావలసింది ప్రేమోత్సవం. అప్పుడే మనిషిలో తృప్తి, ఆనందం కలుగుతాయి. ఆనందం శాంతికి చిహ్నం. ఆనందం అహింసకు గీటురాయి. ఆనందం తృప్తికి మారుపేరు. ఆనందం ప్రేమకు పర్యాయపదం. మనిషి లక్ష్యం కూడా ఆనందమే. అందుకే జీవితంలో ఆనందాన్నిచ్చే అన్ని సందర్భాలను, వ్యవహారాలను గుండెలకు హత్తుకుందాం.

అందుకే ప్రేమవైపు అడుగులు వేద్దాం. అన్వేషిద్దాం. ప్రేమలో ఎదిగి జీవితాన్ని రసమయం చేసుకుందాం.



# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ **మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనా శక్తిని రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తమ ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

***నవలను గురించే కాక ఇతర శీర్షికలపై కూడా పాఠకుల అమూల్య అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం.***

**కూపన్**

సెప్టెంబరు చతుర నవల ***ఒంటరి మేఘం***

సమీక్షకుని పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________

నాటి చతుర

# జ్ఞాపకాల నీడలో

నాటి నవల

# జీవన వీణ

రచన: రావు-రావు

సెప్టెంబర్ 1978: సంపుటి: 1 సంచిక: 8




ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా; ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖామాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను ఇకనుంచి అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. చతుర ప్రచురణ ప్రారంభమైన 1978వ సంవత్సరం సెప్టెంబర్ నెలలో ప్రచురించిన '**జీవన వీణ**' నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

**జీ**వితం వడ్డించిన విస్తరే అయినా చెప్పుడు మాటలు విని తనకు ఏది మంచో ఏది చెడో గ్రహించక పండంటి సంసారాన్ని విచ్ఛిన్నం చేసుకోబోయిన ఆడపడుచును సరైన మార్గంలో నడిపించిన మహిళ గాథే ఈ 'జీవనవీణ'. అత్తింటి వారి ప్రేమాభిమానాలను పుష్కలంగా పొందిన ఆమె పుట్టింటివారినీ, మెట్టింటివారినీ సమస్యల సుడిగుండంలో నుండి తెలివిగా బయట పడేసి అందరి ఆదరాభిమానాల నందుకుంటుంది. ఆడపడుచుకు మాట రాకుండా సమయస్ఫూర్తితో వ్యవహరించి ఆమె దృష్టిలో కొండంత ఎదిగిపోతుంది. పాడి పంటలతో సుభిక్షంగా ఉండే పల్లెలోని ప్రకృతి సౌందర్యానికీ, ఆత్మీయతలకు, అభిమానాలకు, స్నేహ బంధాలకు పెద్దపీట వేసిన ఈ నవల ఆద్యంతం ఆసక్తిగా సాగుతుంది.

## ఇతివృత్తం

**ము**రళి, వాణి అన్నా చెల్లెళ్ళు, ఓ పెళ్ళికి హాజరుకావడానికి బయల్దేరారు. దారిలో వారి కారు ఓ చిన్నగుంటలో పడి ఆగిపోతుంది. ఆ దార్లోనే బండిపై వస్తున్న చంద్రం అనే యువకుడు విషయమేమిటని కనుక్కుంటాడు. చీకటి పడితే పురుగూ పుట్రా చేరతాయి, కారు బాగయ్యాక వెళ్దురు గానీ రమ్మని వాళ్ళను తన ఇంటికి పిలుచుకుని వెళ్తాడు. అతని చెల్లెలు లక్ష్మి, తల్లి

దంప్రులు సుబ్బయ్య, కనకమ్మ అతిథులను ప్రేమగా ఆహ్వానిస్తారు. భోజనాల వేళ కబుర్లలో మురళి-వాణిల తండ్రి రాఘవయ్య తన మిత్రుడేనని తెలుసుకుని ఆనందిస్తాడు సుబ్బయ్య.

మర్నాడు ఉదయం వాణి-మురళి; చంద్రం-లక్ష్మి నలుగురూ కలిసి బండిలో పొలానికి వెళ్తారు. తాటిబద్దెల మీద పంటకాలువ దాటడానికి వాణి, మురళి అవస్థ పడుతుండగా లక్ష్మి చంద్రం సాయపడతారు. పొలంలో ముంజలు, మామిడి ముక్కలు తిని సరదాగా కాలక్షేపం చేస్తారు. అక్కడే




వాణి చంద్రపట్ల ఆకర్షితురాలవుతుంది. లక్ష్మి మురళి మధ్య సైతం ప్రేమ అంకురిస్తుంది.

ఆ సాయంత్రం కారు బాగు చేయించుకుని డ్రైవరు వస్తాడు. లక్ష్మికీ, వాణికీ ప్రయాణం ఇష్టం లేక ఎవరూ చూడకుండా వెళ్ళి టైర్లలో నుంచి గాలి తీసేస్తారు. ప్రయాణం మర్నాటికి వాయిదా పడుతుంది. లక్ష్మి-వాణి పరస్పరం పరిహాసాలాడుకుంటారు. వాళ్ళు బయల్దేరే వేళకు ఆ ఊరి మున్సబు వచ్చి జులాయిగా తిరిగే తనకొడుకుకు లక్ష్మి నిచ్చి పెళ్ళి చేయమని సుబ్బయ్యను బలవంతపెడతాడు. సుబ్బయ్య నిరాకరించేసరికి తనకు ఇవ్వాల్సిన పది వేల బాకీ వడ్డీతో కలిపి ఇరవై తక్షణమే చెల్లించమని గొడవ చేస్తాడు.

ఈ చేదు సంఘటన అందరినీ బాధిస్తుంది. తండ్రిని ఒప్పించి లక్ష్మిని తను పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకుంటాడు మురళి. ఎందుకంటే సుబ్బయ్య ఈ పదివేల అప్పు చేసింది తమ పొలం కౌలు తాలూకు డబ్బు చెల్లు వేయడానికే గనుక అతని కష్టానికి, అవమానానికి తమదే బాధ్యత అనుకుంటాడు.

వాణి మురళి బయల్దేరి పట్నం-విజయవాడకు వెళ్ళిపోతారు. మోహన్ రాఘవయ్యగారి మిత్రుని కొడుకు. వాణితో పెళ్ళి జరిపించమని కోరతాడు. అందుకు వాణి మురళి నిరాకరిస్తారు. భోజనాల సమయంలో రాఘవరావు కొడుకు చెప్పగా జరిగిన కథంతా వింటాడు. సుబ్బయ్యకు మున్సబు పాతికవేలు ఇవ్వాల్సిందని కోర్టు నోటీసు ఇప్పిస్తాడు. సుబ్బయ్య కుటుంబానికి తమ తండ్రి డబ్బు సాయం చేయాలని మురళి వాణి కోరుకుంటారు. నూకాలమ్మ జాతరకు వస్తామని మాటిచ్చి మరీ వచ్చిన తాము వెళ్ళటం ఎలాగా అని ఆలోచనలో పడతారు.

మున్సబు ఇంటికి సుబ్బయ్య ఊళ్ళో పెద్దల్ని తీసుకుని వెళ్తారు. సుబ్బయ్య తన ఆస్తిపాస్తుల్ని జప్తు చేసుకోమంటాడు. కోర్టుకు వెళ్ళటం తనకు ఇష్టం లేదని చెబుతాడు. దాంతో సుబ్బయ్య ఇంటికి వచ్చి ఎద్దులను, బండినీ తీసుకెళ్లబోయిన మున్సబునూ, అతడి మనుషులనూ చంద్రం ఎదిరిస్తున్న సమయంలో రాఘవయ్య వస్తాడు. సుబ్బయ్య అప్పు చెల్లువేశాననీ రసీదు అందిస్తాడు మున్సబుకు.

అందరూ కలిసి అమ్మవారి జాతరకు వెళ్తారు. జంటలు జంటలుగా మురళి-లక్ష్మి, వాణి-చంద్రం జాతరలో తిరుగుతారు. రంగులరాట్నాలు ఎక్కుతారు. సరదాగా

గడుపుతారు.

సుబ్బయ్య రాఘవయ్యలు త్వరలోనే ఈ జంటలకు పెళ్ళి చేయాలని నిర్ణయిస్తారు.

పెళ్ళి ముహూర్తాలు పెట్టిస్తాడు సుబ్బయ్య. పెళ్ళి విజయవాడలో, శోభనం రామన్నపాలెంలో జరగాలని నిర్ణయిస్తారు. అన్నీ అనుకున్నట్లుగానే సవ్యంగా జరుగుతాయి. విజయవాడలో లక్ష్మి-మురళి, రామన్నపాలెంలో వాణి-చంద్రం కాపురాలు పెడతారు. లక్ష్మి అత్తవారింట్లో అందరికీ తల్లో నాలుకలా ఉంటే వాణి అత్తింట్లో ఏ పనీ చేయదు. అత్తగారే చేయనీయదు. చంద్రాన్ని చూడాలనిపిస్తే పగటి వేళ పొలానికి సైతం వెళ్తుంది వాణి. ఆ ఊరు విస్తుబోయి చూస్తున్నా పట్టించుకునేది కాదు. మోహన్ తరచుగా రామన్నపాలెం వచ్చి వాణి అత్తవారింటికి వెళ్ళేవాడు. మున్నుబు కొడుకు అతనితో పరిచయం పెంచుకుని వాణి మోహన్‌ల స్నేహాన్ని వక్రీకరించి దుష్ప్రచారం చేయటం మొదలు పెడతాడు. మోహన్ వచ్చి వెళ్తూ వాణి అత్తింటి బీదరికాన్ని ఎద్దేవా చేసేవాడు. ఈ పేడ కంపు మధ్య పురుగులా ఎలా బతుకుతున్నారని సానుభూతి చూపేసరికి తను అధునాతన జీవితానికి దూరమయ్యానన్న దిగులు వాణి మనసును కల్లోలం చేయటం మొదలవుతుంది. ఇప్పుడామెకు భర్త మంచితనం గుర్తుకు రావటం లేదు. తమ ఇంట్లో సోఫాలు, రేడియోలు, ఇతర ఫర్నిచర్ లేదనీ, కొనమనీ చంద్రాన్ని అడగుతుంది. మోహన్ చంద్రాన్ని తిరస్కారంగా చూస్తుంటే అది చంద్రంలోని లోపమే అనుకుంటుంది గానీ మోహన్ సంస్కార రాహిత్యాన్ని గుర్తించదు.

సుబ్బయ్య కూతురిని, అల్లుడిని పండక్కి పంపమని కోరేందుకు వెళ్తాడు. సుబ్బయ్య సాగు చేస్తున్న రాఘవయ్య పొలం తాలూకు డబ్బివ్వబోగా తనపొలం కూతురుకిచ్చేశాననీ, ఆ డబ్బు మీదేననీ అంటాడు రాఘవయ్య.

వాణి చంద్రం విజయవాడకు వస్తారు. మురళి లక్ష్మి రామన్నపాలెం వెళ్తారు. తన పుట్టింట్లో భర్తకు తగిన సౌకర్యాలు లేవని లక్ష్మి బాధపడుతుంది. పండగకు కొత్త బట్టలు పెడతారు ఇరువురి అత్తింటివారు. ఎవరిళ్లకు వాళ్ళు వచ్చేస్తారు.

మోహన్ పదే పదే వాణి దగ్గరకు అత్తవారింటికి వచ్చి వారిని కించపరిచేసరికి వాణిలో అసహనం కోపం పెరుగుతుంది. మనసు అల్లకల్లోలమై చంద్రంపై కోపం పెంచుకుంటుంది.

ఆ తరువాత ఓ రోజు ఎవరికీ చెప్పకుండా పుట్టింటికి వెళ్ళిపోతుంది. సుబ్బయ్య, కనకమ్మ కోడలు ఎంతకీ రాకపోయేసరికి బాధపడతారు. నెల దాటినా చంద్రం సైతం వెళ్ళి భార్యను పిలుచుకురాడు. పట్నంలో వాణి మోహన్‌తో సినిమాలకు, షికార్లకు తిరుగుతోందని మున్నుబు ప్రచారం చేసేసరికి సుబ్బయ్య బాధతో కోడలిని పంపించమని రాఘవయ్యకు ఉత్తరం రాస్తాడు.

అది చూశాకే, చదివాకే వాణి అలిగి వచ్చిందని రాఘవయ్య కుటుంబానికి అర్థమవుతుంది. అందరూ వాణిని ఛీత్కరిస్తారు. వాణి అన్నం, నీళ్ళు మానేసి నిరాహారంగా ఉంటుంది. లక్ష్మి తల్లిదండ్రులకు ఓ ఉత్తరం రాసి అర్జెంటుగా రమ్మని చెబుతుంది. చంద్రం, సుబ్బయ్య వచ్చేసరికి వాణి ఇల్లు విడిచి ఎటో వెళ్లిపోతుంది. ఆమెను రహస్యంగా వెంబడించి నచ్చచెప్పి, ఊరడించి ఇంటికి తిరిగి తీసుకొస్తుంది. ఎక్కడికి ఇంత రాత్రివేళ వెళ్ళారని రాఘవయ్య, సుబ్బయ్య తదితరులు అడిగితే హరికథా కాలక్షేపానికి వెళ్ళామని చెప్పి వాణిని రక్షిస్తుంది లక్ష్మి. సుబ్బయ్య నిజాయితీ అందర్నీ ఆకట్టుకుంటుంది. లక్ష్మి అన్నను మందలించి భార్యను ప్రేమించి పెళ్ళాడితే సరిపోదు. ఆమె మనసెరిగి ప్రవర్తించమని చెబుతుంది. వాణి చంద్రం పాదాలపై వాలుతుంది పశ్చాత్తాపంతో. అందరూ సంతోషిస్తారు.



# చతుర కథలు

## అగరొత్తుల స్టాండు

- అమ్మిన శ్రీనివాసరాజు

ఆనంద్-హారతిల గారాలపట్టి "బంటి" వయస్సు ఎనిమిదేళ్లే అయినా తెలివైనవాడు, చురుకైనవాడు. పొద్దున్నే దొంగచాటుగా పూజాగదిలో దూరాడు. షాపుకెళ్లే తొందర్లో ఆనంద్, వంటపనుల హడావిడిలో హారతి తలమునకలుగావున్నారు. అదే అదనుగా తన పని మొదలెట్టాడు బంటి.

ఉదయం లేవడంతోటే ప్రభాతపనులు ముగియగానే పూజ చేసుకునే ఏపనైనా మొదలెడతాడు ఆనంద్.

టిఫిన్ చేస్తున్న నాన్న దగ్గరకు ఏదో తప్పు చేసినవాడిలా తలుపు చాటునుండి నక్కినక్కి వస్తూ ఎక్కిళ్లు పెట్టుకుంటూ మంచినీళ్లు అన్నట్టు సైగ చేయబోయాడు భయం భయంగా బంటి.

చాన్నాళ్లకు కలిగిన సంతానం. అందునా మగనలుసు. "కాలుకింద పెడితే కంది పోతాడేమో!" అన్నంత గారాబంగా పెంచుకుంటున్నారు. వాడికి జలుబు చేస్తేనే అదేదో పెద్ద జబ్బులా ఫీలైపోయి రాత్రనక పగలనక సపర్యలు చేసే దయగల దంపతులు. ముద్దుల కొడుక్కు పొద్దున్నెక్కిళ్లు!

"ఏమైంది నానీ!?" అంటూ ఆందోళనగా చేతుల్లోకి తీసుకోబోయాడు ఆనంద్. భర్త హడావిడి విన్న హారతి ఒక్క ఉదుటున వంటగదిలో నుండి వచ్చి భర్త చెంతచేరి అతని చేతుల్లో నుండి తప్పించుకోబో



తున్న బంటీని "ఏరా చిన్నా... ఏమైందీ నాకు చెప్పవా? !" అంటూతన ఒళ్లోకి లాక్కుంది,

"మరే!... మరే! అగరొత్తుల స్టాండు మింగా!" అనేశాడు అమ్మ కొట్టదులే అన్నధీ మాతో..

బంటీగాడి మాటకు పిడుగు పడ్డ శబ్దం విన్నట్లైపోయారు ఇద్దరూ. ఈ మధ్యే బ్రష్ మింగిన వ్యక్తిని టి.వి.లో చూపించిన వార్త ఇద్దరికీ ఒకేసారి గుర్తొచ్చి గుండెల్లో గూడ్స్ రైళ్లు కదిలినట్లైంది.

ఆగమేఘాల మీద ఆటోసాయంతో బంటీతోసహా "జాబిల్లి" పిల్లల ఆసుపత్రికి చేరుకున్నారు.

హారతికి ఏడుపు ఋతుపవనాలు ఎప్పుడో ప్రవేశించాయి. కళ్లంట నీళ్లు జోరుగా కురుస్తూనే వున్నాయ్. ఇక ఆనంద్ ఆందోళనకు అంతేలేదు. వణికిపోతున్నాడు.

డాక్టర్ చంద్రం చిద్విలాసంగా మనసులో ఆనందిస్తూ మొహంలో జాలి చూపుతూ తనదైన స్టైల్‌లో "డోంట్‌వర్రీ... నేనున్నాగా బాబుకు ఏమీకాదు గతంలో అంటే గుండీ మింగినా గుండెలు బాదుకోవాల్సి వచ్చేది ఇప్పుడు బ్రష్‌లు మింగినా కంగారు పడాల్సి నపనిలేదు." అంటూ వైద్యరంగపు అభివృద్ధిని వల్లెవేస్తూ చకచకా ఏవేవో టెస్ట్‌లకు చీటీలు రాసి స్టెతస్కోపుతో బంటీని వెనకముందూ తడిమాడు.

ఇదంతా బంటీకి ఏమీ అర్థంకాక దిగులుగా అయోమయంగా చూస్తున్నాడు. ఆ చూపులు చూసి హారతి భయం మరింత పెరిగింది.

క్షణాలమీద అన్నిపరీక్షలు అయిపోయాయి. రిపోర్టులు చూసిన డాక్టర్ చంద్రం మొహంలో ఆమావాస్య అందాలు అగుపిస్తున్నాయి. అన్ని రిపోర్టులూ నార్మల్ అనివచ్చాయి. చివరికి స్కానింగ్‌లో కూడా ఏమీ లేదు! అంతాబాగుంది.

ఆపరేషన్ అవకాశం చేజారిపోయిన చంద్రం చకచకా తనకు తెలిసిన సీనియర్ పిల్లల డాక్టర్లకు ఫోన్లు చేసి బంటీప్రాబ్లం, రిపోర్టుల వివరాలు అన్నీ వివరించాడు. ఎవ్వరికీ అంతుబట్టడంలేదు. అందరిదీ ఒకే పరిస్థితి నిరుత్సాహం. భార్యాభర్తల్లో ఆందోళన, బంటీగాడిలో అయోమయం.

చివరి ప్రయత్నంగా బంటీని చెకప్ చేయడానికి సన్నద్ధమయ్యాడు డాక్టర్ చంద్రం. "నాన్నా... చంటీ... ఇప్పుడెలావుందీ? ?" అంటూతనదైన మృదుబాణిలో బంటీ పొట్టని ముడుతూ అడిగాడు. ఏమీలేదన్నట్టు తల అడ్డదిడ్డంగా ఆడించాడు బంటీ. అదే ధోరణిలో "చిన్నా... అసలు దాన్ని ఎలా మింగావ్? ! నాకు చెప్పవా!!" అన్నాడు ముద్దుగా

"మరేమో... పై సీలు తీసి... రెండుముక్కలు చేసి మింగేశా!" అన్నాడు. "పై సీలు తీయడమేంటి? !" అర్థంకానట్టు ఆనంద్ కాళ్ల వైపు చూశాడు డాక్టర్ చంద్రం.

"అదే ఆంకుల్ బనానా పైనుండే కవరు..." అన్నాడు తన ధోరణిలో

"ఇంతకీ నువ్వు మింగింది అదా!!? " అంటూ అందరూ ఒక్కసారిగా ఆశ్చర్యపోయారు. ఆనందంనిండిన ఆశ్చర్యంతో...

అందాకా తను అనుభవించిన హైరానా భరించలేక "ఓరి సన్నాసి! మరి ఇంట్లో అడిగినప్పుడు అలా చెప్పి ఏడిశావేరా? !" అన్నాడు ఆనంద్ కోపంతో.

"మరి పెన్నులు పెట్టేది పెన్నుస్టాండు అయితే దేవుని ముందు అగరొత్తులు పెట్టే దాన్ని ఏమంటారు? ? " క్వశ్చన్‌మార్క్ మొహంతో చూశాడు బంటి.

"ఓరి నీ ఆధునిక భాషాపరిజ్ఞానం మండిపోను. ఎంత కంగారు పెట్టావురా? ఆ మాట ముందే చెప్పాల్సింది గదా? " అన్నాడు చిరుకోపంతో.

"మీరు నాకా అవకాశం ఇస్తేగదా? " అన్నట్టు బేలగా నవ్వాడు బంటీ అమ్మ పైట చెంగు చేతికి చుట్టుకుంటూ.



# మెలిమి బంగారం

- విజయలక్ష్మి

"ఏంటీ? ... ఆ పాతచింతకాయ పచ్చడినా.... భలేవారే... నేనెలా ఇష్టపడతాననుకున్నారు? ... సుధాకర్‌కైతే బాగా సరిపోతుంది. అతను అప్పుడప్పుడూ లంచ్‌బాక్స్‌లో తెచ్చుకునేది అదేగా" అంటూ పావని గురించి తన అభిప్రాయాన్ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు దివాకర్.

"నువ్వు పొరపడుతున్నావయ్యా... ఆమెను చేసుకుంటే నీ అంత అదృష్టవంతుడుండడు" నచ్చ చెప్పబోయాడు ఆఫీసు అసిస్టెంటు ప్రసాదరావు. పావనికి, దివాకర్‌కి ఈడుజోడు బావుంటుందని అతని ఉద్దేశ్యం.

"ఎందుకు? ఆమెవైపు మరో మగాడు కన్నెత్తి కూడా చూడడనా? " వెటకారంగా బదులిచ్చాడు దివాకర్.

ప్రసాదరావు విసుగ్గా ముఖం పెట్టి "ఏదో పెద్దవాణ్ణి. నాకు తెల్సింది చెప్పాను. అయినా నాకెందుకు" అంటూ ఫైళ్ళల్లో తలదూర్చాడు.

దివాకర్ ఈ మధ్యనే హైద్రాబాదుకు కొత్తగా ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వచ్చాడు. ఇంకా పెళ్ళికాలేదు. తను పనిచేసే ఆఫీసులో అమ్మాయి అయితే అనుకూలంగా వుంటుందని అతని ఆలోచన. అలాగే అమ్మాయి మోడ్రన్‌గా వుండాలంటాడు. సిటీలోనైతే తను కోరుకున్న లక్షణాలున్న అమ్మాయి తేలిగ్గా దొరుకుతుందని



ఇక్కడికి కావాలని బదిలీ చేయించుకు న్నాడు.

అతననుకున్నట్లుగానే ఆఫీసులో పెళ్ళికాని స్టెనోలు ఇద్దరున్నారు. ఒకరు రవళి, మరొ కరు పావని. రవళి చాలా మోడ్రన్‌గా వుంది. రోజుకోవిధంగా అలంకరణ చేసు కుని వస్తోంది. పావని అలాకాదు. అందాన్ని గుట్టుగా దాచుకుంటుంది. బారెడు జుట్టును సైతం మడతల మీద మడతలేసి పైకి బిగించికట్టి, వస్తుంది.

"వేష భాషల్ని చూసికాక, నీ మనసెరిగిన వాణ్ణిచేసుకోతల్లీ. అలాగని మన కట్టుబాట్లు మర్చిపోయేవుసుమా!..." అంటూ దీర్ఘం తీసిన బామ్మసలహాని తు.చ. తప్పక పాటి స్తోంది పావని.

"ఏంటి పావనీ? రోజురోజుకు మొరటు దాన్లా తయారవుతున్నావు. శుభ్రంగా మూడుపూటలు ముఖం కడుగుతున్నదానివి కాస్త పౌడరద్దుకుంటే నీసొమ్మేంపోతుంది? ఇలా నాపసానిలా తయారైతే నిన్ను చేసుకో వటానికి ఎవరూ ముందుకురారు. ఈ రోజుల్లో షోగ్గా వుంటేనే అవతలి వాళ్ళకు నచ్చేది..." అంటూ తోటి ఉద్యోగినులు ఎన్నిసార్లు మందలించినా నవ్వి ఊరుకునేదే గాని తన పంథామాత్రం మార్చుకునేది గాదు.

వచ్చిన కొత్తలో పావని ఎదురుపడ్డప్పుడు ముఖం తిప్పుకునేవాడు దివాకర్. ఆమెతో మాట్లాడ్డం చిన్నతనంగా భావించేవాడు. ఇప్పటికీ ఆమె అతని దృష్టిలో పనికిరాని పాత చింతకాయ పచ్చడే.

మేకప్పుకు ప్రాధాన్యమిచ్చే రవళిలో దివా కర్ కోరుకున్న మోడ్రన్ అందాలు కనిపిం చాయి. ఆమే తనకు తగిన జోడి అని నిర్ణ యించుకుని తన మనసులో మాట రవళికి చెప్పాడు. ఆమెకూడా అతనిని ఇష్టపడింది. ఆరోజు నుంచి వాళ్ల స్వేచ్ఛకు ఎదురులేకుం డాపోయింది.

"పావని మేలిమిబంగారం. ఆమె నీకు అన్నివిధాల సరైనది. మీ యిద్దరి జంట కన్నుల పంటగా వుంటుంది" అంటూ మరో సారి నచ్చచెప్పబోయాడు ప్రసాదరావు.

"అబ్బా... మళ్ళీమొదలెట్టారా... నువ్వె క్కడ దొరికావయ్యా నాకు" అని విసు క్కుంటూ తలపట్టుకున్నాడు దివాకర్.

ఇంకాలస్యం చేస్తే లాభంలేదని తల్లికిష్టం లేకున్నా, నచ్చచెప్పి రవళిని పెళ్ళిచేసుకు న్నాడు. ఆ రాత్రికే హనీమూన్‌కు బయల్దే రాడు.

వాళ్ళు తిరిగొచ్చేసరికి పావని, సుధాకర్‌ల పెళ్ళికూడా జరిగిపోయింది. ప్రసాదరావే కలగజేసుకుని వాళ్ళ పెద్దలను ఒప్పించి, దగ్గరుండి మరీ జరిపించాడు.

"ఏం? దివాకర్‌గారూ... మీ హనీమూన్ ప్రయాణం ఎలా జరిగింది? " అడుగుతున్న సుధాకర్ గొంతువిని, అప్పుడే పనిలో తల దూర్చిన దివాకర్ గభాల్న తలపైకెత్తి చూశాడు.

సుధాకర్ పక్కన పావని కూడా వుంది. ఆమెను చూసి దివాకర్ ఒక్క క్షణం నివ్వె రపోయాడు. తనకు తెలీకుండానే ముఖం పాలిపోయింది. 'బాగానే జరిగింది' అన్నాడు సుధాకర్ అడిగిందానికి బదు లుగా. కుశల ప్రశ్నలయ్యాక తన సీట్లోకి వెళ్తున్న పావనిని అలాగే చూస్తుండిపోయాడు సభ్యత కాదని తెల్సి కూడా. పడగ విప్పిన తాచులా ఆమె జడ అటుఇటు ఊగుతుంటే, దివాకర్ కనురెప్ప వెయ్యటం కూడా మరచి తదేకంగా గమనిం చసాగాడు.

అది చూసి ప్రసాదరావు ముసిముసిగా నవ్వుతూ "ఏవఁయ్యా దివాకరూ పాత చింతకాయ పచ్చడి విలువేంటో ఇప్పటికైనా అర్థమయిందా? " అన్నాడు.

"సున్నగా రుబ్బి కమ్మగా తాలింపువేస్తే పాత చింతకాయపచ్చడైనా ఎంతో రుచిగా ఉంటుంది" ఎటో ఆలోచిస్తూ పరధ్యాన్నంగా అన్నాడు దివాకర్.

✦

'రెండు ప్లేట్లు పెసరట్టు, రెండు ప్లేట్లు ఉప్మా' సర్వర్‌కి ఆర్డరిచ్చి కబుర్లలో పడ్డారు నిర్మల, నీరజ.

వాళ్లిద్దరూ ఆ హోటల్ పక్కనే ఉన్న కాలేజీలో బి.ఏ. ఆఖరి సంవత్సరం చదువుతున్నారు.

"ఆ కౌంటరులో కూర్చున్నతను చూడవే ఇందాకటినుంచి మనవైపే చూస్తున్నాడు" నీరజ అంది.

"అతనా- అతనీ హోటల్ ప్రొప్రయిటర్ కొడుకుట. మూడు రోజులనుంచి చూస్తున్నాను. అతను మనవైపే చూస్తున్నాడు. పైకి మర్యాదగా కనిపిస్తారు. అందమైన ఆడపిల్లలు కనిపించే సరికి సభ్యత మరచిపోతారు" కోపాన్ని ప్రదర్శించింది నిర్మల.

"అది వాళ్ళ తప్పు కాదే తల్లీ మననింత అందంగా పుట్టించిన ఆ దేముడి తప్పు" ఇద్దరూ పగలబడి నవ్వుకున్నారు.

"ఆc అన్నట్టు చెప్పడం మరిచిపోయాను. వీడు మొన్న నేను ఒంటరిగా కాలేజీ నుంచి ఇంటికి వెళుతూంటే వెనకాల పడి నిన్ను ప్రేమిస్తున్నానూ అని ఏదేదో కూశాడు. నేను కోపంగా చూస్తే హడలిపోయి పారిపోయాడు. అందుకే నావైపు అలా చూస్తున్నాడు" గర్వంగా అంది నిర్మల.

"అరె ఇతనే ఒక రోజు నేను షాపింగ్‌కి వెళ్ళి వస్తూంటే నా వెనకాల పడి లవ్ లెటర్ అందించాడు. నేను నాలుగూ దులిపితే పారిపోయాడు" నీరజ చెప్పింది.

ఇద్దరివీ అబద్ధాలేనని ఇద్దరికీ తెలుసు. అతడు తన వైపు చూస్తున్నాడని నిరూపించుకోవాలని ఇద్దరి ఆరాటం.

ఇద్దరికీ చాలా సంతోషంగా ఉంది. అందమైనవాడు, ఇంత పెద్ద హోటల్ ప్రొప్రయిటర్ కొడుకు తమ వైపు అంతగా చూస్తున్నాడంటే ఇద్దరికీ చాలా గర్వంగా ఉంది. కాని ఇద్దరికీ బాధగానూ ఉంది. అతను ఎవరిపై ఆసక్తిగా చూస్తున్నాడో తెలియక.

సర్వర్ కొంచెం లేట్ చేస్తే బాగుండునని పించింది ఇద్దరికీ. కానీ సర్వరుకేం తెలుసు టిఫిన్‌తో రెడీ అయ్యాడు. ఇద్దరూ టిఫిన్ తీసుకొంటూ, అతనికేసి ఓరగా చూస్తూ కబుర్లు చెప్పుకోవడం మొదలుపెట్టారు. అతడు మధ్య మధ్యలో వీరివైపు చూస్తున్నాడు.

కాలేజీ టైమ్ అయిపోయిందని తొందరగా టిఫిన్ ముగించి మళ్లీ రేపు వచ్చి అతడిని చూడవచ్చు అని ఇద్దరూ వెళ్దామని లేచారు.

"ఏమండీ" అన్న పిలుపుకి ఇద్దరూ తలెత్తి చూశారు. ఎదురుగా అతను.

# సింక్

– బద్దిగం పాండురంగారెడ్డి



ఇద్దరి గుండెలూ వేగంగా కొట్టుకున్నాయి.

ఏమిటన్నట్టు చూశారిద్దరూ అతని వైపు.

"మూడు రోజులనుంచి చూస్తున్నాను. మీరు టిఫిన్ తిన్నాక ప్లేట్లలో చేతులు కడగటం ఏమీ బాగుండలేదండీ. మేం సింకులు ఎందుకు పెట్టించాం? మీలాంటి చదువుకున్న వాళ్ళే ఇలా చేస్తే ఎలాగ. ప్లేట్లు తీసుకు వెళ్ళే బాయిస్‌కి కష్టం. అయినా ప్లేట్లలో చేతులు కడిగితే బల్లంతా డర్టీగా తయారవుతుంది. పెద్ద పెద్ద హోటల్స్‌లో అలా కడక్కూడదండీ. ఈ విషయం చెబుదామనే ఇందాకటి నుంచి చూస్తున్నాను. రేపటినుండి దయచేసి సింకుల్లో చెయ్యి కడుక్కోండి' చెప్పేసి వెళ్లిపోయాడతను.

మాటరాక నిలబడిపోయారిద్దరూ. ✦

# 'అట్టడుగు స్వరం' పై సమీక్షలు

జూలై 2005 'చతుర'లో ప్రచురితమైన డాక్టర్ కె.ఎన్. మల్లీశ్వరి నవల 'అట్టడుగు స్వరం' పై అందిన ఉత్తమ సమీక్షలు

## మరో ప్రపంచం కోసం

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

గ్రామాల్లో సాగుతున్న పెత్తందార్ల ఆగడాలు, అస్పృశ్యత, కులద్వేషాలపై, హాస్టళ్లలో జరిగే అక్రమాలూ, అవినీతి భాగోతాలపై తిరుగుబాటు బావుటా ఎగరేసి, వాటిని అరికట్టడానికి యువత ఉద్యమించాలనే సందేశాన్ని అందించిన చక్కని నవల 'అట్టడుగు స్వరం'. అవినీతి, అక్రమాలు లేని, విద్య ఉపాధులతో వెలుగొంది పరిశుభ్రతతో పచ్చని చెట్లతో పరిఢవిల్లే మరో ప్రపంచం కోసం ఈ నవలలో సుజాత వినిపించిన అట్టడుగు స్వరం ఉచ్ఛస్వరమై ప్రగతి కోసం నినదించాలని రచయిత్రి ఈ నవలద్వారా అభిలషించారు. ఈ నవలలో కథానాయిక సుజాత ఒక చైతన్య స్రవంతి! ఒక అగ్నిజ్వాల! మొక్కవోని ధైర్యంతో అచంచల విశ్వాసంతో తన లక్ష్యసాధన కోసం అహరహం శ్రమించి విజయం సాధించిన ఆమె నేటి యువతకు మార్గదర్శకం. ఆమెకు తోడుగా నిలిచిన రవికిరణ్, ప్రసాద్ పాత్రలను కూడా రచయిత్రి ఉన్నతంగా మలిచారు. సుజాతను వివస్త్రను చేసి గ్రామంలో నడిపించినపుడు, ఆమెపై అత్యాచారం జరగబోయినపుడు, ఆమెపైనా, రవికిరణ్‌పైనా దాడి జరిగినప్పుడు, హాస్టల్లో రూపకు అన్యాయం జరిగినప్పుడు పాఠకుల హృదయాలు బాధతో ఘూర్ణిల్లుతాయి. హరిజనులచేత ఆలయప్రవేశం చేయించిన సంఘటన రక్తపాతరహిత విప్లవంగా, వివేకవంతంగా మలిచిన తీరు ప్రశంసనీయంగా వుంది. చివరగా సుజాత సర్పంచ్ ఎన్నికల్లో పోటీచేసి నెగ్గి ప్రజాసేవ చేయడానికి తనమార్గాన్ని సుగమం చేసుకోవడం నవలకు చక్కని ముగింపు. ఈ నవల నవసమాజ నిర్మాణానికి, నిస్వార్థసేవకు నేటి యువతను ఉత్తేజితుల్ని చేస్తుందనడంలో సందేహంలేదు.

–గుబ్బల సత్యనారాయణమూర్తి, జగ్గన్నపేట

## సమకాలీన ఇతివృత్తం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

దుశ్శాసన వారసుడు సర్పంచ్ సుదర్శనరావు సభ్య సమాజం తలదించుకునేటట్టు సుజాతను వివస్త్రను చేసి మెడలో చెప్పుల దండతో గ్రామ వీధుల్లో తిప్పడం నీచాతి నీచం. ఈనాటి ప్రభుత్వ వసతి గృహాలు మురికి కూపాలు, అనారోగ్య నిలయాలు, కామకేళి గృహాలు. అభం శుభం ఎరుగని ఆడపిల్లలను బలవంతంగా పరుల కామదాహానికి సమిధల్ని చేసి గర్భవతులయ్యాక అజ్ఞాతంగా ప్రాణం తీయడం మనస్సుని తొలిచే సంఘటనలు. వార్డెన్ల దుష్టపాలనలకి పరాకాష్ట. సుదర్శనరావు వంటి నరరూప రాక్షసుల వికృత చేష్టలు, వంతపాడే భజన బృందం... ఇలా ఈ నవల్లోని కథనం, పాత్రలు, సంఘటనలు మనం చదివిన, విన్న, చూసిన గాథల్ని స్ఫురణకు తెస్తాయి. ముఖ్యంగా రవికిరణ్ పాత్ర ఉదాత్తమైంది. అతడు విలేఖరిగా, లెక్చరర్‌గా ఊరి నుండి హైదరాబాద్ చేరిన సుజాతకి

హాస్టలులో సీటు వచ్చేటట్టు చేయడం లగా యతు సదరు హాస్టలు అక్రమాలు బైట పెట్టి వార్డెన్ని సస్పెండు చేయించడం, తదుపరి అనువుగాని పరిస్థితులకి తలవంచి ఇద్దరూ కలిసి కాకినాడ రావడం, అక్కడ సుజాతని విద్యావతిగా, సమాజ సేవకురాలిగా, ఆర్జనప రురాలిగా తీర్చి దిద్దడం, ప్రతి ఆపదనుండి కాపాడడం, ఆమె విజయానికి అండగా, ప్రేర ణగా నిలవడం, బంధుత్వాన్ని వదులుకోవడం, చివరికి నిండు మనస్సుతో సుజాత, ప్రసాద్‌ల వివాహాన్ని కాంక్షించడం నవలకి ఆయువు పట్టులు. అందుకే అవమానాలు జరిగిన స్వగ్రామంలోనే సుజాత చాలా విజయాలు సాధించి గ్రామ సర్పంచ్‌గా గెలిచింది. గ్రామ ప్రథమ పౌరురాలి గౌరవం అందుకుంది. సమకాలీన సమస్యలకి ప్రాతినిథ్యం గల ఇతి వృత్తం కాబట్టి ఆపకుండా చదివించింది.

– ఎ. రత్నకుమారి, ఆదోని

## అబల కాదు సబలే

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఏ కులంలో పుట్టినా స్త్రీ అబలకాదు సబలే అని నిరూపించిన "అట్టడుగు స్వరం' ' కథాకథనం తీరు అభినందనీయం. స్త్రీ శక్తి స్వరూపిణి. తననుతానే రక్షించుకొని సమాజాన్ని కూడా సరిదిద్దగలిగే శక్తి స్త్రీలో వుంది అని నిరూపించింది సుజాత పాత్ర. సుజాతలోని ఆవేశం, ఆలోచన, పట్టుదల ప్రతి స్త్రీని ఆలోచింపజేసేదిలావుంది. హాస్ట ళ్ళలో జరుగుతున్న అవినీతిని కళ్ళకు కట్టి నట్లు రచించారు. ఎవరో వస్తారు ఏదో చేస్తారు అని ఎదురు చూడకుండా సుజాత తన స్వంత ఖర్చుతో కాలనీలో కొంత మార్పుకు నడుం కట్టడం, కాలనీ వాసులకు అది ఆదర్శప్రాయం కావడం బాగుంది. మారుమూల గ్రామాలలో అట్టడుగువర్గాల వారి స్థితికి అద్దం పట్టారు రచయిత్రి. సమాజంలో వారి స్థితి ఎంత దయనీయమై నదో ఈ నవలలో తేటతెల్లం చేశారు.

సుజాత ధ్యేయాన్ని, లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆమెకు పూర్తి ధైర్యాన్నిస్తూ, సమా జంలో గుర్తించబడేలా తీర్చిదిద్దిన రవికిరణ్ పాత్ర అభినందనీయం. సుజాతకు రవికిరణ్ గురువుగా, స్నేహితునిగా, ఆత్మీయునిగా అండగా నిల్చి ఆమె తన లక్ష్యాన్ని నెర వేర్చుకోవడానికి నిస్వార్థంగా తోడ్పడడం బాగుంది. సుజాత తనకు తోడుగా ప్రసా ద్‌నే ఎంచుకోవడం సబబుగా వుంది. సుజాత, రవికిరణ్‌లు ఒకే ఇంట్లో వున్నా చుట్టుపక్కల వారి ఆదరాభిమానాలను చూరగొన్నారంటే అందుకు వారి సత్ప్రవర్తనే కారణం. "అట్టడుగు స్వరం" నవల ఆద్యంతం ఉత్కంఠను కలిగించింది. చదువు తున్నంతసేపు మనం కూడా అందులో ఒక పాత్ర అయిపోతాం. రచయిత్రి డా॥ కె. యన్. మల్లీశ్వరిగారు అభినందనీయులు.

– బి. విజయలక్ష్మి. విశాఖపట్నం

## దళితులు కూడా...

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

సాంఘిక దురాచారం సమాజాభివృద్ధికే అవరోధం. మూఢనమ్మకాలు మనిషి మనుగ డకే ఆటంకం. మానవత్వాన్ని మరిచి మతం పేరుతో మనిషికీ, పశువుకీ తేడా లేకుండా అధికారాహంకారంతో, స్వార్థాన్నే కవచంగా అభం-శుభం తెలియని అట్టడుగు వర్గాల ఆడపడుచుల్ని హింసించే కిరాతకుల ఆగడా లకి దర్పణం పట్టిందీ 'అట్టడుగు స్వరం'.

సుజాత ఉన్నతమైన వ్యక్తిత్వంతో మొదట తన ఊరికి తిరిగి వచ్చినప్పుడు ఊరిలోని తన తోటివారు, పెద్దలు ఆమెను చూసి ఆశ్చర్యపోయారు. ఆ పాత్రను మలచిన తీరు బాగుంది. ఒకప్పుడు తనని అవమానించిన ఆ ఊరి సర్పంచ్ సుదర్శనంపై పగ తీర్చుకోడానికి వచ్చిన సుజాత, రవికిరణ్ సుదర్శనం తమ్ముడని తెలిశాక ఆమెలో రగిలిన ఆవేశం, కసి బాగా రాశారు. ప్రసాద్ అండ, రవికిరణ్ ఆదరణ సుజాతకి ఆయుధాలుగా కాగా కులమత కుతంత్రాలకు ఎదురొడ్డి పోరాడింది. లేడీస్ హాస్టళ్ళ దుర్భర పరిస్థితి, అక్కడ సుజాత పడే కష్టాలు, ఊళ్లో అట్టడుగు వర్గాల పాఠశాల చదువు, కాలేజీ విద్యార్థుల ఆగడాలు నేటి సమాజంలో విద్యాలయాల దుస్థితిని తెలియజేశాయి. చదువుకి, విజ్ఞానానికి కులమతాల తేడా లేదనే నగ్న సత్యాన్ని సుజాత వల్లించిన వేద మంత్రోచ్చరణే తార్కాణం. సుజాత తప్పేం లేకపోయినా చేయని నేరాన్ని మోపారు. అగ్ర కులాల అహంకారానికి బలైపోయిన ఆమెను నగ్నంగా చేసి ఊళ్ళో ఊరేగించే సన్నివేశం ప్రతి పాఠకుడి హృదయాన్ని ద్రవింపచేసి కుల పెద్దల్ని, గ్రామాధికారుల్ని నరికి పోగులు పెట్టాలనే ఆవేశానికి లోను చేసింది. దేశప్రగతికి, సమాజాభివృద్ధికి పల్లెలే కాదు అక్కడ నివసించే దళితులు కూడా పట్టుకొమ్మలనే నగ్న సత్యాన్ని చాటిందీ నవల.

*– అవుసలి ఆంజనేయులు, మూసాపేట.*

# మర్రివిత్తనం

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

కె.యన్. మల్లీశ్వరి అట్టడుగు స్వరం నవల చాలా బాగుంది. 74 ఏళ్ల వయస్సు గల నేను పుస్తకం పట్టుకున్నది మొదలు ముగింపు దాకా వదిలిపెట్టలేదు. రాత్రి 12 గంటలకు పూర్తి అయింది. అసలే వృద్ధాప్యం, దానికి తోడు రెండు చేతుల వేళ్లూ తిమ్మిర్లు. ఎక్కువగా రాయలేకపోయినా ఈ లేఖను మీరు మర్రివిత్తనంగా భావించాలి. ఆడపిల్లకు అంత దుర్భరావమానం చేసిన సుదర్శనానికి, పదవీచ్యుతి ఏమాత్రం చాలదు. ఆ దుష్టుడికి ఒళ్లంతా కత్తిగాట్లు పెట్టి, కారంజల్లి, పెడరెక్కలు విరిచికట్టి, ఆ ఊరే కాక చుట్టుపక్కల గ్రామాలన్నిటిలోనూ ఊరేగించాలి. మరో సంగతి ఇన్నాళ్లూ, సుదర్శనం దుష్టచేష్టలన్నీ చూసి భరించిన తల్లి, సుగుణవంతుడైన రెండవ కొడుకుతో సహా విదేశానికి వెళ్ళినట్లు నవలలో చూపిస్తే బాగుండుననిపించింది నాకు. ఇన్నాళ్లూ చచ్చిపోయాడో, ఉన్నాడో, తెలియక దుఃఖించిన మాతృమూర్తి శేషజీవితమైనా, పాపిష్టి పెద్దకొడుకు ముఖం చూడనక్కరలేకుండా, ధర్మాత్ముడైన చిన్న కొడుకు వద్ద ఆనందంగా ఉన్నట్లు రాస్తే బాగుంటుందని కూడా నాకు అనిపించింది. రచయిత్రి రచనా శక్తి ఇతోధికంగా పెంపొందుగాక!

*– అల్లమరాజు సర్వమంగళ, గొల్లప్రోలు.*

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 2 57 50 528, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 2 5 518181, 2 5 598787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 27 5444; Karimnagar: 22 5216; Rajahmundry: 2468991; Suryapet: 221143; Guntur: 2512142; Nellore: 2 5 587 54; Srikakulam: 220901; Kurnool: 25281 5; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276 576; Ongole: 256777; New Delhi: 2 575 5440; Mumbai: 22819557; Chennai: 282 52 590; Bangalore: 2558 5804.



# చుక్క మకరందం కోసం చిన్ని పిట్ట విన్యాసం

ఏ పూవులో ఎంత మకరందం దాగి ఉందోనని వెతుక్కుంటున్న హమ్మింగ్‌బర్డ్ విన్యాసమిది. వాసన పట్టే గుణం అట్టేలేని ఈ విహంగం పువ్వు పువ్వునూ వెతుక్కుంటూ మకరందాన్ని జుర్రుకుంటుంది.

